శ్రీసీతారామ పరబ్రహ్మణేనమః





కర్తృద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణ తత్వకందార్థ దర్పులు

క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత

## పరమతత్వ కందములు

శ్రీమద్బృహద్వాశిష్ఠ అచలబోధ సిద్ధాంత గురుపీఠ సంప్రదాయకులగు
శ్రీమత్పరశురామ సీతారామ స్వాములవారి
ప్రియశిష్యులగు
శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే
రచింప

శ్రీమత్పూర్ణానంద వాడపల్లి ఆగదాసుగారిచే
భావార్థసహితములు వ్రాయబడి

శ్రీ భక్తానంద తూడి దేవమాంబగారి
ప్రియశిష్యులగు

శ్రీ బ్రహ్మానంద బండారి సత్తయ్యగౌడ్
వరంగల్‌వారి ద్రవ్యసహాయమున ముద్రింపబడినవి.

రిజిష్టరు కాపి 1981 వెల రూ 10-00

శ్రీసీతారామ పరబ్రహ్మణేనమః




శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణ తత్త్వకందార్థ దర్పణాలు

క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత

## పరమతత్త్వ కందములు

శ్రీమద్బృహద్వాశిష్ఠ అచలబోధ సిద్ధాంత గురుపీఠ సంప్రదాయకులగు

శ్రీమత్పరశురామ సీతారామ స్వాములవారి

ప్రియశిష్యుండగు

శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే

రచింప

శ్రీమత్పూర్ణానంద వాడపల్లి ఆగదాసుగారిచే

భావార్థసహితములు వ్రాయబడి

శ్రీ భక్తానంద తూడి దేవమాంబగారి

ప్రియశిష్యుండగు

శ్రీ బ్రహ్మానంద బండారి సత్తయ్యగౌడ్

వరంగల్ వారి ద్రవ్యసహాయమున ముద్రింపబడినవి.

రిజిష్టరు కాపి 1981 వెల రూ 10-

10-00

ఓం

శ్రీసీతారామ పరబ్రహ్మణేనమః

ద్వైతాద్వైత రహిత పరమతత్వము వేదవేదాంత సారాతీతము
సకల సుకవిజన మనోరంజిత విలాసము. జననమరణ ప్రవాహమును
సులభోపాయముగా దాటించదగిన
శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణ తత్వకందార్థ దర్పాలు

క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత

## పరమతత్వ కందములు

శ్రీ గోలకొండ యనబడు, హైద్రాబాద్ రాజధానియందు భరద్వాజస
గోత్రపయః పారావార రాకాసుధాకరుండగు

**శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే**

రచింపబడిన నిజప్రతి

**శ్రీమత్పరశురామ సీతారామస్వాముల వారిచే**

పరిష్కరింపబడి

**శ్రీమత్పూర్ణానంద వాడపల్లి ఆగదాసుగారిచే**

భావార్థసహితములు వ్రాయబడినది

**శ్రీ బ్రహ్మానంద బండారి సత్తయ్యగౌడ్**

వరంగల్ వారి ద్రవ్యసహాయమున ముద్రింపబడినది.

(1000) ప్రతులు

**1981**



వెల. రూ. **10-00**

# * తొలి పలుకు *

ఓ సజ్జనులారా !

భారతీయ సామ్రాజ్యములో చారిత్రాత్మకమై కాకతీయుల పరిపాలనతో ప్రసిద్ధికెక్కిన ఓరుగల్లు నివాసులగు కౌండిన్య ఋషి గోత్రోద్భవుండగు వాడపల్లి వేంకటేశంగారి ద్వితీయ కుమారుడగు పాపయాఖ్య కనకమాంబ గర్భ సంజనితుండనై అప్పదాసు నామధేయుండనగు నేను నా మతగురుండగు పరవస్తు పాపయాచార్యుల వారిచే అష్టాక్షరి మంత్రము గ్రహించి శ్రీశివరామ దీక్షితాచల గురుపీఠ సాంప్రదాయకులగు శ్రీసచ్చిదానంద ప[illegible] వేంకటేశ్వరవధూత స్వాములవారి ప్రియ శిష్యుండగు శ్రీనిర్మలానంద నేతి వేంకటేశ్వర స్వామివారిచే పరిపూర్ణబోధజెంది కృతార్థుండనై యుండ మద్గురు పుత్రులు నాతో నిట్లువచించిరి.

సహోదరా ! ఈ ప్రపంచములో కాయిక గురువులు అనుభవ వేదాంతుల మని తినరానిపదార్థములదినుచు చేయరానిపనులు చేయుచు కొన్ని శ్లోకములు, పద్యములు, పాటలు, కంఠపాటము జేసి కొన్నిటాటోటు మాటలునేర్చి తమతమ ఊహాపోహల చేత ఈ కందార్థములకు , కందపద్యములకు అర్థముగ్రహించి భ్రాంతిరహితులమని అమాయిక ప్రజలకుజెప్పి మోసముజేయుచు పవిత్రమగు అచలపరిపూర్ణబోధను అపవిత్రముగా జేయుచున్నారు.

కాబట్టి మీరు శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్రుల వారిచే రచియింపబడిన గ్రంథములోని పూజా విధానముకు సద్గురుమూర్తిచే విన్న కన్న మార్గమును శిష్యుడు బోధరూపముగా ఒప్పజెప్పినట్లు గీతార్థదరువులున్ను మరియు శక్తిద్వయనిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థదరువులకు క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ కందములకు గూఢార్థములువ్రాసి ఆ కాయికగురువుల దురోబ్ధలను రూపుమాపుటకు ప్రయత్నించవలయునని ప్రోత్సహించిరి. అందుకు నాసహోదరుల వాక్యములను త్రోసిపుచ్చరాదని తలయూపితిని కాని గ్రంథమునుజూడ గొప్పనైనగ్రంథము నన్ను నేనుజూడ అక్షరశూన్యుడను. గ్రంథములోనున్న పద్యములకు భావార్థములు వ్రాయ నలవియగునుగాని సద్గురుమూర్తిచే తెలుసుకొనదగిన గూఢార్థములనెట్లు వ్రాయ

వలయునో అని ఆలోచించుచుండ మద్గురుపుత్రులు గూఢార్థములవదలి భావార్థములే వ్రాయుడని వచియించిరి. నర్థానికి సరెనని నేను ఈగ్రంథమునకు సద్గురుమూర్తి కరుణచే తోచినంతవరకు భావార్థములు వ్రాసితిని. యిందులో యేవన్నలోపము లున్నచో అచలపరిపూర్ణభావజ్ఞులు నాయందు దయదలంచి అట్టిలోపములు తెలిపినచో పునర్ముద్రణమున సవరించుకోగలను. పండితులు నీర క్షీరన్యాయము ననుసరింతు రని కోరుచున్నాను.

ఇట్లు
భా వా ర్థ క ర్త.

AD. 1949
శాలి. శకం: 1871

---

# నో టీ సు

ఈ గ్రంథము శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్యకు సర్వహక్కులు జెందియున్నవి కావున యితరులు యెవరేకాని ముద్రించి ప్రకటించ గూడదు. ఒకవేళ ముద్రించి ప్రకటించినచో చట్టరీత్యా బాధ్యులై శిక్షకు అర్హులగుదురు.

ఇట్లు
శ్రీమదచల గురు పీఠ రాజయోగాశ్రమ
సేవాసమాఖ్యా
అ ధ్య క్షు లు

# శ్రీబ్రహ్మానంద బండారి సత్తయ్యగౌడు

## వంశమాల

శ్రీ మహాసద్విచార సంపన్న భాగ్యవంతులైన శివనగర్, వరంగల్ పట్టణ వాస్తవ్యులు గౌడకులజులైన కమండల్య మహారుషి గోత్రోద్భవులై, కరుణ సంభూత తత్పరులైన భండారి వంశమున జన్మించిన పోశెట్టిగౌడుగారు. ధర్మమందాశక్తిగల వాడై గౌరమ్మను తన ధర్మపత్నిగ స్వీకరించి వీరికి భగవాన్ సంపత్తి ఫలప్రదాను డైన మైసయ్యగౌడు అనునామాంకిత బిరుదుదరించి లోకోపకారతత్పరుండై మల్లమ్మను తన ధర్మపత్నిగ వివాహమాడి అన్యోన్య దాంపత్య జీవితము గడుపుచు వీరికి సుగుణో దయులైన ముగ్గురు కుమారులు అనగా పోశెట్టిగౌడు, సత్తయ్యగౌడు, రాంకిష్టయ్య గౌడు. ఇద్దరు కుమార్తెలు. గోపమ్మ గౌరమ్మ. పుణ్యసంపత్తిచే జన్మించిన వీరిలో శ్రీ బండారి సత్తయ్యగౌడు అనె సద్గుణ నామాంకితముబొంది పుణ్యతత్పరుండై శ్రీ రామాంభను తన ధర్మపత్నిగ వివాహమాడి లోకోపకారమునకై ఎన్నో పుణ్య కార్యములు ఆచరించి దానధర్మ సంపన్నులై గంభీరహృదయ మొకంబుగలవారై, శాంతిపరులై, జన్మకర్మల నివారణకు యోచించి అచల రుషి శ్రీమత్పూర్నానంద వాడ పల్లి ఆగయార్యుల ప్రియశిష్యులైన శ్రీ భక్తానంద తూడిదేవమాంబ పాదసన్నిదికి జేరి ధర్మోపదేశముబొంది కృతార్థులైరి. వీరి పుణ్య భాగ్యంబున వంశోద్ధారకులగు 3-కొమారులు అనగా రాజలింగేశ్వర్, వీరి ధర్మపత్ని అమృతమ్మ. 2. మహేశ్వర్, వీరి ధర్మపత్ని మానెమ్మ. 3. రమేశ్, 4-కుమార్తెలు 1. వనజాక్షి, 2. సరస్వతి, 3. జయమ్మ, 4. సుజాత. శ్రీ సత్తయ్యగౌడుగారికి మనుమలు 2. శ్రీధర్, సుధీర్. మనుమరాండ్లు 3. కుసుమకుమారి, సుకేసిని, సునీత. భాగ్యవంతుడైన మాతృ శ్రీ దేవ మాంభచే బ్రహ్మానంద దీక్షితముబొంది, సర్వేంద్రియనిగ్రహుడై, శ్రీమదచలగురు

పీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య అభివృద్ధికై భక్తజనోల్లాసముకై ద్రవ్యసహాయముచేసి, 1000 ప్రతులు శుద్ధనిర్గుణ తత్వకందార్థదర్వులు భావార్థసహితము భక్తితో సమర్పించినందులకు ధర్మదాతలగు శ్రీబ్రహ్మానంద బండారి సత్త్యయ్యగౌడు, రామాంబ వారి కుటుంబమునకు సద్గురుమూర్తి ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి నొసంగుగాక అని శ్రీగురుమూర్తిని ప్రార్థించుచున్నాము.

ఇట్లు
శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య.
రిజిష్టర్. నెం. 654.
హెడ్డాఫీస్, హైద్రాబాద్, ఆం. ప్ర.

# విషయ సూచిక

—( కందార్థ దర్వుల అకారాది సూచిక )—

# తప్పు ఒప్పుల పట్టిక

| పేజి | కందార్థ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 21 | 6 | 4 | నిజన్ | నిర్జ |
| 25 | 18 | 2 | వివి | విన |
| 31 | 32 | 2 | చుట్టు | చట్టు |
| 32 | 37 | 3 | | తెల్పుట. వినుటమికి పెద్దకథకా సంతాతా మొకరీతి |
| 47 | 76 | 2 | యెరులేదు | యెరుకలేదు |
| 69 | 136 | 3 | పోదొట్లు | పోదోలు |
| 72 | 146 | 3 | యీ పతిపూర్ణ | యీ పూర్ణ |
| 72 | 147 | 2 | వెలిగెరుక | వెరిగెరుక |
| 120 | 266 | 4 | నీవునెనెక్కడబోక | నీవునెక్కడబోక |
| 123 | 274 | 1 | పుఛిట | పుట్టింట |
| 126 | 280 | 1 | నచియించిన | వచియించిన |
| 57 | 103 | 1 | న్మ్రరిక | న్మ్రరికి |
| 58 | 106 | 4 | లేదని | లేనిదని |
| 58 | 107 | 2 | నాతత | నాతతి |
| 34 | 41 | 1 | దెరుగనే | దెరుగునే |
| 34 | 41 | 1 | చదలు | చెదలు |
| 34 | 42 | 4 | బల్కిదిరి | బల్కిరిది |
| 35 | 43 | 3 | విదమీ | విధమూ |
| 63 | 120 | 2 | మాయనలెందా | మాయనేలెందా |
| 60 | 112 | 1 | చాదశక్ష | పంచాతశ |

ఓం

# శ్రీ శివరామదీక్షిత గురుపీఠ అనుష్ఠానవిధి

## గురుపరంపర ధ్యానం

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సాంప్రదాయకర్తృభ్యో వంశ ఋషిభ్యో మహద్భ్యో నమోగురుభ్యః సర్వోపప్లవరహిత ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో బ్రహ్మై వాహమస్మి అహం పదార్థ రహితః.

* శ్రీమహావిష్ణు సాంప్రదాయం *

శ్లో॥ శ్రీ బ్రహ్మవిద్యా గురువిష్ణుసూర్యం
శ్రీయాజ్ఞవల్క్యం జనకం శుకంచ
సాందీపమీశం కృష్ణంచ అర్జునం
వందే గురున్మే గురుపాదుకాంతం॥

శ్లో॥ అంబికా శివయోగీంద్రం
అచల బోధ ప్రవర్తనం
సాదుమార్గ వేమనార్య
సద్గురుభ్యోన్నమోన్నమః॥

* శ్రీశివరామదీక్షిత సాంప్రదాయం *

శ్లో॥ శ్రీధరస్వామినంనిత్యం । బోధకారణమవ్యయం
భావాతీతమహాంవందే । సుఖజ్ఞానైకనిర్మలం॥

శ్లో॥ వందారుజనమందారం । వందేహంతన్నిరంతరం
రామద్గువంశజంశుద్ధం । శివరామాఖ్యదీక్షితం॥

శ్లో॥ కామాదిరిపుహంతారం । కారుణ్యామృతసాగరం
కంబాలూర్యప్పరావాభి । దాసంవం దేద్యమద్గురుం॥

శ్లో॥ శ్రీమత్పరశురామాన్వ । యాబ్ధిచంద్రిమనోరమం
నిత్యానందమహంవందే । సీతారామగురుంపరం॥

శ్లో॥ శ్రీమత్కారుణికం మహాగుణనిధిం । పూర్ణప్రభాభాసురం
నిర్ద్వంద్వంనిరపేక్ష కామమమలం । నిస్సంగమాద్యంవిభుం
నిత్యానందమయం నిరీహమతులం । నిర్ముక్తకర్మాధికం
శ్రీకృష్ణాఖ్య గురుంభజేహమనిశం । శ్రీచిత్తసంతోషణం॥

శ్రీసీతారామాయనమః

శక్తిద్వయనిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్వ కందార్థదర్పణాలు

భావార్థసహితములు

## * ౧ సభావిజ్ఞాపన ౨౧ *

### ప్రథమ అధ్యాయము

౧ కం॥ జనులారజననమరణము, లనుదొలగన్ , ద్రోయజాలు లక్షణయుతమై, వినువారికి, కనువారికి, తనలావెరిగించు దీని, తప్పక వింటే, అప్పుడెవార, లెప్పూడుగంటే, కనుకావినబుద్దైతె వినుడీ చదివెద మీకె, కనుగొనమనసైతెకను డీ పుస్తకమంత, తప్పకవింటే, అప్పుడె వార, లెప్పూడుగంటే॥ ॥౧॥

ఓజనులారా! జననమరణములను తొలగింపజేయు లక్షణములుగలిగి యున్న ఈ గ్రంథమును తప్పక విను (ఇతరభావములను విడచి జనన మరణ భ్రాంతిరహితము కావలయునను లక్షణములుగల) వారికిని యెప్పుడు జదువు వారికిని తనయొక్క స్థితినిదెలుపును కాబట్టి వినయిష్టముగలవారు వినుడి నే జదివెద లేదా మీకుచదువ యిష్టమున్నచో ఈగ్రంథమాసాంతము జదువుడని భావము.

౨ కం॥ వినవలెనని కనవలెనని, మనసందున కోర్కెగల్గు మనుజులెవినుడీ, వినజేసెదకనజేసెద, ఘనమగుయీబోధ విన॥ కననొల్లనట్టి మనుజులచనుడొ, చ్చినత్రోవబట్టి, తినుమంటె పులివల్లదనిలోకులనవింటి, గనుకానెవినవాలెననవొరాదదు విన, కననొల్లనట్టి, మనుజులచనుడొ, చ్చినత్రోవబట్టి॥ ॥౨॥

ఓమానవులారా! ఈగ్రంథము వినవలయుననిగాని చదువ వలయు ననిగాని మదిలోనిచ్ఛగలవారలే వినుడి వినుపించెద జదివి చెప్పెద గొప్పనైన ఈ అచలబోధను వినవలయునని చదువవలయునని ఇష్టపడనివారు వచ్చిన

త్రోవ (జనన మరణప్రవాహమును) బట్టియే వెళ్లడు పులిముందరకుబోయి నన్ను తినుమన్నచో అది తినదను లోకసామెత ననుసరించి మిమ్ముల వినుమని చెప్పుటకు నోరాడుట లేదనిభావము

౩ కం॥ ననుమిము నేగని పుస్తక • మునుజేసితి దీన్ని మీరుముదమున వినుడం • చనుటయు మిమునను మీరలు • గనుగొని వినిపించుమనుట ॥ కల యిట్టిమాట • బోధనుమేల్కా • గనలేదెచ్చోటా • ఘనులార యిటువంటి కలలోముచ్చటలాడి • గొనకోని మీరు మేల్కొని • మేల్కొల్పుడినన్ను • కలయిట్టిమాటా • బోధనుమేల్కా • గనలేదెచ్చోటా॥ ॥౩॥

ఓగొప్ప బుద్ధిమంతులారా! నా విషయమును మీ విషయమును గుర్తించి నేనీపుస్తకమును వ్రాసితిని సంతోషముగా మీరీ గ్రంధమును వినుడని చెప్పుటయు మిమ్ములను నన్నును మీరుగుర్తించి (గ్రంధములోనిభావము) దెలుపుమనుటయు ఈ రెండు విషయములు కల ఈమాట బోధయను మేల్కానుచూడ జాలదుసుమా! ఈలాటి కలలోసంభాషించి ప్రయత్నించు మీరు మేలుకొని నన్ను మేలుకొలు పండనిభావము.

౪ కం॥ ఒరులొరులు నేనునేనని • యొరులను తన నెన్నడెరుగకున్న బయలులో • నరుదెంచితననుతాగని • పరులనుగని లెస్స నేను • పరులాని యనుచూ • యెరిగేయెరుకే • బయలుండగనుచూ • నిరతాము తానెందు నిలువాకుండుటకూనై • విరచిస్తి దీన్నెరుకావినెనా శిల్వదు నేను • పరులాని యనుచూ • యెరిగే యెరుకే • బయలుండగనుచూ॥ ॥౪॥

పరులు పరులని నేను నేనని పరులనుతనను యెప్పుడు దెలియకుండు నట్టిబయలులో వచ్చి తనను తానుగనుగొని పరులనుచూచి చక్కగా నేను పరులుయని తెలుసుకునే యెరుకబయలు నుండగాంచి యెల్లప్పుడు తానెచ్చట యుండకుండుటకై నేనీగ్రంధమును వ్రాసితిని దీనినివింటె యెరుకనిలువ జాలదని భావము.

౫ కం॥ ఎరుకనుకల లోపలనే • నరుదెంచితి మీరలట్ల యరుదెంచి తిరీ • యెరుకజన నేను మీరలు • యెరుకతొజనువారమనుచు • యెరిగేటి కొరకూ • గ్రంథము జేస్తి • నెరిగీయీావరకూ • గురుబోధంచను మేల్కా

నరులారచేకొంటె ♦ యెరుకానె కలజోలి నెరిగున్న నిల్వదం ♦ చెరిగేటి కొరకు ♦ గ్రంధముజేస్తి ♦ నెరిగీయీవరకు॥ ॥౫॥

ఓనరులారా! యెరుకయనుకలలోపల నేనును మీరలు వచ్చితిమి యెరుక పోయినచో నేనును మీరలు యెరుకతోబాటు పోవువారమని యెరుగుకొరకు ఈ విషయము నేనిదువరకే గుర్తించి ఈ గ్రంథమును రచియించితిని గురుబోధ యనుమేల్కను గ్రహించితె యెరుకయనుకలసంగతి తెలిసెనేని నిలువజాల దని భావము

౬ కం॥ శ్రీమించునచలబోధను ♦ యేమహనీయుండుజేసి ♦ యెగజల్లెనో యీ ♦ భూమిన్ సుజనులకొరకా ♦ రాముడుగన్వయ ఃశివ ♦ రామాదీక్షితులన్ ♦ తలచియప్పా ♦ రావ్ గుణతతులన్ ♦ ప్రేమాతా బొగడీనే భూమి నిజన్రుపరుశు ♦ రామాసీతారామాస్వామికి మ్రొక్కి శివ ♦ రామదీక్షితులన్ ♦ తలచియప్పా ♦ రావ్గుణతతులన్॥ ॥౬॥

ఐశ్వర్యాతీతమైన అచలబోధను యేమహాపురుషుడు ఈ ప్రపంచము లోని సాధుజనులకొరకు ప్రకాశింపజేసెనో అట్టిరామడుగు శివరామదీక్షితుల వారిని మనంబునధ్యానించి కంఠాలూరి అప్పరావుసుగుణముల ప్రేమతో వినుతించి భూసురోత్తముడగు పరుశురామ సీతారామస్వామికి నమస్కరించి అని భావము.

౭ కం॥ శ్రీమత్సీతారామ ♦ స్వామికృపన్ జెప్పనయ్యె ♦ సదసద్రహితం ♦ బేమిపదార్థమొ దానిని ♦ యీమహికందార్థములుగా ♦ వివినరయ్యా ♦ ఓజనులార ♦ యిటుగనరయ్యా ♦ వేమారునేమిమ్ము వేడెంతియ సుమ్మి ♦ నామీదకృపజేసినను జదువుమని మీర ॥ విచినరయ్యా ♦ ఓజను లార ♦ యిటుగనరయ్యా॥ ॥౭॥

ఓజనులారా! శ్రీసీతారామస్వామి కరుణచే శరీరాత్మల రహితపరచునట్టి అచలపరిపూర్ణబోధను కందార్థములుగా వ్రాసితిని దీనినిమీరు వినండి లేదా చదువండి నామీద దయయుంచి నన్ను చదువుమని మాటిమాటికి మిమ్ముల ప్రార్థించునది యిదేసుమా! యని భావము.

౮ కం॥ శివరామదీక్షితుల ♦ శిష్యవరుండప్పయ్యమంత్రి ♦ యతని శిష్యుడీ ♦ భువిపరుశురామవంశో ♦ ద్భవ సీతారాములతని భక్తుడసుమ్మీ ♦

తత్ప్రోధపరి • యుక్తూడసుమీ • స్థవనీయులగుమీరుత్సాహముతో యీగాధ • వినుండి నేకందార్థములచేవినిపింతు • భక్తూడసుమీ • తదోప్రధపరి • యుక్తూడసుమీ॥ ॥౮॥

శ్రీశివరామదీక్షితుల వారిశిష్యుడు అప్పారావుగారును వారిశిష్యుడు పరుశురామ సీతారామస్వాములవారును వారిశిష్యుడను స్థవనీయులగుమీరు నేను వినిపించె ఈకందార్థములను ఉత్సాహముతో వినండని భావము

౯ కం॥ మనుసిచ్చివినుడియికనొక • మనవిది నాపాలిగురుని మది లోపలనే • నునుచుకొని పెద్దలాజ్ఞను • పనిబూనుక చేస్తిరిట్టి • పద్యాము లిన్నీ • తప్పొప్పులే • ర్పడదిద్దుండన్నీ • ఘనమతిమంతూలు గనుకానే ప్రార్థిస్తి • ననుమీకటాక్షేక్షణముల వీక్షింపుమ • పద్యాములిన్నీ • తప్పొప్పులే • ర్పడదిద్దుండన్నీ॥

ఓబుద్ధిమంతులారా! నామనవినిమీమనసారవినండి నాసద్గురువును మనస్సులోధ్యానించి పెద్దలుజెప్పిన పనినిబూనుకొని ఈపద్యములను రచియించితి మీరుదయతో ననుజూచి ఈపద్యములలోని తప్పులు ఒప్పులుగా దెలియునట్లు సవరించుడని వేడుచుంటినని భావము.

౧౦ కం॥ వినిమీరివిసిద్ధుండని • పనిబడిప్రార్థించనేల • పరుసము నినుమి • ట్లను నెస్వర్ణముజైమని • తనకైతానౌనుసన్ని • ధానామందుంటే • తెల్పుడియను • మానామిందుంటే • మనవీజేసునెపాలిమ్మని లేగతల్లికి • తనకై తానిచ్చునుదయచేసితా సన్ని • ధానామందుంటే • తెల్పుడియను • మానామిందుంటే॥ ॥౧౦॥

ఈ గ్రంథమునువిని మీరు తప్పొప్పులేర్పడ సవరించుడని (ఈ గ్రంథము తమవద్దనున్నందున) నే ప్రార్థించునవసరములేదు అదెట్లంటె పరుసవేది తన సమీపముననున్న ఇనుమును తనకుతానె బంగారమునుగాజేయును అమ్మా పాలిమ్మనియడుగకముందె లేగకు పాలిచ్చి ఆవుపోషించునని భావము.

౧౧ కం॥ అప్పకవీయ్యా ద్యాంధ్రిము • లొప్పగుమాఘాదికావ్య మొగి జదివికృతిన్ • తప్పనికవులకు సమముగ • తప్పులు లేకుండజెప్ప తత మౌనకృతినీ • ఊహనుజేస్తి • మరినేనీకృతినీ • గొప్పాపక్షులతోటి కొదువా

పక్షులుసాటె • కుప్యాకపీఠిని కూడ్యాడెటందూకు • తరమౌనాకృతినీ • ఊహనుజేస్తి • మరినేనీకృతినీ॥ ॥౧౧॥

అప్పకవీయాది ఆంధ్రగ్రంథములను మాఘాటికావ్యములను జదివి గ్రంథముల రచియించు కవులవలె తప్పులు లేకుండ రచియించు శక్తి నాయందులేదు ఈ గ్రంథమును నాఊహచేత రచియించితిని గొప్పపక్షులతో సమానముగా చిన్నపక్షులకు ఆకాశగమనమునందు శక్తియుండదని భావము.

౧౨ కం॥ ఛందంబెరుగక పద్యము • లెందుకు జేసెదవటంచు యెందరనిననే • సందేహింపక జేసితి • నిందులతప్పంటె మీర • లివి దిద్దేరనుచూ• నేఁజదివితె • చెవియొగ్గి వినుచూ • అందముగా చిత్తమందిట్లు తలపోసి • కంధార్ధములను మీ ముందారబెట్టితి • యివిదిద్దేరనుచూ • నేఁజదివితె • చెవియొగ్గివినుచూ॥ ॥౧౨॥

చందోలక్షణముదెలియక పద్యములెందుకుజేసితివని యెవరన్నప్పటికి యేసంశయములేక నేను ఈ కందార్థముల రచియించితి ఇందులో తప్పులు వుంటె మీరుదిద్దురనియు నేనుచదివినచెవివంచి విందురనియు మనస్సుతో దలంచి మీముందరబెట్టితిననిభావము.

౧౩ కం॥ పునరుక్తికలిగియుండిన • వినికోపము జేయవలదు • వేడుకొనియెదన్ • వినువారు దూరపర్థము • గనవలె దగ్గర నటంచు • గల్పించినానూ • తెలియకకాదీ • గ్రంథాములోనూ • జననీ జనకులు • తమతనయూల పునరుక్తి • వినగోరుదురు తప్పించనకా నేనదిదెలిసి • కల్పించినానూ తెలియకకాదీ • గ్రంథాములోనూ॥ ॥౧౩॥

ఈ గ్రంథమునందలి పునరుక్తిదోషములను వినికోపగించకూడదని ప్రార్థించెదను వినువారలు దూరపు అర్థము సమీపమున చూడవలయునని పునరుక్తులు కల్పింపబడిన వంతియేకాని తెలియకకాదు అదెట్లంటె తమతనయులు మాటిమాటికిపలికెడు ఒకమాటనె తప్పనితలంచక తలిదండ్రులు వినగోరుచుందురని భావము.

౧౪ కం॥ ఇదియాంధ్ర కవిత్వంబని • మది రోయందగదు దీనిమర్మమరయుడీ • పదియారువన్నె పసిడిని • ముదమునతోల్పెట్టెనుంత ముట్టా

కుండుదురా • లోకులుచేత • బట్టాకుండుదురా • యిదిగాక కులహీనుడిచ్చిన ద్రవ్యాము • విదితాముగాయెంతవేత్తలైనను దాన్ని • ముట్టాకుండుదురా • లోకులుచేత • బట్టాకుండుదురా॥ ॥౧౪॥

ఈ గ్రింథము ఆంధ్ర కవిత్వమని మనస్సులో అసహించుకొనక దీని సారము తెలుసుకొనుడు పదహారు వన్నెలుగల బంగారమును తోలుపెట్టెలో పెట్టితె ముట్టకూడదని విడచిపెట్టకుండా మానవులు సంతోషముతో తీసుకొనెదరు యిదేగాక చండాలుడు ద్రవ్యమును యిచ్చినట్లైతె యెంతవిద్వాంసుడైనను దానిని వదలిపెట్టకుండ తీసుకొనుననిభావము.

౧౫ కం॥ ఆసాంతము యీగ్రంథము • ప్రాసి యతుల్ శబ్దగణము భావము యుక్తుల్ • జూచి సరిపడనిచోటను • యీ సభలో పెద్దలెల్లా • యిదిదిద్దవలెనూ • దిద్ది యిదేనా • మదికద్దవలెనూ • మీసాటివారికి వ్యాసాట లేదుంటే • నాసాటివారి బ్రితె్కసాటిగాకుండు • నిడిదిద్దవలెనూ • దిద్దియిదేనా • మదికద్దవలెనూ॥ ॥౧౫॥

ఈ గ్రంథము నాసాంతముగ జదివిచూచి ఇందలి ప్రాస, యతి, శబ్దము, గణము, భావము యుక్తులు అనువాటిని చక్కగా నాలోచించి ఈ సభలోగూర్చున్న పెద్దలెల్లరు నా మనస్సునకు సరిపడునట్లు విసుకుజెందక తప్పులున్నచోట దిద్దవలయును మీ వంటివారికి విసుకులేదు విసుగుజెందినచో నాబోటివాని బ్రతుకు యేపాటిదగునని భావము.

౧౬ కం॥ తప్పొప్పులు రెంటెన్నెరుగని • తప్పు తనందుండి దీన్ని • తప్పనికూసే • తప్పుడు నరునకుజెప్పెద • చప్పుడు చాలించుమనుచు • సభవారువినగా • సరిసరెనాని • సభవారిట్లనగా • చెప్పిన వినకుంటెతప్పువానిదెసుమ్మి • తప్పుగలిగిన వెనుక గొప్పావాడెట్లౌను • సభవారువినగా • సరెసరెనాని • సభవారిట్లనగా॥ ॥౧౬॥

తప్పొప్పులు రెండుదెలియని దుర్జనుడు ఈ గ్రంధమును తప్పని జెప్పెనేని సభవారందరువిని సెబాస్ అనునట్లు ఆ నరున్నిమా టలాడవలదని చెప్పుచున్నాను. వినినియెడల వానిదే తప్పగును. తప్పుగలవాడు గొప్పవాడు కాదని భావము.

౧౭ కం॥ ఇలుజొచ్చి గ్రామసింహము • కలదొంతులగూల్చునింటి గరితలొరుగు దొం • తులు చక్కజేతు రట్లనె • యిలసుకవిజనోక్తి తప్ప

లెంచూ దుర్జనుడూ • తప్పొప్పుగా • వించు సజ్జనుడూ • తులలేని బుద్ధి మంతులు సర్వజ్ఞులుమీరు • తెలుసూ నా తలపు నేదెలిపెదేమిక తప్పు • లెంచూ దుర్జనుడూ • తప్పొప్పుగా • వించూ సజ్జనుడూ॥ ॥౧౭॥

ఇంటిలో జొరబడిన కుక్క దొంతులను పడగొట్టును. ఆ దొంతులను అయింటి ఇల్లాలు సవరించుకొనును. ఆరీతిగనే దుర్జనుడు సుకవిజన భాషణ ములను తప్పులుగా భావించును సజ్జనుడు తప్పుల నొప్పులుగా సరిజేయును. అన్నియు దెలిసిన బుద్ధిమంతులగు మీకు నేజెప్ప నవసరము లేకుండగనే నా అభిప్రాయము దెలియునని భావము.

౧౮ కం॥ తనగొప్ప నెంచరేమో • యనుటని తలపోసి సాధు • జన కృతకవితల్ । వినడితరులు వినగోరిన • వివికనరాదనుచు మనసు విరుచూ దుర్జనుడూ • వినివినిపించు • వేడ్కసజ్జనుడూ • కనవచ్చె ముంజేతి కంకణాలకు వేరే • ఘననిల్వుటద్దాము గావాలెనా మనసు • విరుచూ దుర్జ నుడూ • విని వినిపించు • వేడ్కసజ్జనుడూ॥ ॥౧౮॥

ప్రజలవద్ద తన గౌరవము నిలువదను భావముచే సాధుజన విరచిత ములగు గ్రంథములను తాను వినకుండుటయేగాక ఇతరులనుగూడ విననివ్వడు దుర్జనుడు తానువిని ఇతరులకు వినిపించుచుండుసజ్జనుడు ముంజేతి కంకణ ములకు నిలువుటద్దములు అవసరములేదని భావము.

౧౯ కం॥ ఆగామీ కథయెట్లన • బాగుగ వివరింతు చెవుల • పండు వుగాగన్ • ఆగమ నిగ మోప నిషత్సాగర మధి తార్థమవల • సాంగోపాంగ ముగాన్ • దయతో వినుడి • సాంగోపాంగముగాన్ • ప్రాగర్థ చరమార్థ యోగాములకును సం • యోగాము గావించి నే గుర్తెరిగినదంత • సాంగో పాంగముగాన్ • దయతోవినుడి • సాంగోపాంగముగాన్॥ ॥౧౯॥

ముందు నేజెప్పబోవు విషయమెట్టిదనగా మీ చెవులకు యింపగునట్లు ఆగమనిగమోపనిషత్తులనెడి సముద్రమును తరచగా తేలిన సారాతీతము నెరిగి శరీరమును ఆత్మను ఈ రెంటిని ఒక్కటిగాజేసి నేను తెలిసికొనిన దంతయు సంపూర్ణముగా దెలిపెదను దయతో వినండని భావము.

౨౦ కం॥ మోదమున ప్రొద్దుబోకకు • వాదిప్రతివాదులగుచు వర గురు శిష్యుల్ • వాదించిరనుచు నొక సం• వాదము గల్పిస్తి కలగా వదలాక

వినుడీ • మొదటినుంచి • తుదవెళ్లాగనుడీ • వేదాంతార్థాతీతవేత్తాలు మీరిందు• యేదేద సవరించుడిదెనా విజ్ఞాపన • వదలాకవినుడీ • మొదటినుంచి • తుదవెళ్లాగనుడీ॥ ॥౨౦॥

సంతోషముగా కాలము గడచుటకై గురుశిష్యులు వాది ప్రతివాదులుగా వాదించిరనుచు కలగానొక సంవాదము గల్పించితిని ఈ గ్రంథమునందలి తప్పులను వేదాంత అర్థ అతీతవేత్తలగు మీరు సవరించి దీనిని మొదటినుంచి తుదవెళ్లవినుడని లేక చదువుడని ప్రార్థించెదనని భావము.

౨౧ కం॥ కొంచములో సరిపుచ్చక • పెంచిన విగ్రంథమనుచు పెద్దలలుకగన్ • మించిన వేడ్కతొవినుడీ • పెంచిన యర్థంబునేదె • ల్పెదలోకులెల్లా • అర్థము దెలిసి • మదినుల్లాసిల్లా• పెంచితి పెంచితి• గొంచాము వెడలూపు • వుంచుచుండెనది లోతంచెంచి• నామదిని దె • ల్పెదలోకులెల్లా • అర్థముదెలిసి • మదినుల్లాసిల్లా॥ ॥౨౧॥

ఈ గ్రంథమును కొంచెముతో పూర్తిజేయక పెంచినందులకై పెద్దలైన మీరు కోపగించక సంతోషముతో వినండి పెంచిన కారణమేమనగా లోకులందరు ఈ అర్థమును తెలుసుకొని మనస్సులో సంతసించుటకై పెంచితిని కొంచెము వెడల్పుతో నుండెడు నదిలోతని పెంచినాని భావము.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైతరహిత పరమతత్వే సభావిజ్ఞాపనన్నామ ప్రథమోధ్యాయః॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి అగదాసు రాజయోగిచే

వ్రాయబడిన భావార్థ సహితములు

( స భా వి జ్ఞా ప న ) అను

మొదటి అధ్యాయము.

—(౦)—

# * ౨. గురుశిష్యానోన్య దర్శనం ౧౦ *

౨.౨ కం॥ సాధనసంపత్తియుగల • సాధకుడొక నరుడు ఘోర సంసారమునన్ • బాధపడలేకతనపు • ణ్యోదయమున గురునిగాంచి • యురుతరభక్తిన్ • శరణని మ్రొక్కి • మరిమారియుక్తిన్ • బోధాజేయుము పుణ్యపురుషా మాబోంట్లాకు • సాధించదగు ముఖ్యసాధనాకిపల్కె • నురుతర భక్తిన్ • శరణని మ్రొక్కి • మరిమారియుక్తిన్॥

సాధన చతుష్టయ (నిత్యానిత్య వస్తువివేకము ఇహామూతార్థఫలభోగ విరాగము శమాది షట్కము ముముక్షత్వము) సంపత్తి గలిగిన ఒక పురుషుడు ఘోరసంసార దుఃఖముల ననుభవించలేక తన పూర్వ జన్మమునజేసిన పుణ్యవిశేషముచే సదురునిగాంచి భక్తిపూర్వకముగా నమస్కరించి ఓ పుణ్యపురుషా నా వంటి పామరులకు సాధించదగిన ముఖ్యసాధనమును బోధింపుమని పదేపదే ప్రార్థించెనని భావము.

౨౩ కం॥ శరణాగతుడగు శిష్యుని • కరుణామృతదృష్టిచేత గని మోదము • ముప్పిరిగొనమృదు వాక్యములను • పరమదయాళుండు గురుడు • భక్తావినుమనెనూ • సంశయమిక • బాధింపదనెనూ • పరిపూర్ణమొకటి లేనెఱుకానెదొకటి • పరిపూర్ణమెరుకాల నెరిగియెరు కనుమాను • భక్తావినుమనెనూ • సంశయమిక • బాధింపదనెనూ॥ ॥౨॥

శరణాగతుండగు శిష్యుని సద్గురుండు దయామృతదృష్టితో జూచి సంతోషము ముప్పిరిగొన ఇట్లనియెను శిష్యా! ఒకటి పరిపూర్ణము ఒకటి లేనియెరుక అనునవి రెండుగలవు పరిపూర్ణమును లేనియెరుకను చక్కగా దెలుసుకొని యెరుకను వదలుము నిన్ను యేసంశయము బాధింపదని భావము.

౨౪ కం॥ యేసాధననీకెందుకు • పీసానికిబనికిరాదు విను మాయయ్యా • నేసాధులచేవిన్నది • యేసాధన లేనిబోధ నెరిగింతుబోకూ • సాధనలందు • మరిగితేరాకూ • యేసాధనల జోలియేనాల్లననీవు • బాసాజేసితివేని పరిపూర్ణబోధనే • నెరిగింతుబోకూ • సాధనలందు • మరిగీతేరాకూ॥ ॥౩॥

ఓ నాయనా! అష్టాంగయోగాది సాధనలు ఈ బోధముందు కాసువీసమునకైనను కొరగావు నేను జెప్పబోవునది శ్రద్ధతోవినుము నేనుసాధువుల

వలన వినిన సాధన రహితమగు అచలబోధను బోధించెద సాధనల జోలికి పోయితివేని నీవునావద్దకురాకు సాధవల జోలికి పోనని ప్రమాణము జేయుమని భావము

౨౫ కం॥ గురువర పరిపూర్ణంబన్ • యెరుకన నివిరెండుయెట్టి వెరుకోద్భవమెం • దెరుక జనుచోటుయెయ్యది • యెరుకను నేనెట్లవిడిచే • దెరుగించుమనెనూ • అట్లనెగురు • డెరిగింతుననెనూ • చరణాధూళినిరెండు కరమూలగొనితన • శిరమూన ధరియించి శరణాని యాశిష్యు • డెరిగించుమనెనూ • అట్లనెగురు • డెరిగింతుననెనూ॥ ॥౪॥

గురువర్యా! పరిపూర్ణము యెరుక అను ఈరెండు యెటువంటివి యెరుక యనుదానికి ఉత్పత్తిలయము లెచ్చోట యెరుకను నేను వదలుటయెట్లు అని ప్రార్థించగా గురుడు యెరిగించెదననెను అప్పుడు శిష్యుడు సద్గురుపాదధూళి హస్తములతో శిరమున ధరియించుకొని నమస్కరించి ఇట్లనియెనని భావము.

౨౬ కం॥ మొదలచలము నెరిగించెద • విదితముగాలేని యెరుకి వివరింతు పయిన్ • తుదకెరుకను విడిపించెద • మరిలో నామాటనమ్మి మరి వింటివేనీ • చంచలబుద్ధి • మానుంటివేనీ పదుగూరునినుజూచి భళి శాబాసీ తోవ • కెదురూలేదనెటట్టు యిదుగో నేజేసెద • మరివింటివేనీ • చంచల బుద్ధి • మానుంటివేనీ॥ ॥౫॥

ఓ వత్సా! మొదట అచలమును చూపించి తరువాత లేనియెరుకను తెలిపి చివరకు యెరుకను విడిపింతును. నామాటనమ్మి నీ చలనస్వభావము వదిలితినా నినుచూచిన వారందరు మెచ్చుకొని ఈ మార్గమునకు వేరులేదని అనునట్లు జేసెదనని భావము.

౨౭ కం॥ మీరంతవారు గనుకనె • చేరితి మీపాద సేవసిద్ధించుటకై • యేరింతవారు జగమున • లేరని నామదికిదోచే • లెస్సాగవినుడీ • ఆజ్ఞకుమీర లేదు కనుగొనుడీ • యేరీతి వినుమంటె నారీతి వినియేద • మీరానతివ్వండి తోరామా యీబోధ • లెస్సాగ వినుడీ • ఆజ్ఞకుమీర • లేదూ కనుగొనుడీ॥

గురువర్యా! మీరంతటి సామర్థ్యము గలవారుగనుకనే మీపాదసేవజేయుటకై [illegible] మ్మాశ్రయించితిని ప్రపంచమున మీవంటి మహానుభావులు కలరా?

మీ ఆజ్ఞకు బద్ధుడను మీరు చెప్పిన చొప్పున వినుచుందును గొప్పగు యీ అచలబోధనుదయతో బోధించండని భావము.

౨౮ కం॥ మొద్దులనైనను దొల్తురు • బద్ధుల బద్ధత్వమడవి పాల్జేతురుమీ • వద్దికివచ్చినగని • పరిశుద్ధపుబోధోక్తమైన • సూక్తూలుగుప్పి • అందుకు తగిన • యుక్తూలుజెప్పి • పెద్దాలచే మీ ప్రసిద్ధిని వినివసి • దిద్దూడి నేవట్టి బుద్ధిహీనుడ నన్ను • సూక్తూలుగుప్పి • అందుకుతగిన • యుక్తూలు జెప్పి॥ ॥౭॥

సద్గురువర్యా ! మీసన్నిధికివచ్చిన మొద్దులను గాని బద్ధులనుగాని చూచి నిర్మలమగుబోధకు తగిన మాటలను యుక్తులను దెలిపి పాలింతురను ప్రసిద్ధిని పెద్దలచేవిని బుద్ధిహీనుడగునేను మిమ్మాశ్రయించవచ్చితిని నన్ను మన్నించి నాకు బోధను దయచేయుడని భావము.

౨౯ కం॥ సూటిగను బోధనామది • నాటినదిక చాలుచాలు ననినీకైనీ నోట నీవు బల్కు దాకను • చాటువలను జెప్పుచుందు • సరేనా నామాటా • రాగోరూచు • మరినేనీమాటా • నూటికొక్క టెసేలు మాటాని తెలియూము • మాటిమాటికివట్టి పాటాలేమిటికింక • సరేనా నామాటా • రాగోరూచు మరి నేనీమాటా ॥౮॥

ఓ శిష్యుడా ! ఈ అచల పరిపూర్ణబోధ నామనస్సునకు నాటినది. ఇక చాలుచాలునని నీయంతట నీవుజెప్పు నంతవరకు ఉపమానములనే జెప్పుచుందును నీకిదియిష్టమా ? సందేహముంటె అడుగుము నూరుమాటలకు ఒక్కమాటెచాలు వృధాపాటలతో మాటలతో పనిలేదని భావము.

౩౦ కం॥ తానే ననకనుండిన • దానికి పేరేమి బయలుతాతేనను చున్. నేనెననిమెద నేనెవ్వరు • లేనెరుకవు వుంటివుంటే • లేనేలేననుమీ • అంటిని అంటె • లేనేలేవుసుమీ • లేనేలేనని నేను లేకా పోయినవెనుక • తానుండు గద వుంటె దాన్నెల్లెరిగెదవీవు • లేనేలేననుమీ • అంటిని అంటె • లేనేలేవు సుమీ॥ ॥౯॥

శి॥ తానునేను అనియనక నంతటనున్న దానిపేరు యేమి? ॥గు॥ బయలు॥శి॥ తాను నేనుఅనెడు నేనెవ్వరు? ॥గు॥ లేనియెరుకవు॥శి॥ ఉంటిని॥గు॥

ఉంటె లేనెలేననుమీ ॥శి॥ అంటిని ॥గు॥ అంటె లేనెలేవుసుమీ॥శి॥ అంటిని ॥గు॥ అంటె లేనెలేవుసుమీ? ॥శి॥ అయితె లేనెలేనని నేను లేకపోయిన పిదప తానుం డుగదా? ॥గు॥ ఉంటె దానినెట్లు దెలుసుకుందువని భావము.

౩౧ కం॥ మీరాజ్ఞాయిచ్చివుంటిరి • నేరుపుతో బయలు నెరుక నెరిగించి పయిన్ • పేరణతు యెరుకనని యి • ట్లారీతిన యెరుకపరచు • మయ్యా ప్రొక్కేనూ • అనుమానాము • జెయ్యాకియ్యేడనూ• సారెకు మీపాద జలజా యుగ్మము నాహృ • త్సారాసముననిల్పి సల్పూచుపూజా నో • యయ్యా ప్రొక్కేనూ • అనుమానాము • జెయ్యాకియ్యేడనూ॥ ॥౧౦॥

దేశికవర్యా! పరిపూర్ణమును యెరుకను తెలియజేసి యెరుకను వదిలించె దనని మీరు శలవిచ్చితిరి మీ రేశంకయునులేక బోధి-పుడు మీ పాదపద్మము లను నాహృదయ పీఠమునని ల్పి పూజించి వందనము లర్పించెదనని భావము.

ఇతి శ్రీ మధ్భాగత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే గురుశిష్యాన్యోన్య దర్శనన్నామ ద్వితీయోధ్యాయః॥ ఇతి పూర్ణానందవాడపల్లి ఆగదాసు రాజయోగిచే వ్రాయబడిన భావార్ధసహితములు (గురుశిష్యాన్యోన్య దర్శనం) అను రెండవ అధ్యాయము.

## * ౩ అ చ ల ల క్ష ణం. ౧౩ *

౩౨ కం॥ పుట్టుట గిట్టుటలేకను • పుట్టేగిట్టేటి యెరుక పోడిమెరుగ కన్ • చుట్టువలె కదలకుండును • బట్టబయల్ యిట్టిదెరిగి భావింపదగనూ • యెరుకలేక • సేవింపదగునూ • వట్టియాశలచేత పట్టూబడకను యీ • గుట్టూ దేశికునోట గట్టిగ దెలుసూక• భావింపదగునూ• యెరుకలేక• సేవింపదగునూ॥

ఓ శిష్యుడా ! జనన మరణములులేక జనన మరణములుగల యెరుకను తెలియక కదలని రాయివలె నుండునట్టిది బట్టబయలు. అని తెలుసుకొని యెరుక లేక సేవించవలయును. వృధా ఆశలకు లోబడక ఈ రహస్యము సద్గురువువలన యెరుంగ వలయునని భావము.

౩౩ కం॥ యెరుకైన రీతినుండును• యెరుగన శక్యంబటంచు యెన్నిన యెరుకన్ • యెరుగుదుననినను యెరుకకె • యెరుగుట దుర్లభముసుమ్మి• యీవుత్తబైలూ • యెరుగనె యెరుగ • దెరుకానీబైలూ• పెరుగాదూ విరుగాదూ వొరుగాదూ తరుగాదు • అరుగాదు కరుగాదు తిరుగాదు మొరుగాదు • యీ వుత్తభైలూ • యెరుగనెయెరుగ • దెరుకానీబైలూ॥ ॥౨॥

ఓ శిష్యుడా ! ఈ బట్టబయలు తెలిసినట్టుగనే యుండి తెలియుటకు వశముగాకుండునని యెన్నినయెరుకను తెలియుదుననినను యెరుకే బట్టబయలు యెరుకను తెలుసుకొనదు యెరుకా బట్టబయలును యెరుగదు ఈ వుత్త బట్ట బయలు పెరుగదు విరుగదు ఒరుగదు తరుగదు అరుగదు కరుగదు తిరుగదు• మొరుగదని భావము.

౩౪ కం॥ పలుకున బలుకగరాకను • తలపోయుద మనినమదికి దగులక యెపుడున్ • ములు గృచ్చసంధిలేకను • కలిగున్నది బట్టబయలు గదరా మాయన్నా• యిదిగోచూడు• కదులాడోయన్నా• పలుకన్న బలుకాకతలపన్న దెరుగాక • చలియెండ వానాల నలయాక నిలచుండు • కదరామాయన్నా • ఇదిగోచూడు • కదులాడోయన్నా॥ ।౩॥

ఓ శిష్యుడా! ఈ బట్టబయలు ఇట్టిదని పలుకుటకు సాధ్యముగా కను ధ్యానించెదమన్న మనస్సున కందకను ముల్లు గృచ్చుటకుగూడ వీలులేకుండ

నున్నదిగదా చూడు మదుగో కదలదు మాటలాడదు తలంచదు చలికి యెండకు, వానకు చలించకనున్నదని భావము.

౩౫ కం॥ సామర్థ్యమేమి జూపదు • కామక్రోధాది కములగలయద నిశమే • బాములెరుంగదు యితరులు • యేమనినను మారుబల్కాదిబట్ట బైలూ • దీనికి మొక్కేరితరాజేజేలూ • నామ రూప క్రియనటనా లన్ని యుమిరి • యేమాని యనరాక యేకామైయున్నాది • యీబట్టబైలూ • దీనికి మొక్కే • రితరాజేజేలూ॥ ॥౪॥

ఓ శిష్యుడా! ఈ బట్టబయలు యెట్టిశక్తిని జూపక కామక్రోధాది అరిషడ్వర్గములకు జిక్కక యే ఉపాధులనెరుంగక యెవరు యేమన్నను బదులు బల్కక నామరూపక్రియ నటనల కతీతమై ఇట్టిదట్టిదని చెప్పుట కలవిగాకుండనున్నది. దీనికి దేవతలెల్లరు నమస్కరింతురని భావము.

౩౬ కం॥ దానము ధర్మము సుగుణ • ధ్యానము ప్రతిమార్చనంబు తజ్జప తీర్థ • స్నానము లివిముక్తిదమని • మానవులొనరించ బయలు మాటాడదేమీ • యెరుకేలేదు • మాటాడదేమీ • ఔనూ కాదనకా నీవనక నేనన కొక్క • మేనైనతాగాక మితిమీరియున్నాది • మాటాడదేమీ • యెరుకేలేదు మాటాడదేమీ॥ ॥౫॥

ఓ శిష్యుడా! దానము ధర్మము సగుణధ్యానము విగ్రహార్చనము దానికి సంభందించిన జపములు తీర్థస్నానములు అనునవియే మోక్షమిచ్చునని మానవులాచరించుచున్నను బయలు మాట్లాడదేమీ ఈ బట్టబయలునందు యెరుక యనునది లేదుగనుక మాట్లాడదు ఈ బయలు అవునని అంగీకరించక కాదని నిషేదించక నీవనిచెప్పక నేనని చెప్పుకొనక యెనమిది తనువులలో యే తనువునుగాక అమితమైయున్నదని భావము.

౩౭ కం॥ ఇంతంతని యనరానిది • వింతలుజేయనిది యెన్ని విధములగనినన్ • చింతలెరుంగని దీ బయ • లెంతని వినిపింతు నేనీ కేమిర పృథుకా సకలాదేశములాయం • దంతటానిండున్న దదుగో పరిపూర్ణము • యేమిరపృథుకా • తెల్పుటవినుట • యిక పెద్దకథకా॥ ॥౬॥

ఓ బిడ్డా! ఇంతటి అంతదియని చెప్పుట కలవిగానిదియును ఆశ్చర్యము కలిగించ నిదియును యెన్నివిధముల విచారించిన యేచింత దెలియని

ఈ బయలును గురించె నేనె తని చెప్పుదును. చెప్పుట వినుట ఒక పెద్ద కథ నుగా చేయుటకాదు. యెల్లప్పుడు ఒకేరీతిగ సకలదేశముల యందంతట నిండి యున్నది అదిగో పరిపూర్ణమని భావము.

౩౭ కం॥ ఆకాశాదికభూతా • నీకాత్మ కమగుచు యెరుకయీ జగ మయ్యేన్ • రాకడపోకడ దీనికి • పాృకటముగ దేనిలోనొ బట్టాబయలదిరా• కాదనియంటె • వట్టీపల్కిదిరా • లోకత్రియము తనలోపాలతిరుగాగ • జోకా తోడుతదాని జోలెరుగనిదియే దొ • బట్టాబయలదిరా • కాదనియంటె • వట్టీ పల్కిదిరా॥ ॥౭॥

ఓ శిష్యుడా ! ఆకాశాది పంచభూతములయొక్క చేరికలో గలిగినట్టిదే యెరుక ఈ యెరుకయే జగత్తయ్యెను దేనిలో ఈజగత్తుయొక్క రాకపోకడ లుండునొ అదియే బట్టబయలు అదికాదంటివా వుత్తమాటయేసుమా మూడు లోకములు తనలో దిరుగుచున్నదాని విషయమెరుగని దేదియో అదియె బట్టబయలని భావము.

౩౮ కం॥ తండోప తండములుగా • దండిఝషాదికము లన్ని తన లోపలను • ద్దండతనుండిన పోయిన • నుండు సముద్రంబు యెరుగా కుండూ నెప్పటికీ • పరిపూర్ణమి • ట్లుండూ నెప్పటికీ • యెండామావులరీతి నుండేటి బ్రహ్మాండ • ముండినపో యీనరెండూ గుర్తెరుగాని • నుండూ నెప్పటికీ • పరిపూర్ణమి • ట్లుండూ నెప్పటికీ॥ ॥౮॥

ఓ శిష్యుడా ! గుంపులు గుంపులుగా పెద్దచేపలు యెన్నెన్నో తన లోపల నుండినను పోయినను సముద్రమెట్లు దెలియకుండునో పరిపూర్ణమట్లే దెలియకుండును యెండ మావులవలె నుండెడు బ్రహ్మాండము ఉండినను పోయి నను గుర్తెరుంగదని భావము.

౪౦ కం॥ యెరుకతొ వచ్చినవిశ్వము • యెరుకతో జనుగాని నిల్వ దీ బయలైతే • యెరుకతొరాదె రుక తోబో • దెరు కతనం దేమిలేదు యిది నిశ్చయమురా • వుండుంటె యీ యెరుకెతానొరా • యెరుకా యెరిగినవస్తువు వెరుకాని తెలియూము • యెరుకా యెరుగదు బయలునిట్టిదిట్టిదియన • నిదినిశ్చ యమురా • వుండుంటె యీ యెరుకేతానొరా॥ ॥౯॥

ఓ శిష్యుడా! యెరుకతో వచ్చిన ప్రపంచము యెరుకతోనే పోవును. కాని స్థిరముగనుండదు బయలు యెరుకతో రాకపోకడలు లేనిది తనయందు యెరుకె యేమాత్రములేదు ఈమాట సత్యము. రాకపోకడలు యుండినయెడల ఈయెరుక బయలువను యెరుక తెలుసుకొనినవస్తువు యెరుకనిగుర్తింపుము యెరుక ఇట్టిదట్టిదని బయలును గుర్తించదని భావము.

౮౧ కం॥ రవితమసమున్న దెరుగనె • ప్రవిమలదావాగ్నిచదలు బట్టు పెరుగునా • దివమునురాతిరి రాత్రిని • దివమెరుగునె లేమి లక్ష్మి దేవి యెరుగునా • అన్నమునూ భూ• దేవి యెరుగునా • భవనాశస్థితులు రాపాడేటి యెరుకాను • భవనాశస్థితిలేని బయలంటెఱుగదు లక్ష్మి • దేవియెరుగునా • అన్నమునూ భూ • దేవీయెరుగునా॥ ॥౧౦॥

ఓ శిష్యుడా! సూర్యుడు చీకటినిని కారుచిచ్చు చదలును రాత్రిపగలును పగలురాత్రిని లక్ష్మిదారిద్ర్యమును భూమి అన్నమును యెట్లుయెరుగవో అట్లే ఉత్పత్తి స్థితిలయములుగల యెరుకను ఉత్పత్తి స్థితిలయములులేని బయలు యెరుగదని తెలుసుకొనుమని భావము

౮౨ కం॥ యెరుకైన భూతపంచక • మెరుకకు చరణములు కటియు హృదయము గళమున్ • శిరమునయ్యెను క్రమమున • ధరణిమొదల్ జేసి యిట్లు తనయా గుర్తెరుగూ • గగనముబయలం • చనరాదీ మరుగూ • యెరుగాకాకాశామె పరిపూర్ణ మనుచుకొం • దరు బల్కెదిది విని గురిదప్పి యుండేవు • తనయాగుర్తెరుగూ • గగనము బయలం • చనరాదీ మరుగూ॥ ॥౧౧॥

ఓకొడుకా! యెరుకైన పంచభూతములలో పృథివి యెరుకకు పాదము లుగాను జలమునడుముగను అగ్ని హృదయముగాను వాయువు కంఠముగాను ఆకాశము శిరస్సుగానాయెనని తెలియుము ఆకాశమును బయలని చెప్పరాదు ఈ రహస్యము తెలియక కొందరు ఆకాశమనే పరిపూర్ణమనిరి వారిమాటలకు మోసపోకు మని భావము

౮౩ కం॥ విత్తేచెట్టైపుట్టును • విత్తేవిత్తకము రీతి వెలయునుధరపై • విత్తుకు చెట్టుకువేరే • విత్తనమొకటున్నదనిన వినగూడదోయీ • తనకు

దాబు • ట్టును వినవోయీ • విత్తూచెట్టుల రెంటివిధ మీ భూమెరుగాన • ట్లుత్తాబయలెరు గాదు సత్తూచిత్తూలరెంట్ని • వినగూడదోయీ • తనకుదాబు • ట్టునుపినవోయి॥ ॥౧౨॥

ఓ శిష్యుడా! విత్తే చెట్టుగాబుట్టును ఆ చెట్టు విత్తే విత్తనములుగా నుండును చెట్టుకు మూలమైన విత్తునకు విత్తుకు మూలమైన చెట్టుకు వేరేవిత్తన మొకటి ఉన్నదనె మాటలను వినగూడదు తనంతటతానె పుట్టును భూమి విత్తు చెట్టుల అను రెంటియొక్క పరిస్థితులను తెలియనట్లే బట్టబయలు సత్తు చిత్తుల రెంటిని తెలియదని భావము.

ఆఆ కం॥ చెట్టేమూలము విత్తుకు • చెట్టుకుమూలంబు విత్తుక్షితిపై రెండున్ • పుట్టినచచ్చిన రెంటిని • గట్టిగతా నెరుగకుండు • గదరాయీనేలా• నీవిరీతి • గనుగోనవేలా • పుట్టూచుగిట్టూచు పొలుపొందు తనువెరుక • లిట్టి విచిత్రాము లెన్నాడెరుగదుబయలు • గదరాయీనెలా • నీవిరీతి కనుగోన వేలా॥ ॥౧౩॥

ఓ శిష్యుడా! విత్తనానికి మూలము చెట్టు చెట్టుకు మూలము విత్తు ఈ రెండు చచ్చినను పుట్టినను భూమి తెలుసుకొనజాలదు నీవిట్లు యేల తెలుసు కొనజాలవు చావుపుటుకలతో గూడినమే నెరుకలయొక్క చిత్రములను బయ లెన్న డెరుగదని భావము

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైతరహిత పరమతత్వే అచల లక్షణన్నామ తృతీయోధ్యాయః॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు

( అ చ ల ల క్ష ణ ం ) అను

మూడవ అధ్యాయము.

—(౦)—

## -:౪ యెరుక లక్షణం ౨౦:-

౪౫ కం॥ యెరుకే దేహేంద్రియములు, యెరుకే వర్ణాశ్రమములు యెరుకే శ్రుతులున్, యెరుకే నీవును నేనును, యెరుకే సతిసోదరాదు లెరుగుమువత్సా, నేదీర్చెద, నిదుగో నీయిచ్చా, హరి హర బ్రహ్మాది సుర నర గిరి సరి, తరు మృగ ముఖ చరాచరమూలు యెరుకాని, యెరుగుమువత్సా, నేదీర్చెద, నిదుగో నీయిచ్చా ॥ ॥౧॥

ఓ వత్సా! దేహము యింద్రియములు జాతులు ఆశ్రమములు వేదములు నీవు నేను భార్య సోదరులు మొదలగు వారును విష్ణు రుద్రుడు బ్రహ్మ మొదలగు దేవతలున్ను మనుష్యులు గుట్టలు నదులు చెట్లు మృగములు పక్షులు మొదలైన వన్నియు యెరుకేనని తెలియుము నీకోరిక దీర్చెదనని భావము.

౪౬ కం॥ యెరుకే విద్యావిద్యలు, యెరుకే ప్రణవంబు నాదమెరుకే కళయున్, యెరుకే బిందువు చిత్స, త్తెరుకే ఆనందమివినీ వెరుగా సద్బుద్ధీ, నీనామాట, లెరుకేనిబద్ధీ, యెరుకే నిర్గుణసుగుణా లెరుకే యెరుకకు యెంత యెరుకోనే నిదియంత యెరుకా జేసితి నీవి, ట్లెరుగా సద్బుద్ధీ, నీనా మాట, లెరుకేనిబద్ధీ॥ ॥౨॥

ఓ బుద్ధిగలవాడా! విద్యయు అవిద్యయు ప్రణవము నాధము కళ బిందువు సత్తు చిత్తు ఆనందము ఇవి నీవు యెరుకని తెలుసుకొమ్ము నీనా మాటలు సత్యముగా యెరుకయేసుమీ నిర్గుణసగుణములుగూడ యెరుకే యెరుకకు యెంతవరకు యెరుకో నేనంతవరకు నీకు జెప్పితినని తెలుసుకొమనుని భావము.

౪౭ కం॥ యెరుకే ఇహపర సౌఖ్యము, లెరుకేజ్ఞానంబు జ్ఞేయమెరుకేమోక్షం, బెరుకేభక్తి విరక్తులు, యెరుకే సంకల్పమనినీ వెరుగా సత్కీర్తి, యెక్కడికౌర, యెరుకా సంపూర్తీ, యెరుకే జీవుండీశు డెరుకేతదేకత, యెరుకే సర్వమునే గుర్తెరిగీ జెప్పితి యూకీ, లెరుగా సత్కీర్తీ, యెక్కడి కౌర, యెరుకా సంపూర్తీ॥ ॥౩॥

ఓ సత్కీర్తి మంతుడా! ఇహ పరసుఖములు జ్ఞానము జ్ఞేయము మోక్షము భక్తివిరక్తి సంకల్పము జీవుడు ఈశ్వరుడు జీవేశ్వరైక్యత ఈ

సర్వమును యెరుకేయని నేను గుర్తెరిగి నీకు జెప్పితిని ఈ యెరుక యొక్క లక్షణము చెప్పుట కెంతకాలము కావలయునని భావము.

౪౮ కం॥ చింతల తోటననెరుకే • వింతల పుట్టిల్లనంగ వెలసినదెరుకె• తంతులపేటనయెరుకే • పంతములకుచూడ మూలబలమన్న నెరుకే • జగజ్జనన • స్థలమన్న నెరుకే • భ్రాంతూలకెల్లాను పట్టాణమనజెల్లి • కాంతాది రూపులు గల్పించుటకు మూల • బలమన్న నెరుకే • జగజ్జనన • స్థల మన్న నెరుకే॥ ॥౪॥

ఓ శిష్యుడా ! తలంపులకు తోటవంటిది ఆశ్చర్యమునకు పుట్టిల్లు వంటిది కపటోపాయములకు నగరమువంటిది కలహములకు కాల్బలమువంటిది జగజ్జననమునకు స్థానమువంటిది భ్రాంతులకు పట్టణమువంటిది స్త్రీ రూపాది కల్పనలకు కారణమైనదీ యెరుకేనని తెలుసుకొనుమని భావము.

౪౯ కం॥ అన్నియుతానై తనకవి • పన్నుగ వేరనుచునోట బలుకుచుమరితా • నన్నిటి నెరిగే యెరుకై • యున్నానని యెరుకే యెరుక నూహింపుచుండూ • తనలోతానె • మోహింపుచుండూ • యెన్నో విచిత్రిలీ యెరుకా చేతలువించె • వున్నాది లేదులే కున్నాది కలదాని • వూహింపుచుండూ • తనలోతానె • మోహింపుచుండూ॥ ॥౫॥

ఓ శిష్యుడా! సమస్తము తానేయయ్యి తనకు ఆసమస్తము వేరనుచు జెప్పుచు తాను అన్నిటిని తెలుసుకునె యెరుకనైయు న్నానని యెరుకే యెరుకను ఆలోచించు చుండును తనలోతానె భ్రాంతి బొందుచుండును యున్నది లేదని లేనిది యున్నదని ఊహించుచుండెడి యెరుకయొక్క చేష్ఠలువించే యెంతోవిచిత్రమనిభావము.

౫౦ కం॥ వినుమూర్ణనాభి తా బు • ట్టినమీదట సృజనజేయుదినము హరించుచు • ఘనమగు పటశతకోట్లను • తనలోపలిదారమునను తానల్లేచనునూ • అట్లనెయెరుక • తాబుట్టికనునూ • పనిబూని బ్రహ్మాండ భాండ నంతములాను • క్షణములోపల దృంచి కనరాకవేవేగ • తానల్లెచనునూ • అట్లనెయెరుక తాబుట్టి కనునూ॥ ॥౬॥

ఓ శిష్యుడా ! వినుము ప్రపంచమున సాలెపురుగు తాను పుట్టిన తరువాత తనలోపలి దారముచేత నూరుకోట్ల పెద్దపటములు సృజించి కొన్ని దినములకు వాటిని చెరచి తానుకూడ మరణించును అట్లనే యెరుకకూడ తాను బుట్టి బ్రహ్మాండ భాండముల ననేకముగా సృష్టించి యాగుపరచి తుదకు క్షణములోపల నశింపజేసి తనకు తానే అగుపడకుండ పోవునని భావము.

౫౧ కం॥ తల్లిదండ్రులు జీవేశులు • యిల వ్యోమము లేను మేను లెరుక మరుపులన్ • కలమేల్కాలు శుక్లశోణి • తులు నీరాన్నములు ప్రకృతి పురుషుడాల్మగడూ • గానై యెరుక • కెరుకె కానబడూ • తెలసి బయలున్నాది దెలసియా తెలివిని • తెలివి చేతనెబట్టి • తీసివెయ్యుము ప్రకృతి • పురుషూడాల్మగడూ • గానైయెరుక • కెరుకే కానబడూ॥ ॥౭॥

ఓ శిష్యుడా ! తల్లిదండ్రులు జీవేశులు భూమ్యాకాశములు నేనుమేనులు యెరుక మరుపులు కలమేల్కాలు శుక్లశోణితములు నీరాన్నములు ప్రకృతి పురుషులు ఆలుమగలుగాను అయ్యియుండెడు యెరుకకు యెరుకె కనబడునను విషయమును తెలుసుకొని బయలు యున్నాదియని తెలిసి ఈ తెలివిని తెలివి చేతనే దీసివేయుమని భావము

౫౨ కం॥ ఒక దేహ ధారితనువున • సకలావస్థలు జనించిచనిన విధమునన్ • అకలంకమైన బయలులో • ప్రకటంబై లేనియెరుక బయలుండ జూచి • తనముచ్చట • పరికించిలేచి • వొకకొంత సేపై నవుండేటందుకులేక• సకలాము తనవెంట జనుదేరజను బట్ట • బయలుండజూచి • తనముచ్చట • పరికించిలేచి॥ ॥౮॥

ఓ శిష్యుడా ! ఒక మానవుని శరీరమునందు యెన్నో అవస్థలుగలిగి పోయిన రీతిగనే నిర్మలమైన బయలులో లేనియెరుక కలిగి ఆ బయలును జూచి తన వృత్తాంతమును విచారించిలేచి క్షణకాలమైన నిలచుటకు వీలులేక సమస్తము తనతోగూడ మటుమాయమైపోవునని భావము.

౫౩ కం॥ మేలుక సుషుప్తిలోపల • నేలీలంతనకు దానుయేతెంచునో గదా • రాలీల బయలులోపల • వాలాయము తనకుదానే వచ్చునో యన్నా • వచ్చి హెచ్చి • చచ్చునో యన్నా • యీ లోపలనే బట్టబయలున్న దెరిగితే•

యేలోకమున నిల్వజాఃదెకగకంటె • వచ్చునోయన్నా • వచి హెచ్చి • చచ్చునోయన్నా॥ ॥౯॥

ఓ శిష్యుడా ! నిద్రలోపల మేలుకతనంతట తానే యేరీతిగవచ్చునో ఆరీతిగనే బయలునందు గుర్తెనెడి యెరుక తనకుతానెవచ్చి తనకుతానె హెచ్చి చచ్చును యింతలోనె బట్టబయలున్నదని తెలసుకుంటెయే లోకమున నిల్వదు తెలియకుంటె ఉత్పత్తి స్థితిలయాదులు పొందునని భావము.

౫౪ కం॥ ఆటాడి యాడకుండును • ఆటాడిన మేనిబొమ్మ యాటాడ కనే • ఆటాడు నెరుకయనియెడి • యాటాడించేటి వాడు యతడేరకర్తా • అంతటికీయా • యచలామకర్తా • చేటూపాటుల రెంటిచే వచ్చుఫలము • ముమ్మాటి కనుభవించి మరణాజననము లొంద• నతడేరకర్తా • అంతటికీయా యచలామకర్తా॥ ॥౧౦॥

ఓ శిష్యుడా ! (జాగ్రతలో) ఆటలాడి (సుషుప్తిలో) ఆటాడకుండును (స్వప్నములో) ఆటలాడిన తోలుబొమ్మ అటలాడకనే ఆటలాడుచుండును ఈ ఆటలాడించు యెరుకయే ఈ ఆటలకుకర్త అచలమేమాత్రము కర్తగాదు పాప పుణ్య ఫలములను ముమ్మాటికి అనుభవించి చావు పుటుకల బొందుటకు ఈ యెరుకయే కర్తయగునని భావము.

౫౫ కం॥ దేహమునుజూచు కన్నులు • దేహమునకు వేరులేని తీరున యెరుకే • కోహం కస్త్వం తవదా • సోహం సోహంబటంచు చూచుచుండు సుమీ • తనకుతానె • తోచుచుండు సుమీ • దేహిదేహములానె తెరగూన ప్రసరించి • దేహముగాని విదేహిగ తననూతా జూచుచుండుసుమీ • తనకుతానె తోచూచుండుసుమీ॥

ఓ శిష్యుడా! దేహమును జూచెటికన్నులు దేహమునకువేరు లేనట్లు యెరుకే నేనెవడను నీవెవడవు నేను నీకు దాసుడను వాడె నేను అనుచు చూచుచుండును తనకుతానె తోచుచుండును దేహిదేహములుగా ఈయెరుకయే పరిణమించి దేహముగాని విదేహిగా (తన్నుతాను చూచుచుండును) అని భావము.

౫౬ కం॥ పిండ బ్రహ్మాండంబులు • రెండును యారెంటిలోని రెండహములు యీ • ఖండములునాల్గుగూడి య • ఖండంబగు యెరుక రూపుగ

నరామాతండ్రీ • యిదిదెల్పిన • ఘనుడెతలిదండ్రీ • ఖండాఖండములూగ గనిపించె యెరుకానె • దండీదనెటి యుద్దండూల కలనైన • గనరామాతండ్రీ• యిదిదెల్పిన • ఘనుడెతలిదండ్రీ ॥౧౨॥

ఓ శిష్యుడా! పిండాండము బ్రహ్మాండము అనురెండును ఈ రెంటిలోని అహము (జీవేశ్వరు)లు ఇవిరెండును ఈనాలుగు ఖండముల కూడికయే అఖండమైన యెరుక స్వరూపము ఈస్వరూపమునే నీవు తెలుసుకొనుము ఈరహస్యమును తెలిపిన మహానీయుడే తల్లిదండ్రి ఖండా ఖండములుగా గనుపడు యెరుకనుగొప్పదని తెలిపెడు యుద్ధండుల మాటలు స్వప్నమువంటివని యెరుంగుమని భావము॥

౧౩ కం॥ పరిపూర్ణ మొకటిదక్కని తరమైన ప్రపంచమెల్ల తగ దెలియుము నీ • వెరుకేనని నుదిలోపల • యెరుకే పరిపూర్ణ మెరిగే దెరుకానెరిగేది • యింకొక్కటిలే • దీరెంట్నెరిగేదీ • యెరుకా పుట్టువుమూల మెరుగానిదీయెరుకే • యెరుకెతాబుట్టిన దెరుగాబోయితేలేదం • చెరుకానెరిగేదీ • యింకొక్కటిలేదీ • రెంట్నెరిగేదీ॥

ఓ శిష్యుడా! పరిపూర్ణము ఒకటితప్ప ఇతరమగు సమస్త ప్రపంచమును యెరుకయని మనస్సులో తెలుసుకొనుము పరిపూర్ణమును యెరుగునదియును యెరుకను యెరుగు నదియును యీ యెరుకే ఈరెంటి నెరుగునది మరియొకటిలేదు యెరుకయొక్క పుట్టుక మూలమును యెరుగనిది యీ యెరుకె ఈయెరుక తనపుట్టుక మూలముయెప్పుడెరుగుచున్నదో అప్పుడె అది లేకపోవునని భావము.

౧౪ కం॥ పాపములు పుణ్యములు భువి • బ్రాపించును యెరుక చేత భ్రమసినవారిన్ • ప్రాపింపవెరుక నెడసిన • తాపసులను చిత్తమందు తగ దెల్సు కొనుమీ • ఆగామిబో • ధను లెస్సావినుమీ • పాపాలలో శుద్ధస్ఫటికాసన్నిభమైన • ఆపోజ్యోతిని ప్రత్యగాత్మ నీమదిలోన • తగదెల్సు కొనుమీ • ఆగామిబో • ధనులెస్సావినుమీ ॥

ఓ శిష్యుడా! యెరుకచేత భ్రమజెందిన వారిని పాపపుణ్యములు దగులుకొనును యెరుకను వదలిన మహానీయులను పాపపుణ్యములు దగులుకొనవు

ముందు చెప్పబోవు బోధను బాగుగా వినుము. కంటిపాపలనడుమ శుద్ధస్ఫటికమువలె ప్రకాశించుచున్న ఆపోజ్యోతిని నీమనస్సులో ప్రత్యగాత్మని తెలుసుకొమ్మనిభావము.

౫౯ కం॥ యెరుకన్నను మరుపన్నను • యెరుకకు యెరుకన్న దేహియన మాయయనన్ • గురుతన సాక్ష్యనజ్ఞప్త్యన • స్ఫురణయనన్ ద్రష్టయనిన చూడూ మొక్కటిగా • యిదిలేకుంటె • చూడా మొక్కటిగా • మరిచలాచల మూలమర్మ మెరిగేటిదన్న • యెరిగితాలేనాని యెగిరి పొయ్యేటిదన్న• చూడూ మొక్కటిగా యిదిలేకుంటె• చూడా మొక్కటిగా॥ ॥౧౩॥

ఓ శిష్యుడా! యెరుక మరుపు యెరుకకు యెరుక దేహి మాయ గుర్తు సాక్షి జ్ఞప్తి స్ఫురణము ద్రష్టయనునవి యన్నియును ఒకటిగానె తలంచుము ఈ యొుకయేలేకుంటె వీటినన్నిటిని ఒకటిగా చూడలేము యెరుక పరిపూర్ణములయొుక్కమరుగు తెలుసుకొనెటిది తెలుసుకొని తానులేనని తనకు తానె యెరిగిపోవునని భావము.

౬౦ కం॥ అనుమానము మదినుంచక • వినుమింకను యెరుక పేర్లు వివరించెద బు • ద్ధ్యన చిత్తంబన మానస • మనిన హంకార మనిన నంతఃకరణనినన్ • సంకల్పమం • చనినా యిచ్చనినన్ • తన నితరులనే తానని గుర్తెరిగెటిదన్న • తననేకానితరూలతననూ దెలిసెటిదన్న నంతఃకరణనినన్ సంకల్పమం • చని నాయిచ్చనినన్॥ ॥౧౪॥

ఓ నాయనా! యెరుకయొుక్క మారుపేర్లను తెలిపెద అనుమానము మనస్సులో నుంచుకొనకవినుము బుద్ధి చిత్తము మనస్సు అహంకారము అంతఃకరణము సంకల్పము ఇచ్చాతనను ఇతరులనెతానని యెరిగెటిది తను కాని ఇతరులను తనను యెరిగెటిది (అనునివి యన్నియు యెరుకనామములు) అని భావము.

౬౧ కం॥ వినుమితరులు యెరుకను • సాక్ష్యనిపల్కిరి నేనుసాక్షి నహమనినీతో • వినజెప్పితి నింతియెవే • తనకూడదు రెంటినొక్క టని తెలుసుకోరా • మాటలభేద • మనికనుకోర్రా • అనరాని వినరాని కనరాని బయలందు • తనకై తానరుదెంచి తనకై తాజనునీ • సాక్ష్యని తెలుసుకోరా • మాటలభేద • మని కనుకోర్రా॥ ॥౧౫॥

ఓ శిష్యుడా! శ్రద్ధగా వినుము యెరుకనుకొందరు సాక్షియనిచెప్పుదురు నేను ఆసాక్షిని అహమని నీతో చెప్పితిని యింతె దీనికి వేరుమాటలేదు యెరుక సాక్షి అను ఈరెండింటిని ఒక్కటేనని తెలుసుకొనుము ఇది మాటలలోని భేదమె చెప్పుటకు వినుటకు చూచుటకు సాధ్యముగాని బయలునందు యెరుక తనంతట తానెవచ్చి తనంతటతానె పోవునని భావము.

౬౨ కం॥ వన్నియలై దొరకచోటను • పన్నుగ గలసినదిహృదయ పద్మంబనుచున్ • యెన్నుదురు జనులు యెరుకం • దున్నాదని శృతులుబల్కు చున్నావినుమీ • తెలుసుటె మోక్ష • మన్నావినుమీ • వన్నెలన్నియు మీరి వున్నావస్తువజాడ • నెన్నదెరుంగాక యెన్నోరీతుల బల్కు • చున్నావి సుమీ • తెలుసుటెమోక్ష • మన్నావి సుమీ॥ ॥౬౨॥

ఓ శిష్యుడా ! అయిదు రంగులుగలసిన స్థలమును హృదయ కమల మని జనులు వాడుచుందురు అచ్చట యెరుకయున్నదని వేదములు చెప్పు చున్నవి ఆ యెరుకను తెలుసుకొనుటయే మోక్షమని కూడ చెప్పుచున్నవి ఈ అయిదురంగులకు అతీతమైన వస్తువు (అచల పరిపూర్ణము)ను తెలుసుకొనక యెన్నో విధములుగా చెప్పుచున్నవని భావము

౬౩ కం॥ చులుకనియుక్తిగ నొక్కటి • దెలిపెదవిను సందియంబు దీరును దీనన్ • పలుకున గలిగిన యర్థము • పలుకును విడనాడి నిల్వ బకుచోటింకేదీ • రెండుగ వొక్క • పలుకే అయినాదీ • తెలియుమీలాగున తెలివిదేహములయ్యె • తెలివె తనువును బాసి తెలివిస్థిరముగ నిల్వ • బదు చోటింకేదీ • రెండుగవొక్క • పలుకే అయినాది ॥ ॥౬౩॥

ఓ శిష్యుడా! నీకు ఈ విషయములో చిన్నయుక్తి నొకటి చెప్పెదవిను దీనివలన నీసందేహము బాయును శబ్దమునందు గలిగిన అర్థము ఆశబ్దమును విడచియుండదు శబ్దము అర్థము ఈరెండునుగలసి ఒక్కశబ్దమే అయినట్లు తెలివి దేహములనునవి ఆయను తెలివి దేహమును విడచియుండదని తెలుసు కొనుమని భావము.

౬౪ కం॥ యెరుకైన భూతములనీ • వెరుగుము ఆకసము గాదు యింగలమును నీ • ల్లిర వందనేల యని నే • నెరిగిన పద్ధతిని నీకు నెరిగించి నానూ • ముజ్జగమూల • య్యేను పిట్లతోనూ • పరిపూర్ణమందు కన్పడుచు

తమకు దామె • మరికానరా విట్టిమార్గాముగలవీటి నెరిగించినానూ • ముజ్జగ
మూల • య్యోనువీట్లతోనూ॥

ఓ శిష్యుడా! యెరుకైనట్టి భూతములను నీవు తెలుసు కొనుము ఆకా
శము వాయువు అగ్ని జలము పృధివి అని నేను తెలుసుకొన్న దోవనే నీకు
జెప్పితిని ఈ పంచభూతములతోనే (స్వర్గమర్త్యపాతాళ) లోకము లాయను
ఇవి తమకుతామె పరిపూర్ణమందు కనుపడుచు తరువాత కనుపడకుండపోవును
ఈమార్గముగల వీటిని నీకు తెలిపితినని భావము.

ఇతి, శ్రీమద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే
యెరుక లక్షణన్నామ చతుర్థాధ్యాయః

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు

(యె రు క ల క్ష ణ ం) అను

నాలుగవ అధ్యాయము.

## —* ౫ యెరుకోత్పత్తి లక్షణం ౧౯. *—

౬౫ కం॥ యెరుకోత్పత్తిని దెలియగ • సరసిజగర్భాదులైన దాలర
నెటిచో • నరుడెత వాడువాడవి • యెరుగుదునన వట్టి మాట లివివింతగాకా •
తప్పదువాని • కికరాకపోకా • అరమర లేక సద్గురుమూర్తి చరణాపం •
కరు హద్వయాచార్యా నమెరుగాని నరుమాట• లివి వింతగాకా • తప్పదువాని •
కికరాకపోకా ॥౧॥

ఓ శిష్యుడా! యెరుకయొక్క పుట్టుకను తెలుసుకొనుటకు బ్రహ్మాదుల
కైన సాధ్యముకాదు మానవు డెంతటివాడు యెరుక యొక్క పుట్టుకను
తెలియుననిన మాటలు అబద్ధములుసుమా ఇంతేగాక వానికి జననమరణములు
తప్పవు యే సందేహములు లేక సద్గురు చరణములను పూజించు టెరుగని
మానవుని మాటలు ఆశ్చర్యముగా నుండునని భావము.

౬౬ కం॥ లేనెరుక బయలు లోపల • తానెట్లు జనించె ననిన తగవిను

వంధ్యా • సూనునిగతి వియదబ్జవి • ధానంబువ యక్షరాజ • ధానీ విధమునఁ•
రజ్జువు సర్పమైనా విధమునన్ స్థాణు పూరుషుని చందాన మృగజల • శశ
విషాణము స్వప్నా నందముగ • రాజధానీ విధమునఁ • రజ్జువుసర్ప •
మైనావిధమునన్ ॥౨॥

ఓ శిష్యుడా! ఈలేనియెరుక బయలులో యెట్లు జన్మించినది అనగా తెలిపెదను వినుము ఈలేనియెరుక గొడ్రాలి బిడ్డవలె ఆకాశ పుష్పమువలె గంధర్వ నగరమువలె రజ్జు సర్పమువలె స్థాణు పురుషునివలె యెండ మావుల వలె కుందేటి కొమ్ములవలె స్వప్నా నందమువలె కలిగెనని తెలుసుకొనుమని భావము.

౬౭ కం॥ లేనెరుకను యెరుకనియన • లేనెరుకెట్లాయ ననిన లెస్సగ వినుమా • లేని మృగజలము వంధ్యా • సూనులు గలిగుండి వెదకి • చూడా లేనట్లూ • యీ లేనెరుక • యేడాలేదిట్లూ • స్థాణు పూరుషూడు శశ విషా ణము • గగన సూనాము నరునీ స్వప్నానందమివి వెదకి • చూడా లేనట్లూ• యీ లేనెరుక • యేడా లేదిట్లూ॥

ఓ శిష్యుడా! లేనియేరుకను యెరుకయని యనుచుండగ లేనియెరుక యెట్లగునని అడిగితివేని నీవు తెలియునట్లుగ జెప్పెద వినుము మృగజలములు గొడ్రాలి కొడుకులు స్థాణుపురుషుడు కుందేటి కొమ్ములు ఆకాశపుష్పము స్వప్నానందము అను వీటిని విచారించిచూడగ యెట్లు లేనివో అట్లనే ఈ లేని యెరుకను లేనెలేదని తెలియుమని భావము.

౬౮ కం॥ యెరుకోద్భవ మెట్లన్నను • సరళంబగు నారికేళ సలిలము భంగిన్ • యెరుకెట్ల బోవునన్నను • కరిమ్రింగిన వెంగపండు కరణిగా నెరుగూ • తిరిగిరాని • కరణింకోెరుగూ • పరిపూర్ణ మున్నాది యెరుకాతా నెరిగితే • యెరుకె మ్రిగ్గును భస్మాసురుడు మ్రిగ్గిననాటి • కరణిగా నెరుగూ• తిరిగిరాని • కరణింకోెరుగూ॥ ॥౪॥

ఓ శిష్యుడా! యెరుకయొక్క ఉత్పత్తి యెట్లనగా టెంకాయలో నీళ్ళు పుట్టినట్టుగ పుట్టినది యెరుక యేరీతిబోవుననగా యేనుగు మ్రింగిన వెలగ పండులోని గుజ్జుపోయినట్టుగ పోవును ఈ యెరుకమరల జన్మకురాని కారణ

మొకటున్నది అది తెలిపెద వినుము పరిపూర్ణ మున్నదని యెరుక యెరిగి నచో భస్మాసురుడు నశించి నట్టుగనె ఈ యెరుకతానె నశించునని భావము.

౧౫ కం॥ సంతోషా సంతోషము ‚ లంతలొగనవచ్చి ‚ పిదప నరుగు నెచటికో ‚ వింతై యున్నది చూచితె ‚ యింతియె సుమి యెరుకపుట్టు ‚ విక దెల్సుకోరా ‚ సంశయమేల ‚ యిదినమ్ముకోరా ‚ యెంతాని దెలుపూదు యీ దేవమార్గామం ‚ దంతాట బహువన్నెలగు పడి యగుపడ ‚ వికదెల్సుకోరా ‚ సంశయ మేల యిదినమ్ముకోరా॥ ॥౫॥

ఓ శిష్యుడా! అంతలో నెబుట్టి నిలబడక అంతలోనె పోయెడి సుఖదుఃఖ ములను చూచితె ఆశ్చర్యముగా నున్నది యెరుకయొక్క పుట్టుకను తెలుసు కొని నిస్సందేహముగా నమ్ముకొనుము నీకు యేమని జెప్పుదును ఈ దేవమార్గ మందు అంతట అనేక రంగులు అగుపడి యగుపడవని భావము.

౭౦ కం॥ రాకపోకడ లేకను ‚ యేకస్థితినుండు నట్టి యీ బయలందున్ ‚ రాకడపోకడ గలిగి ‚ యనేకముగా దోచులేని యెరుకా సుసీలా ‚ ప్రతిమలొ లేని ‚ పెరుమాళ్ళలీలా ‚ లేకా తోచిన యెరుక లేనెలేదనుచునీ ‚ కీకీలుగురుసిచె యెరుకై తె జాలుళ్ళ ‚ క్రొరుకాసుసీలా ‚ ప్రతిమలొలేని ‚ పెరుమాళ్ళ లీలా॥ ॥౬॥

ఓ మంచి నడువడిక గలవాడా! రాకపోకలు లేక యేకరీతిగా నుండు ఈ బయలునందు రాకపోకలు గలిగి నానావిధములుగా లేని యెరుక కనుపడును అది యెట్టులనగా విగ్రహములయందు దేవ భావము రీతి తోచుచుండును లేకనె తోచినట్టి యెరుకను లేనెలేదనియెడు ఈ రహస్యమును సద్గురునిచే దెలుసు కొన్నచో యెరుక వృత్తియగునని భావము.

౭౧ కం॥ వనిగల్లుదకములోపల ‚ తనకై తావచ్చి తనకు తానేగు విధం ‚ బున పరిపూర్ణములోపల తనకై తావచ్చి యెరుక తనకై తాజనునూ ‚ అచలంబున్నదని ‚ తానెరిగిననూ ‚ తలేమి నిజమాని తనకే తోచును తోచి ‚ తనకల్మి మృషగాభా ‚ వనజేసి నిలువాక ‚ తనకై తాజనునూ ‚ అచలంబున్నదని ‚ తానెరిగిననూ॥ ॥౭॥

ఓ శిష్యుడా! నీళ్ళలోపల వానరాళ్ళు వాటికవేవచ్చి వాటికవే మాయమై నట్లు పరిపూర్ణములో యెరుక తనంతట తానెవచ్చి తనంతట తానె పోవును

ఆ యెరుక అచలమున్నదని తెలిసినచో తన వునికి అసత్యమని తనకెతోచును తోచి తన నిలుకడ వృధాయని భావించి తనకుతానె నిలువక పోవునని భావము.

౨౨ కం॥ పరిపూర్ణములో దోచుచు ♦ యెరుకేచను తనకు దానె యేర్పడ వినుమీ ♦ తొరటలు తొమ్మిదిగలదై ♦ తరితీపుల నొందుచుండి తనువాన దగుచూ ♦ అచలంబున్నా ♦ దని తాలేననుచూ ♦ మరుగిల్లెరుకకు దెలియ యెరుకెనిల్వదుగాని ♦ పరిపూర్ణ ముండు దాన్నెరిగేదెట్లికగుర్తు ♦ తను వాన దగునూ ♦ అచలంబున్నదని ♦ తాలేననుచూ॥ ॥౮॥

ఓ శిష్యుడా పరిపూర్ణములో కనుపడుచు యెరుక తనకు తానె పోవుట యెట్లంటె వినుము తొమ్మిది ద్వారములుగలదై కష్టసుఖము లనుభవించునది శరీర మనబడుచు పరిపూర్ణ మున్నదని తాలేనని అనియెడు రహస్యము యెరుకకు దెలిపిన యెడల యెరుక నిల్వదు పరిపూర్ణము యుండును కాని ఆపరిపూర్ణమును యెరుక తెలుసుకొనజాలదని భావము.

౨౩ కం॥ తొలుకారు మెరుపుకైవడి ♦ పొలుపుగ నీళ్ళందు దోచు బుగ్గలరీతిన్ ♦ అలసూర్య కిరణమందున ♦ గల నీళ్ళంబలెనెయెరుక గని పించునయ్యా ♦ అంతలో యెచట ♦ గనిపించదయ్యా ♦ కలకాల మొకరీతి గలిగుండదీయెరుక ♦ తిలకింప పవలురాతిరి దిరుగు విధమూన ♦ గనిపించు నయ్యా ♦ అంతలొ యెచట ♦ గనిపించదయ్యా॥

ఓ శిష్యుడా! మబ్బులోని మెరుపువలె జలమందలి బుగ్గవలె సూర్యకిరణ మందునగల నీళ్ళంబలెను యెరుక కనుపడి అంతలోనె కనుపించక పోవును యెల్లకాలము ఈ యెరుక ఒక విధముగా నుండదు పగలు రాత్రి అననివి ఒక దాని తరువాత ఒకటి తిరుగునట్లుగ కనుపించునని భావము.

౨౪ కం॥ కట్టెందు నిప్పులేకనె ♦ కట్టియ నొక సమయమందు గను పడి బహుగా ♦ మిట్టిపడితుదకు గనుపడ ♦ దట్టిదెసుమి యెరుక పుట్టు వమల విచారా ♦ తనకుదానె ♦ యరుదెంచెనౌరా ♦ పుట్టు గిట్టుటలానె నట్టేట నిల చుండి ♦ బట్టబయలుపొడ గట్టినగనుపాడ ♦ దమలావిచారా ♦ తనకుదానె ♦ యరుదెంచెనౌర॥ ॥౧౦॥

ఓ మంచి విచారము గలవాడా! కట్టెయందు నిప్పులేదు నిప్పులేని ఆ కట్టెయందే ఒక కాలములో నిప్పుకనుపడి భగ్గనమండి ఆ కట్టెను భస్మము

చేసి తుదకు తానుకూడ కనబడదు అట్టిదేసుమా యెరుక తనకు తానెవచ్చి చావు పుట్టుకలను నట్టేటనిలచి పరిపూర్ణము కనుపడినచో తాలేకుండ పోవునని భావము.

౭౧ కం॥ తనమూలము తల్లిదండ్రులు • తనవలెనె వారువారి తలి దండ్రులకున్ • తనవలెనెగాని యన్యము • గన జనన స్థానమొకటి • గల దానతరమా • బ్రహ్మదుల • కదిదెలియ తరమా • వినుము యీ బ్రహ్మండ జననామునీనాయం • దునవైనదియుగాదని వేరేయింకోటి • గలదనతరమా • బ్రహ్మదూల • కదిదెలియ తరమా॥

ఓ శిష్యుడా! తనకుమూలము తల్లిదండ్రులు తనవలెనే వారికిమూలము వారితలిదండ్రులుకాని విచారించిచూడగా జననస్థానము వేరొకటి కలదని చెప్పుటకు దానిని తెలియుటకు బ్రహ్మదులకుగూడ వశముగాదు నీవల్లను నావల్లను ఈబ్రహ్మండములైనవేకాని మరియొకరీతి అయినవనుటకు వీలులేదని తెలుకొనుమని భావము॥

౭౬ కం॥ కనరాని దానిశూన్యం • బని యనదగు గాని బయలు ననదగ దుసుమీ • కనవచ్చుచున్న దిందులో • కనుగొనుటకు యేరు లేదు కనుగొన రాదా • యెరుకనె శూన్య • మని యన రాదా • కనవచ్చెనాలేద కనుగొంటి లేదాని • యనరాదభయమేమి యనుమానించకు మిదుగో కనుగొనరాదా • యెరుకనె శూన్య • మనియనరాదా॥ ॥౧౨॥

ఓ శిష్యుడా! చూడరానిదాన్ని లేదని చెప్పవలెకాని పరిపూర్ణమును అనగూడదు అది కనపడుచున్నది ఇందులో జూచుటకు యెరుకలేదు యెరుకనె లేదనుము ఆబయలు కనుపడెనా! లేదా? కనుపడ్డది కనుపడలేదు అని భయము లేక యేదైనా జెప్పు సందేహించకు అదుగో చూడుమని భావము॥

౭౭ కం॥ యెరుక బయలందు లేమిని • యెరుకను శూన్యంబటంచు యెరిగించబడెన్ • యెరుగుమిదె ఆకసం • బిట్లెరిగితె యెరుకాకసములు యేకా మౌగదరా • ఆకసమూ బయ • లేక మెట్లౌరా • పరిపూర్ణమిదిగొ కన్పడు శూన్యమనరాదు • యెరిగుండు మెదిరిస్తె యిననాచై జూచేవు • యేకమౌ గదరా • ఆకసముబయ • లేకామెట్లౌరా॥ ॥౧౩॥

ఓ శిష్యుడా! బయలునందు యెరుక లేకుండుటచే యెరుకలేదని చెప్పబడినది దీనినె ఆకాశమని తెలుసుకొనుము యెరుకను ఆకాశమని తెలుసుకొనిన

యెడలఈ ఆకాశము యెరుక ఒక్కటే యగును ఆకాశము బయలు ఒక్కటి యెట్లవుతదీ. ఇదిగో కనుపడెడి పరిపూర్ణమును లేదని యనగూడదు అని తెలుసు కొనుము యెదిరించితివేని యికనాపై జూచెనని భావము॥

౭౮ కం॥ కనపడెడి బయలులోపల • కనుగొన లేదయ్యే యెరుక గావున శూన్యం • బనవలసె దీన్ని ఆకస • మనవలసె నుదీన • విశ్వ మాయనోయప్పా • యింతకువేరె • మాయమేదప్పా • కనుతానె యీవిశ్వ మును లేనిదని లెస్స • వినజెప్ప నాయెను కనబోకుండనిపోని • మాయనో యప్పా • యింతకు వేరె • మాయ యేదప్పా॥

ఓ నాయనా! ప్రత్యక్ష గోచరమగు పరిపూర్ణము లోపల యెరుక కన బడదు కాబట్టి ఈ యెరుకను కల్లయని అనవలసె దీనినే ఆకాశమనిగూడ చెప్పవలసి వచ్చినది దీనినుండె ప్రపంచము సృష్టింపబడెను ఇంతకంటె వేరే మాయ యనునది లేదు గనుకనె ఈ ప్రపంచములేదని గట్టిగా జెప్పవలసి వచ్చినది యిదియుండని పోని యీ మాయను కనుబోకుమని భావము॥

౭౯ కం॥ అహమనదుగదా అచలము • అహమున్నదో లేదో చూడ దది నిజమెకదా • అహమును బుట్టించదుగద • అహ ముదయించేటివరకె అది వున్నదిగదా • అహమెవిశ్వమై • నిల్చిండిగదా • అహమె యీ ముచ్చట్ల నన్నింటెన్నెరుగునుగద • అహమె తాలేనాని యరిగీ తెసరిగద • అదివున్నది గదా • అహమెవిశ్వమై • నిల్చింది గదా॥

ఓ శిష్యుడా! పరిపూర్ణము అహమనుచు అనదు అహమనునది వున్నదో లేదో అనికూడ ఈ పరిపూర్ణము నిజముగా విచారించదు అహ మును పుట్టించదు అహము పుట్టుటకు పూర్వమే ఈ పరిపూర్ణము ఉన్నది ప్రపంచ స్వరూపము పొందినది యీ అహమే యీ విషయము లన్నిటిని అహమే తెలుసుకొనును అహమనునది తానె లేకుండబోయితె బాగుండునని భావము.

౮౦ కం॥ ఆవరణము నాకసము ని• రావరణము నచలమనుచు అనిరి మహాత్ముల్ • ఆవరణము మితిగలిగిన • దావరణము లేంది యమితమని తెలుసుకోరా • యీ రెంటిన్ని వే • రని కనుక్కోరా • ఆవరణముననే నిరా

వరణమును జూచి • యావరణ మెడలీన నావాలమాట లే • దని కనుకోరా•
యీ రెంటిన్ని వే • రని కనుకోరా॥ ॥౧౬॥

ఓ శిష్యుడా! ఆవరణమును ఆకాశమనియును నిరావరణము అచలమని యును మహానుభావులు చెప్పియుండిరి హద్దుగలిగినది ఆవరణము హద్దులేనిది ని రావరణమని తెలుసుకో ఈ రెంటిని దేనికదే వేరు వేరని భావించుము ఆవరణము చేతనె నిరావరణమును జూచి ఆవరణము విడచితె నావలమాటలేదని తెలియుమని భావము.

౮౧ కం॥ ఆకాశము శూన్యంబని • లోకులు మొరబెట్టి దాని లోప వనాదుల్ • ప్రాకటముగ బుట్టినవని • చీకాకుగ జెప్పినారు ఛీ వినిరాదూ • వంధ్యాసంతీ • క్షితిలోనలేదూ • కాకుంటె విను చోద్యమా కుందేటికి కొమ్ము• లీకాలముననె మేమెకంటి మనుమాట • ఛీ వినరాదూ • వంధ్యానం తీ • క్షితి లోనలేదూ॥ ॥౧౭॥

ఓ శిష్యుడా! లోకులు ఆకాశము శూన్యమని జెప్పుదురు శూన్యమగు ఆ ఆకాశమునుంచి వాయువు మొదలగు నాలుగు భూతములు బుట్టినవని చెప్పు దురు ఛీ ఈ చికాకు మాటలు వినకూడదు ఈ భూమిలో గొడ్రాలికి బిడ్డపుట్ట లేదు ఆశ్చర్యకరమగు కుందేటి కొమ్ములను మేముజూచినమని చెప్పుమాటలు వినగూడదని భావము.

౮౨ కం॥ లేనెరుకను బయలందున • లేనేలేదనక యితరులేల పలి కిరో • లేనిపె కలదని పిదపను • లేనేలేదనుచు సిగ్గు లేకా యీలీలా • ఛీ వినకీ చీ • కాకు నీకేలా • మేనంద శుద్ధాము తానల్లుకొని మళ్ళి • పూనికడిగినరీతి నౌను సిగ్గొకయింత • లేకా యీలీలా • ఛీ వినకీ చీ • కాకునీకేల॥ ॥౧౮॥

ఓ శిష్యుడా! బయలునందు లేనియెరుకను లేనెలేదని చెప్పక లేదు కొంచెము యున్నది తరువాత లేనెలేదు అని ఈసిగ్గులేని మాటలు ఇతరులు యెందుకు చెప్పిరో ఛి ఈ చీకాకుమాటలు నీవు వినకు దేహమునకు అశుద్ధము పూనుకొని సిగ్గుయేమాత్రము లేక నీటితో కడుగు కొన్నటులుండునని భావము.

౮౩ కం॥ అన్నపు సుక్ష్మాంశము మను • సెన్నగ నీరంబు ప్రాణ మెరుగుము యీరెం • డెన్నడు కలియవొ నాడే • సున్నసుమీ యెరుకమాట సుగుణ సంపన్నా • కలసుటెయెరుక • సుమి యింతకన్నా • వున్నదెరుక మూలమన్నది వినలేదు • యెన్నాడు యీ భ్రాంతి నిన్నంటనివ్వకు • సుగుణ సంపన్నా • కలసుటె యెరుక సుమి యింతకన్నా॥ ॥౧౯॥

ఓ సుగుణసంపన్నా ! అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సు జలముయొక్క సూక్ష్మాంశము ప్రాణము ఈ రెంటియొక్క కలిమిడి యేనాడు ఉండదో ఆనాడె యీ యెరుకయొక్క మాట వుత్తది ఈ రెంటి యెక్క కలిమిడియే యెరుకయని తెలుసుకొనుము దీనికన్న అతీతమైయున్న పరిపూర్ణము యెరుక యొక్క మూలము అన్నది వినలేదు యెప్పుడుగాని నీవు యీ భ్రాంతిని పొందకుమని భావము.

ఇతి, శ్రీమద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే యెరుకోద్భవన్నామ పంచమోధ్యాయః.

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు
(యెరుకోత్పత్తి లక్షణం) అను

ఐదవ అధ్యాయము.

—(౦)—

## —* ౬ యెరుకను విడిపించుట. ౨౨ *—

రాగ కం॥ పిల్లలు తాట్యాకులతో • పిల్లఁగావించి పెండ్లిపేరంటంబుల్ • కొల్లలుగఁజేయు వారల • తల్లులుగని సత్యమనుచు దలచేరా మదినీ • నిను నీవిట్లు • దలచరామదినీ • కల్లా సంసారము గని మానవులు సంత • శిల్లాగ గురుమంత్ర సిద్ధూలు నిఃమాని • దలచేరామదినీ • నినునీవిట్లు • దలచరా మదినీ॥ ॥౧॥

ఓ శిష్యుడా! తాటి ఆకులతో బొమ్మలనుజేసి వాటికిపెండ్లి పేరంటములు జరుపుపిల్లలను జూచి ఆ పిల్లల తలిదండ్రులు ఆ పెండ్లి పేరంటములు నిజమని తలంచరు అట్లనే అబద్ధమగు సంసారమును చూచి మానవులు నిజమని సంతోషింతురు సద్గురుబోధవలన మంత్రసిద్ధిని పొందిన మహానీయులు (సంసారము) సత్యమని తలంచరు ఆవిధముగానె నిన్నునీవు అసత్యమని తెలుసుకొమ్మని భావము.

౬౫ కం॥ మేనెరుకల రెండింటిలో • దానిని యిదిదీని నదియు తగ సృజియించున్ • మేనెరుక లివియుమూలము • లేనిదెస్వ్ను నయ్యెననుచు లేనే లేవంటి • అంటెతప్పు • లేనేలేవంటీ • మేనెరుకలిప్పుడు దేనందున్నవో చూచి • లేనిమేనెరుకలలేని వనుచు నమ్ము • లేనేలేవంటి • అంటెతప్పు • లేనేలేవంటి. ॥౨॥

ఓ శిష్యుడా! మేను యెరుక అను యీ రెంటిలో మేనును యెరుక యెరుకను మేను ఒకదానినొకటి పుట్టించుచుండును ఆ మేనెరుకలు రెండును మూలములేకనే పుట్టినవి కాబట్టి లేవని చెప్పితిని ఇట్లు చెప్పుటలో దోషమేమి లేదు మేను యెరుకలవి దేనియందు నున్నవో చూచి లేనటువంటి మేను యెరుకలను లేనివని నమ్ముమని భావము

౬౬ కం॥ యెరుకపని జేయదనకుము • యెరుగుట మరచుటలు రెండు యెవ్వరిపనులో • యెరిగింపుము నామోలను • వెరువను తప్పితివె దెబ్బ వేసేనుచూడూ • యిట్లనకుండా • జేసేనునేడూ • వెరపించుదె దెబ్బవేసేన నాతండ్రి • యెరిగించి పైమర్మమెరుకానునే దీసి • వేసేనుచూడూ • అట్లన కుండ • జేసేనునేడూ॥ ॥౩॥

ఓ నాయనా! యెరుకయే పనిచేయదని చెప్పవద్దు తెలుసుకొనుట మరచి పోవుట అను ఈ రెండు యెవరిపనులో నాకు తెలుపుము నేను భయపడను తప్పితివా దండించెదను మరల తప్పులు జెప్పకుండ జేసేదను నిన్ను భయ మొంద జేయడమేగాని దండింతునా? అచల పరిపూర్ణమును జూపించి యెరు కను వదలింతు జూడుమని భావము.

౬౭ కం॥ లేనికల గలిగినప్పుడు • దానికి దశదిశల యందుతగ మొదటకొనన్ • తానుంటకున్న మేల్కను • లేనికలే చూచెనేని లేకాపోవుగదా • కలతో మేల్క • లేకాపోదుగదా • లేనెరుక బయలు లీలీలాగ నీకెపుడు • గానవచ్చితె బోధ గావాలెనన వపుడు • లేకాపోవుగదా • కలతోమేల్క • లేకాపోదుగదా॥ ॥౪॥

ఓ శిష్యుడా! లేనటువంటి స్వప్నము గలిగినప్పుడు ఆస్వప్నమునకు పది దిక్కులయందును ఆదియంతములయందును తగలకున్న అట్టిమేలుకను లేనికల చూచెనేని లేకపోవును. కాని స్వప్నముతో మేలుక లేకుండ పోదుగదా లేనియెరుక పరిపూర్ణము అను యీ రెండు యీరీతిగ నీకు యెప్పుడు గనబ డితె నప్పుడు బోధ కావలయునని అనవని భావము.

౮౭ కం॥ ఒంటుకు దాపలబిందొ్ౕవం • ట్లంటించిన కొలదిలెక్క అధికంబగు నా • వొంటుకు వలపలబిందొ్ౕవక • టంటించిన తెక్కవళ్ళక్యౌ గదనోయీ • వొంటుండి లేం • దౌగదనోయీ • తంటాదీరును చూడు దాని వలెనె యెరుక • కంటె బయలును తానుగలిగుండితనకుళ్ళ • క్యౌగదనోయీ• వొంటుండిలేం • దౌగదనోయీ ॥౫॥

ఓ శిష్యుడా! ఒంటుకు యెడమప్రక్కన సున్నబెట్టి ఆసున్నప్రక్క నుండి అంకెలను పెట్టినకొలది అధిక సంఖ్యయగును ఆ ఒంటుకు కుడి ప్రక్కన సున్న బెట్టినచో సంఖ్య శూన్యంబగును మధ్యన ఒంటు ఉండియు లేనిదగుమన్నది ఆలాగె యెరుకకంటె పూర్వము పరిపూర్ణముండుటచే యెరుక యుండి లేనిదగును యీ విషయమును తెలుసుకుంటె యేతగువు లేదని భావము.

౮౯ కం॥ యెరుకొక్కటుండెనేనియు• యెరుకే యీ విశ్వరూపమేర్పడ దాల్చున్ • యెరుకొక్కటి లేకుండిన • యెరుకైన ప్రపంచమున్న దెవరెరి గేరికనూ • లేదననైన • నెవరుండేరికనూ • పరిపూర్ణమైనట్టి బయలుండ గని పెట్టి • గురునీ వాక్యముబట్టి గురుతూబోగొట్టితె • యెవరెరిగేరికనూ లేదన నైన • నెవరుండేరికనూ॥

ఓ శిష్యుడా! ఒక్క యెరుకయే యుండెనేని ఆయెరుకే ఈ ప్రపంచ స్వరూపము బొందును యెరుక ఒక్కటిలేకుంటె యెరుకైన ప్రపంచమును యెవరు తెలుసుకోగలరు లేదని చెప్పేవారు గూడ యెవరున్నారు పరిపూర్ణ మైనట్టి బయలునుజూచి సద్గురు వాక్యముచే గుర్తును వదలితె యెవరు తెలుసు కోరని భావము.

౯౦ కం॥ తెలుపు మృదుత్వము మధురము • గలవస్తువు చక్కెర నుచు గనుగొన్నట్లా • తెలివి శరీర జగంబులు • గలవస్తువు బిందువనుచు గనుగొనరాదా • నేదెల్పితె • వినినమ్మరాదా • తెలివిచే బయలుండదెలసి యీ తెలివిని • తెలివిచేతనె బట్టితీసివెయ్యరపోని • కనుగొనరాదా • నేదెల్పితె• వినినమ్మరాదా॥ ॥౭॥

ఓ శిష్యుడా! తెలుపుదనము మెత్తదనము తీపిదనముగల వస్తువ పంచదారయగునట్లు తెలివి శరీరము ప్రపంచము అనునవి గలవస్తువు గుర్తని తెలుసుకొమ్ము నేను చెప్పినది వినినమ్ముము గుర్తుచేత పరిపూర్ణమును దెలుసు కొని ఈ గుర్తు గుర్తుచేతనే తీసివేయుమని భావము.

౯౧ కం॥ లేనెరుక బయలులోపల • తానై తన కేరుపడిన తన మూల మునే • తానెఱుగ దలచినప్పుడు • తానేలేకుండు దృష్టాంతము వినుమిచటా • కలదోచాదె • తనకై తానెచటా • తానైతోచిన కల తనమేల్కొ గనబోతె • తానేతనకులేదు తగియున్నదీ దృష్టాం • తము వినుమిచటా • కలదోచాదె • తనకై తా నెచటా॥

ఓ శిష్యుడా! పరిపూర్ణములో లేనియెరుక తనకు తానె పుట్టి తనమూలము మునె తాను తెలుసుకో దలచినప్పుడు తానె లేకుండును దీనికొక దృష్టాంతము జెప్పెద కల తనకుతాను దోచును తానైదోచిన కలయే తనమేల్కొను చూడ బోయితె తనకుతానే లేదుగదాయని భావము.

౯౨ కం॥ చచ్చుట పుట్టుట మేలుక • వచ్చుట గాఢాసుషుప్తి వచ్చుట లీనా • ల్గచ్చముగ సహజ మెరుకకు • పొచ్చము యీ యెరుక నిల్వ బోదు మాయప్ప • అచలముకిట్లు • లేదుగదప్పా • మచ్చికతో రెంటి మర్మాము నీకిప్పు • దెచ్చొగదెల్పితి నెరుగు మెరుకనిల్వ • బోదూమాయప్పా • అచ లముకిట్లు • లేదుగదప్పా॥ ॥౯॥

ఓ నాయనా! చావు పుటుక మేలుక నిద్ర ఈ నాలుగువచ్చుట యెరుకకు సహజము ఈ యెరుక స్థిరముగా నుండబోదు పరిపూర్ణమునకు ఈ అవస్థలు లేవు ప్రేమగా నీకు యెరుక పరిపూర్ణముల యొక్క రహస్యములను నిస్సంశయముగ దెల్పితి యెరుగుమని భావము.

౯౩ క॥ యెరుకను కలలోపురుషుని • కెరుకే యీ విశ్వమగుచు యేర్పడుకలగా • యెరుకబయలుగని తాలేం • దెరిగిన నెరుక కదీమేల్కొ యిదినమ్ము లెస్సా • యెరుకతో పొందు • వదులాదె పిస్సా • యెరుకానె కలనీకు యెప్పూడు దోచీతె • యెరుకాలేందను మేల్కొనెరుగు మప్పుడెచాలు • యిదినమ్ము లెస్సా • యెరుకతో పొందు • వదులాదెపిస్సా॥ ॥౧౦॥

ఓ పిచ్చివాడా! యెరుకయనె స్వప్నములో మానవునికి యెరుకయే యీ ప్రపంచమై స్వప్నమువలె కనుపడును ఈ యెరుక పరిపూర్ణమును ఉండ జూచి తానులేనని తెలిసిన యెరుకకు అది మేలుకేయని చక్కగా నమ్మవలయును యెరుకతో సహవాసము వదలుమా యెరుకయను స్వప్నమును నీ కెప్పుడు గలిగితె అప్పుడే యెరుకలేదనియెడు మేల్కొను తెలుసుకొమ్మని భావము

౯౪ కం॥ చిత్తరువు రంగుగోడల • నెత్తెరగున దెలిపినావొ నీ విప్పుడు సీ• చిత్తమున జగము నెరుకను • వుత్తబయల్ నట్లదెలియు నూహతోడుతనూ• తెలిసివిడువు • మూహజగములనూ • అత్తెరగునజేస్తె ఆవాలిమాటాను • యిత్తెరగని తెలియ నెవరుండే రటుమీద • నూహతోడుతనూ • తెలిసివిడువు• మూహజగములనూ॥ ॥౧౦౦॥

ఓ శిష్యుడా! శిల్పము రంగు గోడలు అనువాటిని ఈరీతిగ వేరువేరని తెలుసుకొంటివో అట్లనె నీ హృదయములో ప్రపంచమును యెరకను పరిపూర్ణమును ఊహచేత వేరువేరని తెలుసుకొని ఊహను ప్రపంచమును వదలుము ఈ విధముగా వదలినయెడల పరిపూర్ణమును యిట్టిదట్టిదని తెలుసుకొనుటకు యెవరుండరని భావము.

౯౫ కం ॥ పరిపూర్ణములో లేనిదె • యెరుకొక్కటి దోచితనను యెరిగినమృషగా • యెరుకే విడుచున దెట్లన • కరములు తమపనులు తామె గడుపూనట్లుగనూ • యిదిగాకుంటె • కలదింకొ్కటివినూ • మరికానిదామాట మంచీదీమాటాని • పరిపారి విధమూల పలుకే పలుకులపని • గడుపూనట్లు గనూ • యిదిగాకుంటె • కలదింకొ్కటివినూ॥ ॥౧౦౩॥

ఓ శిష్యుడా! పరిపూర్ణములో లేనియెరుక ఒకటి కనుపడి తననుతాను తెలుసుకొన్నప్పుడు ఆబద్ధమని తనకుతానె పోవును. చేతులు తమపనులు తాము జేసుకున్నట్లు యిదిగాకుంటె యింకొక దృష్టాంతము వినుము ఆమాట మంచిదికాదు యీ మాటమంచిదని అనేక విధములుగా ఆనేమాటలతో పని చేయునట్లుగ యని భావము.

౯౬ కం॥ తలయెత్తి చూడ జాలునె • అలచీకటి యెదుటనిల్చి యజ్ఞాపుకళన్ • కలవచ్చి మేల్కయందున • గలచేష్టలు మోప్రలనిల్చి గను గొన గలదా • అట్లనెయెరుక • కనుగొనగలదా • యిలలో సద్గురుబోధ నెరిగీన నరుని చే • ష్టలుగంటె నుళ్ళక్కి సద్గురుబోధాట • కనుగొనగలదా • అట్లనెయెరుక • కనుగొనగలదా॥

ఓ శిష్యుడా! చీకటి యెదురుగా నిలుచొని తలయెత్తి సూర్యకాంతిని చూడగలదా? అట్లే యెరుక పరిపూర్ణమును తెలుసుకోలేదు స్వప్నమువచ్చి మేల్కయందు తనచేష్టలను యెదురుగా నిల్పుకొన గలదా? ఆవిధముగా ప్రపంచములో సద్గురుబోధను తెలుసుకొనిన నరుని చేష్టలను చూచితె ఉళ్ళక్కి సద్గురుబోధాట యని భావము.

౯౭ కం॥ అంటదు కలమేల్కాను మే • ల్కంటదు కలనెన్నటికి నికడు నిశ్చయ మీ • రెంటి క్రియ గుర్తుబయలుల • రెంటిని రెండంటకుండు • రెండెరింటిలోనూ • కలయెరుకాలీ • రెండు మిధ్యేనూ • దంటాగ మేల్కబయ లుంటా వెప్పటి కెరిగి • గెంటూమపై రెంట రెంటీ • కలయెరుకాల • రెండెరింటి లోనూ • కలయెరు కాలీ • రెండూమిధ్యేనూ॥ ॥౧౪॥

ఓ శిష్యుడా! కలనుమేల్క మేలుకనుకల యెన్నటికిని అంటుకొనలేవు ఇదినిశ్చయము గుర్తు అనెడియెరుక బయలు అను యీ రెండును ఒకదాని కొకటి అంటకుండా యుండును రెండింటిలో కలయెరుక అనురెండు అబద్ధము మేలుకబయలు అనునవి దంటగా నుండును అని తెలుసుకొని పై రెండింటిలో రెండగు కలయెరుకలను విడువుమని భావము

౯౮ కం॥ యెరుగదు సుషుప్తిని జాగ్రత్త • నిరవంద సుషుప్తి రెంటి నెరుగును మేల్క • ట్లరయగ బయలెరుకల • రెంటెన్నెరుగదు బయలెరుక రెంటి నెరుగూచూ నుండూ • గురుముఖమూవ • నెరిగీ యీ రెండూ • తిర మూగ యెరుకాను తీసివేసితెజాలు • పరులూ నేననియేటి పలుకే లేకుండు ని • ట్లెరుగూచునుండూ • గురుముఖమూన • నెరిగి యీ రెండూ॥ ॥౧౫॥

ఓ శిష్యుడా! సుషుప్తిని జాగ్రత్తను సుషుప్తి తెలుసుకొనదు సుషుప్తిని జాగ్రత్తను జాగ్రత తెలుసుకొనును అటులనే బయలు యెరుకను రెండింటిని బయలు తెలుసుకొనదు బయలును యెరుకను రెండింటిని యెరుక తెలుసుకొను చుండును గురుముఖమున యీ రెండింటిని తెలుసుకొని యెరుకను తొలగించితే యితరులు నేను అనె మాట లేకుండునని భావించుమని భావము.

౯౯ కం॥ సంకల్పము లేనిదె ని • స్సంకల్పములోన దోచుచనుదోచు చనున్ • సంకల్పము దప్పున ని • స్సంకల్పము నెరిగెనేని చనుతాలేననుచూ• నిస్సంకల్ప • మును నిల్చెదనుచూ • సంకల్పించుటకింక సంకల్పమేది ని • సంకల్పమందిట్లు సంకల్ప మెరిగితే • చనుతాలేననుచూ • నిస్సంకల్ప • మునునిల్చె దనుచూ॥ ॥౧౬॥

ఓ శిష్యుడా! నిస్సంకల్పమునందు లేనిదే సంకల్పముగలిగి పోయి మరలగలిగి పోవుచుండును సంకల్పము తటాలున నిస్సంకల్పమును తెలుసు కొనునేని తానులేనని తనకుతానె పోవును నిస్సంకల్పమును వున్నదని సంక ల్పించుటకు సంకల్పమేలేదు నిస్సంకల్పమందు సంకల్పము యీ విధమని తెలుసుకుంటె తానులేనని తనకు తానె పోవునని భావము.

౧౦౦ కం॥ యెరుక తనకు దావిడిపో • దెరుకను విడిపించలేరు యెవ్వరుధాత్రిన్ • గురుడొకడుదప్ప గురునకు • పరిచర్యయొనర్చి బోధ పద్ధాతివినినన్ • తిరిగిరాని • పద్ధాతిగనినన్ • పరిపూర్ణమెరుక యేర్పరుచ నెరుకలేక • హరిని స్వప్నముగన్న కరిమ్రగ్గి నట్లాయీ • పద్ధాతివినినన్ • తిరిగిరాని • పద్ధాతిగనినన్॥ ॥౧౨॥

ఓ శిష్యుడా! యెరుక తనంతటతానె విడిచిపోదు సద్గురు డొకడుదప్ప ప్రపంచమున నెవ్వరు యెరుకను విడిపించలేరు అట్టి గురుదేవునకు శుశ్రూషలు జేసి పరిపూర్ణబోధ పద్ధతినివిని మరల రానిపద్ధతిని తెలుసుకొనిన యెడల పరిపూర్ణమని యెరుకయని యేర్పరచుటకు యెరుకలేక కలలోసింహమును జూచిన యేనుగువలె నశించినట్లు యుండునని భావము

౧౦౧ కం॥ అపరోక్షమౌనె మనుజుల • కుపరోక్షంబైన బయలు గురుకృపలేకన్ • అపరోక్షమౌను మనుజుల • కుపరోక్షంబైన బయలు గురుకృపగలుగా • కీలిదెలేని • యెరుకాతా తొలుగా • విపరీతమౌబుద్ధి విడచి నీ వెప్పూడు • ఉపచారములుజేయు చుండూము గురునీకి • గురుకృప గలుగా • కీలుదెలేని • యెరుకా తాతొలుగా॥

ఓ శిష్యుడా! సద్గురుని దయలేక మనుష్యులకు గోచరము గాని పరిపూర్ణము గోచారముగాదు సద్గురునికృప గలిగినచో గోచరముగాని పరిపూర్ణము గోచరమగును లేని యెరుక తొలగుటకై ఇదె కీలకము నీవెప్పుడు విపరీతమైన బుద్ధిని విడచి గురుమూర్తికి సేవలొనర్చుమని భావము.

౧౦౨ కం॥ నేనెవ్వడనను జీవుడు • నేనే నేనను శివుడు యీ రెండనకన్ • తానుండు నచలమి వీటిని • నేనెరిగరిగి నను పైది నేనెట్లనీనీ • నేననకున్న • తానెట్లనీనీ • నేనన్నదాంట్లొదెనీ నా ప్రసంగాము • తానన్న దాంట్లోనే తలపోయవలెనిట్లు • నేనెట్టనీనీ • నేననకున్న • తానెట్లనీనీ॥ ॥౧౫॥

ఓ శిష్యుడా! జీవుడు నేనెవ్వడను అని అనును శివుడు నేనే నేనను ఈ రెండును అనకనుండునది పరిపూర్ణము వీటిని నేను తెలుసుకొని పోయితె పరిపూర్ణము నేనిని తానని అనదు అట్టి పరిపూర్ణములో లేనట్టి నేనను దాని యందే నీ నాయొక్క ముచ్చట్లు అని యీ విధముగా తెలుసుకొనుమని భావము.

౧౦౩ కం॥ తొ్రలు తొమ్మిదిగలమే • న్మ్రరిక యొక రెంటిలోన మ్రలు నాల్గున్ • డె్రది తెల్లది నల్లది • క్రరెది దానగ్రమందు గల దొక్కతూటూ • అది యెరుకానె • పులు గుండెచోటూ • కుర్రా గురుబోధానె గొడ్డాలి చేబూని • మరి్రపులుగుల రెంట్నిమలచి కొట్టరపోని • గలదొక్కతూటూ • అదియెరుకానె • పులుగుండెచోటూ॥ ॥౨౦॥

ఓ కొడుకా! తొమ్మిది తూటులుగల దేహమను మ్రరికి రెండు నేత్రరంధ్రములు గలవు అందు యె్రది తెల్లది నల్లది కరె్రది అను నాలుగు మర్రిలు గలవు దాని కొనకొక రంధ్రము గలదు ఆరంధ్రమే యెరుకయను పక్షియుండు స్థలము సద్గురుబోధయను గొడ్డలిని బట్టుకొని మ్రరిపక్షుల రెండింటిని మలచి కొట్టుమని భావము.

౧౦౪ కం॥ తనువుతొ వచ్చిన యెరుకే • తనువును తనువనుచు తనను తానని యెరుగున్ • తనువును బాసిన మీదట • తననాదేహమును రెంట్ని • తానెరుగ దపుడూ • అదిగనుక తా • లేనేలేదెపుడూ • అనుమాన రహితా మింధచలాము న్నది కంటె • తనమాట తలపోయ తనకెసిగ్గయె తనను • తానె రుగ దపుడూ • అదిగనుకాతా • లేనేలేదెపూడూ॥ ॥౨౧॥

ఓ శిష్యుడా! దేహముతో వచ్చినయెరుక తనను తాననియు దేహమును దేహమనియు తెలుసుకొనును దేహమును వదలిన పిమ్మట తనను దేహమును కూడ తెలుసుకొనదు కనుక యెల్లప్పుడు యెరుకలేనెలేదు పరిపూర్ణమున్నదని తెలుసుకొన్నచో సందేహము రహితమై తనమాట తలంచుటకు తనకు సిగ్గయి అప్పుడు తననుతానె యెరుగదని భావము.

౧౦౫ కం॥ ఉప్పెనచే జెడుతరువు వొ • కప్పుడు విత్తనము పుచ్చు నా రెంటికి ఈ • తిప్పలు దప్పవు ధరయే • తిప్పలు తానెరుగదిట్లు తెలుసుగ దోయీ • తను వెరుకా బయ • లుల నట్లెరుగోయీ • గొప్పైన గురుబోధ చొప్పున నెరిగి యీ • తిప్పలు గలవాట్ని • తప్పదీసితె చాలు • తెలుసూ గదోయీ • తనువెరుకాబయ • లుల నట్లెరుగోయీ॥ ॥౨౨॥

ఓ శిష్యుడా! చీదపురుగుచే చెట్టు నశించును విత్తనము గూడ ఒకప్పుడు పుచ్చిపోవును చెట్టు విత్తనముల రెండింటికి యీ అవస్థలు దప్పవు యే అవస్థ తెలియనిది భూమి అని తెలుసును గదా? తనువు యెరుక బయలు అను వాటిని అట్లె తెలుసుకొనుము గొప్పనైన సద్గురుబోధచే పరిపూర్ణమును తెలుసుకొని జనన మరణములుగల తను వెరుకలను తీసివేయుమని భావము.

ఇతి, శ్రీమద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే యెరుక మోక్షణన్నామ షష్ఠోధ్యాయః.

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు
(యె రు క ను వి డి పి ం చు ట) అను
ఆరవ అధ్యాయము.

—(౦)—

## —* ఒ మతాల లక్షణం ౨౬ *—

౧౦౬ కం॥ మతముల వారలు తమ స ॥ మ్మతమైనటువంటి శాస్త్ర మర్యాదలచే ॥ మితమేరు పరచుకొనిబహు ॥ గతులను కలహింతు రట్టిగతి నీ కేమిటికీ ॥ చెపలతజెందె ॥ స్థితి నీ కేమిటికీ ॥ ప్రతిలేని యీ బట్టబయ లుండజూచి సం ॥ తతములే నెరుకలేదని నమ్ముమిక వారి ॥ గతి నీకేమిటికీ॥ చెపలతజెందె ॥ స్థితి నీ కేమిటికీ॥ ॥౧॥

ఓ శిష్యుడా! మతవాదులు తమభావమునకు తగినటువంటి శాస్త్ర మర్యాదలచే నొక కట్టుబాటును నియమించుకొని అనేక విధములుగా వాదించు కొనుచుందురు మనస్సును చలింపజేసె ఆ మతపద్ధతులు నీకెందుకు ఉపమాన రహితమైన ఈ పరిపూర్ణము యొక్క స్థితిని తెలుసుకొని యెల్లప్పుడు లేని యేరుకను లేదనినమ్ముకొనుమని భావము.

౧౦౭ కం॥ ద్వైతా ద్వైత విశిష్టులు ॥ నైతురు వినినైన రెప్పుడు నైనక పిదపన్ ॥ నైతురు క్రమమున వేరన ॥ నాతతమతి జీవశివుల నవివినబోకూ॥ నేబోధించి ॥ నదివిడబోకూ ॥ పూతామా బయలూను పొడజూచి గురునీచె ॥ ద్వైతాద్వైత విశిష్టద్వైతాములను మాను ॥ మవివినబోకూ ॥ నేబోధించి ॥ నది విడబోకూ॥ ॥౨॥

ఓ శిష్యుడా! ద్వైతులు జీవేశ్వరులు భిన్నమనియు అద్వైతులు యేకమనియు విసిష్ఠాద్వైతులు మొదట యేకమని తరువాత భిన్నమనియు ఒప్పుకొనుచుందురు అట్టి మతవాదములను నీవువినకు నేను చెప్పినది వదలకు సద్గురుని కృపచే నిర్మలమైన పరిపూర్ణమును జూచి పైన చెప్పబడిన మతములను మానుమని భావము.

౧౦౮ కం॥ కొందరు దశవిధనాదము ♦ లందున నభపంచకంబు నందున చక్రా ♦ లందున లక్ష్యధ్యానం ♦ బందున హంసందుబుద్ధి నాటిం తురో యీ ♦ యోగములందు ♦ నటియింతురోయీ ♦ అంది సిద్ధులచేత నానందింతురు కొంద ♦ రం దారిమను సీబోధందెసీవుండూము నాటింతు రోయీ ♦ యోగములందు ♦ నటియింతురోయీ॥

ఓ శిష్యుడా! కొందరు పదివిధముల నాధముల యందును కొందరు ఆకాశ పంచకము నందును కొందరు షట్చక్రముల యందును కొందరు (త్రివిధ) లక్ష్యముల యందును కొందరు ధ్యానము నందును కొందరు హంసయందును కొందరు (అష్టాంగ) యోగములయందును కొందరు (అష్ట) సిద్ధులయందును యెవరెవరి యిష్టానుసారముగ బుద్ధిని ప్రవర్తింపజేసి నటించుచు ఆనందముందుచుందురు అదివారియిచ్ఛసుమా నీవు మాత్రము నేను జెప్పిన పరిపూర్ణబోధ యందెనుండుమని భావము.

౧౦౯ కం॥ కొందరు ముద్రలుగనవలె ♦ నందురు మరికొంద రధిక మందురు ద్రష్టన్ ♦ కొందరు భజనేతెస్సని ♦ యందురు యివియన్ని యెరుకె♦ నని తెలుసుకొనుమీ ♦ నీకివియేల ♦ పనిలేదు వినుమీ ♦ ముందూగ పరిపూర్ణ మున్నాదిగని గుర్తు ♦ నెందుండకుండ దాన్నెగ రాగొట్టితెజాలు ♦ నని తెలుసు కొనుమీ ♦ నీకివియేల ♦ పనిలేదు వినుమీ॥ ॥౪॥

ఓ శిష్యుడా! కొందరు పంచముద్రలను చూడవలెనందురు కొందరు ద్రష్ఠ దర్శనము ఉత్తమమందురు కొందరె భజన సల్పితెబాగు అని చెప్పుదురు ఇవి అన్నియు యెరుకయని తెలుసుకొనుము పనిలేని పీటితో నీకెందుకు మొట్టమొదలు పరిపూర్ణము నుండజూచి గుర్తుయనె యెరుకను తీసివేయుము చాలునని భావము.

౧౧౦ కం॥ దేవుణ్ణి నిన్ను యెరుగవు ♦ నీవిప్పటి కెట్టివారో నే దెల్పెద నీ ♦ కేవెర్రి బోధలెందుకు ♦ కావున దేవుణ్ణి యిదుగో కనుగొనవోయీ ♦ నామరూప ♦ కర్మాలేవోయీ ♦ నీవాదేవునిలోననిను లెస్సవెదకి న ♦ న్నావాలి ముచ్చాటనడు గోయి తెల్పెద కనుగొనవోయీ ♦ నామరూప ♦ కర్మా లేవోయీ॥ ॥౫॥

ఓ శిష్యుడా! దేవున్ని నిన్నును నీవు గుర్తెరుగవు నీవు యెటువంటి వాడవో నేను జెప్పెదను నీకు పిచ్చిబోధలతో పనిలేదు. ఇదుగో దేవున్ని చూడుము నామరూప క్రియలులేవు నీవు ఆ దేవునిలోపల నిన్ను బాగుగావెదకి ఆటుమీదట నన్ను అడుగుము నేను జెప్పెదనని భావము.

౧౧౧ కం॥ మానవుడు చేయబూనిన • దానిని లోతెరిగి చేయదగునని మదిలో • నేనెరిగి నీకు జెప్పితి •, పూనుము రుచిబుట్టదేని పోనీనీమనుసూ • రుచిబుట్టితె • పూనూ నీమనసూ • నేనేమి యనబోతె నీ కేమిదోచునో • లేని నిష్టూరాము లేకుండుటే లెస్స • పోనీ నీమనసూ • రుచిబుట్టితె • పూనూ నీమనసూ॥ ॥౬॥

ఓ శిష్యుడా! మనుజుడు తాము చేయబూని పనియొక్క మంచీచెడ్డలను తెలుసుకొనుట మంచిదని నా మనస్సులో నేను తెలుసుకొని నీకు చెప్పితిని నీవును అట్లేచేయుము యిదనీకు యిష్టముండదేని పోనిమ్ము యిదినీకు యిష్ట ముండిన యెడల మనస్సులో విచారించుకొని చేయము నేనేమైన అనబోతె నీ మనస్సున కేమిదోచునో లేనినిష్ఠూరము లేకుండ ఉండుటే మంచిదని భావము.

౧౧౨ కం॥ చాదశక్షరముల్ప్ర • పంపంచము తానుద్భవించె ప్రణ వాక్షర మం • దంచు శృతులెన్నె దాన్నెరు • కంచని నీ వెరిగి యెరుగు మచలాముదీనన్ • నిల్పకు మెరుక • నచలాములోనన్ • చంచాలమతిచేత చతురాక్ష రేక్కూవం • చెంచేద వెందుకు యిదినమ్మ కేరుగూమి • యచలాము దీనన్ • నిల్పకు మెరుక • నచలాములోనన్॥ ॥౭॥

ఓ శిష్యుడా! ప్రణవమువలన పంచాదశాక్షరములు వాటివలన ఈ ప్రపంచము బుట్టెనని వేదములు జెప్పుచున్నవి ఆప్రణవమునే యెరుకయని నీవు తెలుసుకొచుము పరిపూర్ణమును తెలుసుకొని దానిలో యెరుకను నిలుప కుము చంచలబుద్ధిచేత చతురాక్షరిని పెద్దదని తలంచకుము దీనిని నమ్మకూడ దని భావము.

౧౧౩ కం॥ యెరుకజడ మజడ మీజగ • మరయగపరి పూర్ణ మేమి యనరానిది యా • యెరుక జగముల స్థిరములు • పరిపూర్ణము శాశ్వితపుది పాటించికనరా • కావారెండీ • పాటీవివినరా • గురుముఖమున వీటెన్నెరుడూ గురైరుగూనా • తిరిగి పుట్టడువాడీ ధరపై మునుపటివలె • పాటించికనరా • కావారెండీ • పాటీవివినరా॥

ఓ శిష్యుడా! విచారించగా యెరుకయే జడము అజడము జగము ఆయను పరిపూర్ణము ఇట్టిదట్టిదని చెప్పుటకు వీలులేనిది ఆ యెరుక జగములు అశాశ్వితములు పరిపూర్ణము శాశ్వితమైనది అని ఆలోచించుకొని యీ రెంటిని వేరు వేరని భావించి వీటిని గురుమూర్తివలన యేమానవుడు తెలుసుకొనునో ఆ మానవుడు మరల యీభూమిపై జన్మించడని భావము॥

౧౧౪ కం॥ కొందరు భూతములై దిటి • యందున చిత్తంబునుంతు రధిక ములనుచున్ • కొందరు యేమియు లేదని • యందురు గుర్తెరుగుమిన్ని యప శబ్దములెరా • యివినిలువాని • వని తెలియవలెరా • యెందారెన్నన్నా నీకెందూకు బయలూను • ముందూగగని గుర్తు నెందుండనివకవ్వి • యప శబ్దములెరా • యివినిలువాని • వని తెలియవలెరా॥ ॥౯॥

ఓ శిష్యుడా! కొందరు పంచభూతములను శ్రేష్ఠమని చెప్పుదురు కొందరు యేమియులేదని (శూన్యవాదము) వాదింతురు ఇవి యన్ని అబద్ధము లని అస్థిరములని గుర్తెరుగుము యెందరు యెన్ని అంటె నీకేమి మొదలు పరి పూర్ణమును తెలుసుకొని యెరుక (గుర్తు)ను తీసివేయుమని భావము.

౧౧౫ కం॥ కొందరు కర్మమునే బా • గందురు మరికొంద రెక్కు వందురు తనువున్ • కొందరు ప్రాణములధికము • లందురు నీకిట్టి వట్టి యాశా లేమిటికి • వారితో పొందు • జేసేవేమిటికి • యెందాక మాటాల నెన్నినయా బోధ • కిందీవెకాని పైకెక్కవిగా విట్టి • యాశాలేమిటికి • వారితొపొందు • జేసేవేమిటికి॥ ॥౧౦॥

ఓ శిష్యుడా! కొందరు కర్మను ఉత్తమమని చెప్పుదురు. కొందరు శరీర మును (నిలుపుట) గొప్పతనమందురు కొందరు ప్రాణములను యెక్కువయని చెప్పుదురు నీకు వృథా ఆశలతో పనిలేదు వారలతో స్నేహము జేయకు యెందరెన్ని జెప్పినను ఈ పరిపూర్ణ బోధకంటె తక్కువవేకాని యెక్కువ యేమాత్రము కావని భావము.

౧౧౬ కం॥ తనువెరుకలు రెండొక్కటి • యని యనరాదనుచు కొంద రందురు భువిలో • తను వెరుకలలో నొక్కటి • గనరాకుంటేను రెండు గన రావోయన్నా • రెండొక్కటె • వినరా మాయన్నా • అనుమానమిక యేం అందారి మాటాలు • వినబోకనే బోధించినరీతి నెప్పుడు • గనరావోయన్నా • రెండొక్కటె వినరామాయన్నా॥ ॥౧౧॥

ఓ నాయనా! తనువు యెరుక అను రెండింటిని ఒక్కటిగా చెప్పగూడ దని కొందరందురు ప్రపంచములో యీ రెండింటిలో నొకటి కనబడనిచో రెండును కనబడవు యీ రెంటును ఒక్కటే సందేహము యికయెందుకు యితరుల మాటలువినక నేజెప్పిన ప్రకారముగ యెప్పుడు తెలుసుకొను చుండుమని భావము.

౧౧౭ కం॥ కన్నులప్రక్కన వ్రేళ్ళిడి • తిన్నగ భ్రూమధ్యమందు దృష్టినిలిపియుం • దున్నది వెన్నెలలో బయ • లన్నా కనుమందురెరుకె అది నిలువదోయీ • తనువుతో బోయ్యె • దని దెలియుమోయీ • యెన్ని తనువులువచ్చి యరిగీన భయపడక • వున్నా బయలిదిజూచి వుళ్ళక్కెరుకను మాను • మదినిలువదోయీ • తనువుతో బోయ్యె • దని తెలియుమోయీ॥౧౨॥

ఓ శిష్యుడా! కొందరు కనుల ప్రక్కనవేళ్ళు బెట్టుకొని కనుబొమ్మల నడుమ చూపును నిలిపి దానిలోనున్నది వెన్నెలలో బయలు చూడుమని చెప్పుదురు అది నిలువక శరీరముతో బోవునని గుర్తించుము యెన్ని శరీరములు వచ్చిపోయినను భయపడక యుండుము పరిపూర్ణమును జూచి లేనియెరుకను విడువుమని భావము.

౧౧౮ కం॥ జనులాత్మానుభవంబై • ననుముక్త్యని పల్కిరిట్లు నమ్మకుమెరుకె • కనరాదెచ్చట గురుకృప • ననుభవ మెవ్వరికిపైన ఆమాటనిజమో • అనుభవ ముళ్ళ • క్కిమాట నిజమో • వినజెప్పుమీ రెండువివరించి పైమాట • విని నేముందరి బోధ వినిపింతువేవేగ • ఆమాటనిజమో • అనుభవముళ్ళ • క్కిమాట నిజమో॥ ॥౧౩॥

ఓ శిష్యుడా! జనులు ఆత్మ అనుభవము మోక్షమని జెప్పిరి అది నమ్మబోకుము లేనియెరుకెసుమా గురుకటాక్షములేదు కాబట్టి అనుభవ మెవ్వరికిని లేదు పైన జెప్పిన అనుభవము కలదనెడు ఆ మాట సత్యమా లేక అనుభవము లేదనెడు యీమాట సత్యమా ఈ రెండింటిని విచారించుకొని చెప్పుము నేను నీమాటనువిని ముందు జెప్పవలసిన పరిపూర్ణ బోధను తొందరగా వినిపించెదనని భావము

౧౧౯ కం॥ తనను తా గనిన మోక్షం • బనిపల్కిరిగాని జనులు అది నమ్మకుమీ • తనను తాబట్టబైటను • గనబోయితె తనకుదానె కానరాదో యీ • విశ్వముతనకు • కానరాదోయీ • తననుంచై నదిగనుక తాను విశ్వము రెండు • గనిపించుటుళ్ళక్కి గావున తనకుదా • కానారాదోయీ • విశ్వముతనకు • గానరాదోయీ॥

ఓ శిష్యుడా! తననుతాను దెలుసుకొనుటయే మోక్షమని కొందరు జెప్పిరిగాని అది నమ్మకుము తననుతాను పరిపూర్ణములో చూడబోయితె తనకుతానె అగుపడదు ఈ ప్రపంచము గూడ తనకు కనబడదు తనవలన బుట్టినది గనుక తనకుతాను ప్రపంచము యీ రెండు కనబడుట అసత్యము సుమాయని భావము.

౧౨౦ కం॥ మాయగదా లేనియహం • బాయగదా తన్ను దానె అచలముయే • ర్పాటాయగదా మాయనలేం • దాయగదా మాయచిత్రి మాయా గదోయీ • సంశయ మంత • పాయగదోయీ • మాయా సమూలాము మాయజూస్తుండంగ • మాయమైపాయను • మాయాకెయిది చిత్రి • మాయ గదోయీ • సంశయమంత • పాయగదోయీ॥ ॥౧౫॥

ఓ శిష్యుడా! మాయ అనగా లేని అహంకారము అది పరిపూర్ణమును తనకుతానే యేర్పరచుకొని మాయ అనునది లేనిదయ్యేను యీ మాయలక్షణములు మహా ఆశ్చర్యముగా నుండునని తెలుసుకున్నచో యేసందేహము ఉండదు మాయ సమూలముగా మాయచూచుచుండగనే మాయమగునని తెలుసుకొనుమని భావము.

౧౨౧ కం॥ లేనియహమున్న బయలును • లేని ప్రపంచమును తనను లెస్సగ తనలో • తాను విమర్శించినయా • లేనివి లేకుండునవల లేదూ యేమాటా • యిట్లననైన • లేదుయేమాట • లేనియహమీబైట లేనెలేదిది జూచి •లేనీదికలదాని లేనిమాటాడేవు • లేదుయేమాటా • యిట్లననైన • లేదు యేమాటా॥ ॥౧౬॥

ఓ శిష్యుడా! లేని అహంకారము ను ఉన్నపరిపూర్ణమును లేని ప్రపంచ మును తనను తనలోతాను చక్కగా ఆలోచించుకున్న యెడల లేని అహంకారము ప్రపంచములు రెండును లేక పోవును తరువాత యేమాట ఉండదు ఇట్లనుటకుగూడ యేమాట వుండదు లేని అహంకారమును పరిపూర్ణములో లేనేలేదు యిది విచారించుకొని లేనిదానిని వున్నదని అబద్ధము చెప్పకుమని భావము.

౧౨౨ కం॥ పరిపూర్ణ మెరుకలెట్టివొ • గురుముఖమున రెంటిన్ని లెస్స గురుతెరి గెరుకన్ • సరిపుచ్చుకొన్న మృషయని • పరిశుద్ధపుబోధయీది • పాటించికనరా • శివరామూల • పద్ధాతియిదేరా • నరులు కొందరుబల్కి రెరుకాను మ్రింగి యీ • పరిపూర్ణమయ్యే మంచెరుగాక చెడూటాకై • పాటించి కనరా • శివరాముల • పద్ధాతియిదెరా॥

ఓశిష్యుడా! సద్గురువలన పరిపూర్ణము యెరుకఅను రెండింటియొక్క లక్షణమును బాగుగా దెలుసుకొని యెరుకను అసత్యమని మ్రింగి కున్నచో పరిశుద్ధమగు యీ పరిపూర్ణబోధను నిధానించి చూడుము ఇదే శివరామదీక్షితుల వారి మార్గము కొందరు లోకులుచెడి పోవుటకై యెరుకను మ్రింగి పరిపూర్ణ మయ్యేదమని చెప్పిరని భావము.

౧_౨౩ కం॥ బిందువు తనువునబుట్టును • బిందువుతను వింద్రియముల బృందంబసువుల్ • అందముగ గలుగు నివిదే • నందున బుట్టినవో తెలియ నజునికితరమా • మూలములేని • వని తెలుసు కొనుమా అందూకె బయలున్న దరసి మూలములేని • బింద్వాది కంబూల పేరూదల్వకు దెలియ • నజు నికి తరమా • మూలములేని • వని తెలుసుకొనుమా॥ ॥౧౮॥

ఓ శిష్యుడా! బిందువను యెరుక శరీరమున బుట్టును బిందువు శరీరము యింద్రియ సమూహము ప్రాణములు అనునవి దేనియందు బుట్టునవియో దానిని తెలుసుకొనుటకు బ్రహ్మకుగూడ వశముగాదు కనుక ఇవి మూలము లేకుండ తనకుతానె కలుగువని యెరుంగుము అందుచేతనే పరిపూర్ణమును చూచి మూలములేని బింద్వాదులయొక్క పేరును తలంచకు సుమాయని భావము.

౧_౨౪ కం॥ జనులనిరి దేవుదెవరికి • కనరాడని నామరూపకర్మ జన నముల్ • గననతనికి లేవని యా • జనవాక్యము బయలు కెప్పుడు సహజమౌ వినరా • అనుమానము • చాలించికనరా • కని నామరూపాదికములున్న యెరుకను • వినబోక కనబోక విడిచి పెట్టరపోని • సహజమౌ వినరా • అను మానాము • చాలించికనరా॥ ॥౧౯॥

ఓ శిష్యుడా! దేవుడెవరికి కనపడడనియు అతనికి నామరూపక్రియలు గాని చావుపుటుకలుగాని లేవని లోకులు చెప్పిరి. ఆ లోకుల మాటలు సహజ ముగా పరిపూర్ణమునకే చెందియుండును సంబియము లేక బయలును చూచి నామరూపక్రియ చావుపుటుకలు గల యెరుకను చూడక వినక వదలిపెట్టుమని భావము.

౧_౨౫ కం॥ అంతటగలదీ యెరుకని • యెంతో వాదింపుచుందురెరుగని వారల్ • అంతట నింతట గనుపడు • నంతటిదేకాని యెరుక అంతట గలదా • అది నిజమైతే • యగుపడవలదా • అంతాటగల దొక్క అచలామేశా నెరుక • నంతాట గలదాని యనరాదు • వినరాదు • అంతట గలదా • అదినిజమైతే • యగుపడవలదా॥ ॥౨౦॥

ఓ శిష్యుడా! తెలియని లోకులు యెరుక అంతట కలదని వాదింతురు ఆ యెరుక అచ్చట ఇచ్చట కనబడునేగాని అంతట కనబడదు సత్యమైతే కన పడవలెనుగదా అంతట నున్నది అచల పరుపూర్ణమేగాని యెరుక మాత్రము అంతట నున్నదని అనగూడదు వినగూడదని భావము.

౧౨౯ కం॥ బయలాకస మనికొందరు • భయపెట్టెద రందువలన భయపడకుసుమీ • బయలందు శబ్దమున్నను • బయలాకస మనుచునమ్మ • బడని నీచేతా • శబ్దములేదీ • భ్రమయెందు చేతా • బయలాకాశము గాదు పరిపూర్ణమనినమ్మి • నయమూగ యెరుకాను నమ్మాక విడిచిపో • బడనినీ చేతా • శబ్దములేడీ • భ్రిమయెందుచేతా॥ ॥౨౦॥

ఓ శిష్యుడా! పరిపూర్ణము ఆకాశమని కొందరు భయపెట్టుదురు. ఆ మాటలకు నీవు భయపడకుము బయలునందు శబ్దగుణము యున్నయెడల ఆకాశమని నమ్మవచ్చును. శబ్దగుణములేని ఆ బయలునందు ఆకాశమనె భ్రాంతి యెందుకు బయలు ఆకాశముగాదు పరిపూర్ణమని నమ్మి యీయెరు కను నమ్మక వదలివేయుమని భావము.

౧౨౭ కం॥ కలమేల్కొ లెరుక బయలుల । కిలసామ్యముజేసి చూడు మీభ్రిమ దొలగుణ । ఫలమేమి పెక్కుచదువుల। వలనను జప యాగయోగ। వ్రితములవలనన్ । శమ దమ మఖ। శతమూల కలనన్ । తలక్రిందుగా బడ్డ తనువునెగానన్న । కలమేల్కగని తానెక్కడ నిల్వనట్లౌనె । వ్రతముల వల నన్ । శమదమమఖ । శతమూల కలనన్॥ ॥౨౨॥

ఓ శిష్యుడా! కలమేలుక అను రెంటికి యెరుకబయలు అను రెండిం టికి వుపమానముజేసి చూడుము నీకుగల భ్రాంతిపోవును. అనేక చదువుల వలనను జపములు యోగములు వ్రితములు శమ దమములు అనేక యజ్ఞ ములు మొదలగువాటిని చేసినందువలన యేమిప్రయోజన ముండదు. తలక్రిం దులుగా నిలుచున్న యీశరీరము నేను కానను చెప్పినను కల మేల్కొలను చూచి తాను యెక్కడ నిలువకుండ బోయినట్లు యీభ్రాంతి పోవునని భావము.

౧౨౮ కం॥ నీకలలో నినునన్ను ను । లోకుల లోకములజూచి లోపలి భ్రమచే । నాకరుణబడసి మేలుక । చేకొని కలకల్లజేసి । చేరెదవెటకో సర్వమునీతో । చేరీనియటకో । ప్రాకటముగ బట్టబయలెరుక లీరీతి । నీకు దెలిసినమీద నిలువాక వేవేగ । చేరెదవెటకో । సర్వమునీతో । చేరీనియటకో॥

ఓ శిష్యుడా! నీకలలో నిన్ను నన్ను ప్రిజలను ప్రిపంచములను ఆలోపలి భ్రాంతిచేజూచి నా అనుగ్రిహము బొంది మేలుకొని కలను అబ ద్ధముచేసి నీవెచ్చటికి పోయెదవో అచ్చటికే నీతోటి సర్వము పోవును. ఈరీతిగ పరిపూర్ణము యెరుక అను రెండు నీకు విశదముగా తెలిసినపిదప నీవు క్షణ మైన నిలువజాలవని భావము.

౧౨౯ కం॥ హరికర నఖముఖవిదళిత । కరిమస్తక గళితమైన ఘన మౌక్తికముల్ । దొరికిన నెరుకలు గురిజలె । ధరియింతురు రెటివిలువ తమ రెరుగకనెకా । అట్లనెబోధ । క్రిమమెరుగకనెకా । పరిపూర్ణబోధను యెఁగింపు చుండిన । యెరుకాకె కొందరు మరిగేరీ మర్మాము । తమరెరుగకనెకా । అట్లనె బోధ । క్రమమెరుగకనెకా ॥ ॥౨౪॥

ఓ శిష్యుడా ! సింహముయొక్క వాడిగోళ్ళచే చీల్చబడిన యేనుగ కుంభస్థలమునుండి రాలిన ముత్యములు దొరికినప్పటికి యెరుకు వారు గురిజ గింజల పేరులుధరియింతురు. వారికి ముత్యములయందును గురిజ గింజల యందుగల విలువదెలియక అట్లొనర్తురు. ఆవిధముగానే పరిపూర్ణ బోధయొక్క పద్ధతిని తెలుపుచున్నను కొందరు యెరుకకే మరుగుదురని భావము.

౧౩౦ కం॥ తనువో బహిరింద్రియములో । మనసో ప్రాణములో విషయ మమతో నేనం । చని నీవని యన నిదియని । యనుమానించెద వదేల అదిత్రోవగాదూ । నీవెన్నాడు । యిదివినలేదూ । వినుమీ పరిపూర్ణాము గని లేని యామీది । తను వాదికమును లేందని గురునిచే దెలియు । మదిత్రోవ గాదూ । నీవెన్నాడు యిదివినలేదూ ॥ ॥౨౫॥

ఓ శిష్యుడా ! శరీరము బహిరింద్రియములు మనస్సు ప్రాణములు విషయేంద్రియములు మమకారము నేను నీవు అది యిది యనుచు యెందుకు సందేహించెదవు త్రోవ అదిగాదు. నీవు యెప్పుడు వినలేదు యిది వినుము. సద్గురుమూర్తిచే పరిపూర్ణమునుజూచి తర్వాత శరీరాదులను లేవని గుర్తెరుగు మని భావము.

౧౩౧ కం॥ నిను నను ప్రపంచమును జగ । మనియెరిగే యెరుకచేత నచలమును గనుం । గొని నిననను జగమును జగమనియెరిగె యెరుకమాను । మమలావివేకా ॥ చాలునీవీ । క్రిమమెరిగి నాన్నా । నిననన్న పైరెండింటిని విశ్వ । మనక బయలనకుండెందున్నా । దంచన గుర్తులేకుండు । మమలా వివేకా । చాలు నీవీ । క్రమమెరిగినాన్నా॥ ॥౨౬॥

ఓ స్వచ్ఛమైన జ్ఞానము గలవాడా ! నిన్ను నిన్నని నన్ను నన్నని జగత్తును జగత్తనితెలుసుకునెయెరుకచేత అచల పరిపూర్ణమును తెలుసుకొని నిన్ను నిన్ననినన్ను నన్నని జగత్తును జగత్తని తెలుసుకునెయెరుకను విడువుము. నీవు

యీ క్రమమును తెలుసుకున్న తరువాత నీకన్నియునుచాలు. నిన్నని నన్నని జగత్తని చెప్పక పరిపూర్ణమని చెప్పక యివి యెచ్చటనున్నవి యను యెరుక లేకుండ నుండుమని భావము.

౧౩౨ కం॥ పొద్దున నిద్దుర మేల్కొని। వద్దికేయేతెంచి గురుని వక్త్రి జనితమౌ। సుద్దుల మ్రొక్కి వినుము యే। ప్రొద్దిసి ఒహు ముద్దు సుమ్మ। పుట్టినందుకూ। గురుచరణాము। పట్టినందుకూ। సిద్దామౌ భక్తిచె నీవిట్లు జేసితె। వద్దితీరిచి బోధ తెరువూజూపును నీవు। పుట్టినందుకూ। గురుచరణాము। పట్టినందుకూ॥ ॥౨౭॥

ఓ శిష్యుడా! సూర్యోదయ కాలముననే నిద్రనుండి లేచి గురునివద్దకు వెళ్ళి సాష్టాంగ నమస్కారము గావించి వారుజెప్పెడి మంచిమాటలను వినుము. నీవు జన్మించినందుకు సద్గురు చరణము లాశ్రయించినందుకు ఇది మంచిది సుమీ భక్తిగలిగి నీవు యీరీతిజేసితివేని సద్గురుడు నిన్ను సవరించి పరిపూర్ణ బోధ మార్గమును చూపునని భావము.

౧౩౩ కం॥ గురుడు పరిపూర్ణమును జూ। పెరుకను లేదనుచుదెల్పి। యికదల్చకుమం చెరగించక విడిపోవునె। యెరుక నరుల్ సాధనములు। యెన్ని జేసిననూ। లక్ష్యముద్ర। లెన్ని జూచిననూ। హరిహర బ్రహ్మ మరాసుర ముఖులైన। ధరణీ సురాద్యష్టదశ జాత్యుద్భవులాను। యెన్ని జేసిననూ। లక్ష్యముద్రి లెన్ని జూచిననూ॥ ॥౨౮॥

ఓ శిష్యుడా! యెరుకయందుండెడు త్రిమూర్తులును దేవతలును రాక్షసులును మొదలైన బ్రాహ్మణాది పదునెనమిది జాతులయందు పుట్టిన మనుష్యులు యెన్ని సాధనములు జేసినను లక్ష్యములను ముద్రలను యెన్ని జూచినను సద్గురుడు పరిపూర్ణమును తెలియజేసి యెరుకలేదనిచెప్పి యీయెరుకను మీతలంపుకు రానివ్వకుమని చెప్పకుంటె యెరుక వదలదని తెలుసుకొనుమని భావము.

౧౩౪ కం॥ బల ధన విద్యా ధైర్యం। బులు చక్కదనంబు సత్వబు ధ్యాద్యుతులన్। కలలో యివిలేని మను। ష్యుల జగమును తనను తాను। జూచిమానవుడూ। మేల్కొనెనేని। చూడాలేడొకడూ। కలమేల్క యెరుక బయిలులకట్లు ఇతగూర్చి। కలయెరుకను దేశికులచె। వీడితెజాలు। చూచి మానవుడూ। మేల్కొనెనేని। చూడాలేడొకడూ॥ ॥౨౯॥

ఓ శిష్యుడా ! స్వప్నములో బలము ధనము విద్య ధైర్యము చక్కదనము బుద్ధి మొదలగు యీసర్వమును లేని మానవులను ప్రపంచమును తనను తానుజూచిన మనుష్యుడు మేల్కొ౯ంచెనేని ఒక్కరినైన జూడలేడు. సద్గురునికృపచే కలమేల్కొలను యెరుకబయలులకు జంటజేసి మేల్కొబయలులను చూచి కలయెరుకలను వదలితె చాలునని తెలుసుకొనుమని భావము.

ఇతి, శ్రీమద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే సకల మతలక్షణన్నామ సప్తమోధ్యాయః.

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే

వ్రాయబడిన భావార్థ సహితములు

(మ తా ల ల క్ష ణ ం) అను

ఏడవ అధ్యాయము.

—(౦)—

## —: ా ప రి పూ ర్ణ బో ధ ాఃః :—

౧౩౫ క౹౹ యీవృత్త బట్టబయలును । నేనిప్పుడు వుండజూచి నిజముగ యెరుకన్ । నీవని నేనని జగమని । భావింపుము పిదప దీన్ని । బాయుమనిశమున్ । నిజముగదీన్ని । బాయక నిశమున్ । శ్రీవనితేశ రాజీవసంభవ భవ । దేవేంద్రాదుల నింక సేవించుతలుపేల । పాయూమనిశమున్ । నిజముగదీన్ని । బాయకనిశమున్॥ ॥౧॥

ఓ శిష్యుడా ! ఈ పరిపూర్ణమును ఇప్పుడే నీవు వున్నట్టుగాజూచి సత్యముగా యెరుకను నీవని నేనని ప్రపంచమని తలంచి తరువాత యీయెరుకను సర్వదా వదలుకొమ్ము. ఈభావమును నిజముగా విడువకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు దేవేంద్రుడు మొదలగు దేవతలను కొలుచుటకు కోరిక యెందులకని భావము.

౧౩౭ కం॥ లేదనకు మున్నదదుగో । నేదెలిసితిననకు దీన్ని నీవెరిగేవా । కాదదినీచే దెలియను । యేదిర తన్మాత్ర సమితి । యీాబట్టబైటా । దీనికిసాటి । దేదియెచ్చోటా । వాదేలలేనెరుకతో దీన్నిగనిపెట్టి । పోదొట్టు మెరుక నింకేది బట్టదుబాలు । యీాబట్టబైటా । దీనికిసాటి । దేదీయెచ్చోటా॥

ఓ శిష్యుడా! అదుగో పరిపూర్ణము లేదనకు ఉన్నది చూడుము. నాకు తెలుసునని యనకు ఇది నీకు తెలియదు యీా పరిపూర్ణమునందు (శబ్ద స్పర్శ రూప రస గంధ) పంచతన్మాత్రలులేవు. యీా పరిపూర్ణముకు సరిపోల్చదగినది యెందునలేదు వివాదము వలదు లేనియెరుకచేత పరిపూర్ణమును జూచి యెరుకను వదలుము. నీకు యేదియు అవసరము లేదని భావము.

౧౩౭ కం॥ కనవచ్చి యిట్టిదట్టిది । యనియనరాకుండు బయలు నదె కనుగొనుమీ । కనరాకపోతె శూన్యం । బను మిట్టిది యట్టిదనుచు । పలుకవచ్చిననూ । యెరుకదాంట్లో । పలకీజొచ్చిననూ । వినుమా బయలును నీవే మనినా నొప్పెటగ । నొప్పను నీమాటను నే జెప్పినరీతి గనవస్తె । పలుకవచ్చిననూ । యెరుకదాంట్లో । పలికీ జొచ్చిననూ॥ ॥౩॥

ఓ శిష్యుడా! ఈ పరిపూర్ణము కనపడి మాటలచేత నిట్టిదట్టిదని యనుటకు సాధ్యముగాకుండును. అదె పరిపూర్ణమును చూడుము. కనపడకున్నచో కల్లయనిజెప్పుము (ఇట్టిదట్టిదని చెప్పరాని) పరిపూర్ణమును యిట్టిదట్టిదని చెప్పవచ్చినను ఆ పరిపూర్ణములో (జొచ్చుటకు వశముగాని) యెరుక జొరబడినను నీవు యేమాట జెప్పినను ఒప్పుకుందును కాని నేనుచెప్పిన ప్రకారముగ నుంటె నీమాట ఒప్పుకొనననని భావము.

౧౩౮ కం॥ కనవచ్చు బయలు లేదని । యనవచ్చునె యిట్టిదట్టిదనవచ్చునె ఛీ । యనరాదు యెరుకకెన్నడు । గనుకనె యీా బయలు యెల్లకాలాముంచుండీ । దీనందెరుకే । కాలాములేందీ । వినుమీ లేనెరుకాను వివరించ శూన్యామౌ । అనుమాన మేమెరుక గను విశ్వమట్టిదే । కాలాముంచుండీ । దీనందెరుకే । కాలాములేందీ॥ ॥౪॥

ఓ శిష్యుడా! కనుపడునట్టి పరిపూర్ణమును లేదనవచ్చునా? అనగూడదు యెరుకకు (యీాబయలు) యిట్టిదట్టిదని చెప్పవచ్చునా. ఛీ యెప్పుడు చెప్పరాదు కాబట్టి యీాపరిపూర్ణము యెల్లకాలము ఉంటుంది యెరుక ఈపరిపూర్ణమందు యెప్పుడులేనిది విచారించి చూడగ యీాలేనియెరుక లేనిదెయగును

యీ యెరుకచేత కనబడెడి ప్రపంచముగూడ లేదని తెలుసుకొనుము సందేహము వలదని భావము.

౧౩౯ కం॥ పరిపూర్ణమనిన యెట్టిదొ । యెరిగెదనని యెరుకబైటకేగిన యెరుకే । యెరుకకు శూన్యంబయ్యెను । యెరుకను జన్మించినట్టి యీవిశ్వమంతా । యెరుకవలెనె । యేమీలేదంతా । యెరుక వుండంగానే యెరుక విశ్వములు లే । వెరుకాకెయిది జూడయెంతో వింతైతోచె । యీవిశ్వమంతా । యెరుకవలెనె । యేమీలేదంతా ॥ ॥౫॥

ఓ శిష్యుడా ! పరిపూర్ణమనగా నెటువంటిదో తెలుసుకొందునని వెలుపలకు వచ్చిన యెరుక తనకుతానే లేకపోవును. ఆ యెరుకవలన కలిగిన జగత్తంతయును యెరుకరీతిగనె యేమిలేనిదగును. యెరుక వుంటుయుండగనే యెరుకయు జగత్తున్ను లేకుండును యెరుకకు యిదిచూడ యెంతో ఆశ్చర్యముగా నుండునని భావము.

౧౪౦ కం॥ గురుమూర్తి జూపకున్నను । పరిపూర్ణంబెట్లు తనకు ప్రత్యక్షమగున్ । గురుమూర్తి జూపెనేనియు । పరిపూర్ణము తనకులెస్స ప్రత్యక్షమౌరా । చూస్తునె యెరుక । పారిపోవునురా । యెరుకాపోయినవెనుక యెవరా ప్రత్యక్షాన్ని । యెరిగిట్టిదట్టిదం చెరిగె వారటుమీద । ప్రత్యక్షమౌరా । చూస్తునె యెరుక । పారిపోవునురా ॥ ॥౬॥

ఓ శిష్యుడా ! సద్గురుడు పరిపూర్ణము జూపకుంటె యెట్లుకనపడును (కనపడదు) సద్గురుడు జూపెట్టెనేని తనకు పరిపూర్ణము సాక్షాత్కరించును పరిపూర్ణమును చూడగనే యెరుక పరుగెత్తును ఆయెరుక పరుగెత్తిన తర్వాత యెవరు ఆసాక్షాత్కారమును గుర్తించి యిట్టిదట్టిదని తెలుసుకునేవారు (యెవ్వరులేరు) అని భావము.

౧౪౧ కం॥ పరమ పదమనిన బయలన । గురుగుహ్య మనంతమనిన గోప్యంబనినన్ । పరిపూర్ణ మచలమనినను । తిరమనగా బట్టబయలు తెలియుమాయప్పా । యీ తెలిసిన । తెలివిమానప్పా । యెరుకా నెరుగనిదన్న నెరుక మీరినదన్న । యెరుకా మరుపులులేని పరవస్తువన బయలె । తెలియుమాయప్పా । యీతెలిసిన । తెలివిమానప్పా॥ ॥౭॥

ఓ నాయనా ! పరమపదము బయలు గురుగుహ్యము అనంతము గోప్యము పరిపూర్ణము అచలము తిరము అనునవి బట్టబయలని తెలుసు

కొనుము యీ తెలిసిన తెలివిని విడువుము యెరుకను యెరుగనిది యెరుకకు అతీతమైనట యెరుక మరుపులులేని పరవస్తువు అనుభవిగూడ బయలని తెలుసుకొనుమని భావము.

౧౪౨ కం॥ బట్టబయలనుచు దీనికి। మొట్టమొదల్ పేరులేదు ముదమున యెరుకే। పుట్టిపేర్పెట్టి దీనిని। పట్టుకలవ్వాడలేక పారిపోవునురా। కనరాదిందు। దూరానేరదురా। పుట్టిచచ్చుచు మళ్ళుబుట్టిగిట్టుచు బుట్టు। నిట్టి తిప్పలనొందు యెరుకెబయలును జూస్తె। పారిపోవునురా। కనరాదిందు। దూరనేరదురా ॥ ॥౮॥

ఓ శిష్యుడా! ఈ పరిపూర్ణమునకు మొట్టమొదట బట్టబయలను పేరు లేదు యెరుక జన్మించి సంతోషముతో పేరుబెట్టి దీనిని పట్టుకొని నిలువలేక పరుగెత్తును. యీపరిపూర్ణమునందు యెరుక కనబడదు జొరపడదు అనేక పరియాయములు పుట్టుచు జచ్చుచు యుండును. యిట్లు బాధపడుచున్న యెరుక బయలును చూచితె పరుగెత్తునుసుమా అని భావము.

౧౪౩ కం॥ వినుము నేననుచు యెరిగే। తనువందున లేకబయలు తానిండినదా। కనుగొనుమది కనుగొని। యీతనువును విడనాడుమింతె తడు వేలనోయీ। యీపనికింక। గడువేలనోయీ। అనుమానముంటె నీ వరయీము శివరాము। లనుదీక్షితులు జేసె నచలా గ్రంథమునంత। తడు వేలనోయీ। యీపనికింక। గడువేలనోయీ॥ ॥౯॥

ఓ శిష్యుడా! నేను జెప్పునది వినుము నేనని తెలుసుకునె శరీరము బట్టబయలు నిందులేకనె ఆబయలు తనకుతానె అంతట నిండియున్నది చూడుము దానినిజూచి యీశరీరమును వదలుము యింతెసుమా? ఆలస్యము జేయకు ఈకార్యమునకు గడువుయెందులకు నీకు యేదైన సందేహముంటె శ్రీ శివరామ దీక్షితులవారి (బృహద్వాసిష్ఠము) అచలగ్రంథమును సంపూర్తిగ చదివి చూడుమని భావము.

౧౪౪ కం॥ దేహాకారముగానిది। యీహంభావంబులేని యఖిలజనులు దా। సోహం సోహంబనినను। మోహము జెందనిది బైలు మొదలెరుగవలెరా। యెరిగినయెరుక। తుదకరుగవలెరా। కోహం కస్త్వంబాని కూతాలుగూసేటి। దేహిదేహములాను తెలియాని యాబైలు। మొదలెరుగవలెరా। యెరిగిన యెరుక। తుదకరుగవలెరా ॥ ॥౧౦॥

ఓ శిష్యుడా ! ఈ పరిపూర్ణము దేహస్వరూపము గానిది నేను అను భావము లేనిది సమస్త మానవులు (దాసోహం) నేను దాసుడను (సోహం) వాడె నేను అని అన్నను భ్రాంతిజెందనిది మొదటనే యిట్టి పరిపూర్ణమును గుర్తెరుగవలయును గుర్తెరిగినటువంటి గుర్తు తుదకు లేకపోవలయును (కోహం) నేనెవరు (కస్త్వం, నీవెవరు అనె మాటలు మాటలాడె దేహి దేహములను గుర్తెరుగని యీ పరిపూర్ణమును మొదటనే తెలుసుకొనుమని భావము.

౧౮౫ కం॥ యేవస్తువు చేతను దా । నావిర్భవ మొందుదేహ మనుతరు వరయన్ । ఆవస్తువె దానికి వి । త్తైవెలయును దాన్నెసాక్షి ద్రిష్టానికనుమీ । యెరుకయిదె । స్పష్టాము వినుమీ । భావించిచూడుమీ బట్టాబయలను భూమి । యావిత్తు చెట్టున్న దరయాదవిత్తూనే । ద్రష్టాని కనుమీ । యెరుకయిదే । స్పష్టాము వినుమీ॥ ॥౧౧॥

ఓ శిష్యుడా ! శరీరమను వృక్షము యేపదార్థముచేత తానుపుట్టునో ఆపదార్థమే శరీరమను వృక్షమునకు బీజమైయుండును. ఆబీజమునే సాక్షి యని ద్రిష్టయని చూడుము యిదె యెరుక నిజముగా ఆలోచించుము పరిపూర్ణ మనెభూమి ఆబీజమును ఆవృక్షమును ఉన్నదని భావించదని భావము.

౧౮౬ కం॥ యేపరిపూర్ణము మేనికి । లోపల వెలినిండియుండు లోపములేకన్ । ఆపరిపూర్ణమె జగతికి । లోపల వెలినుండుదాని లోనెవున్న విరా । పైరెండెవ్వి । లేనివెన్నకురా । యీపరిపూర్ణబోధచే ప్రపంచ శరీర। రూపము లెడబాపుమీపట్లనె దాని । లోనెవున్నవిరా । పై రెండెవ్వి । లేని వెన్నకురా ॥ ॥౧౨॥

ఓ శిష్యుడా ! యే పరిపూర్ణము శరీరమునకు లోపల వెలుపల నిం[illegible] యుండునో ఆపరిపూర్ణమె ప్రపంచమునకు లోపల వెలుపల నిండియుండును (శరీర ప్రపంచములు) రెండు పరిపూర్ణములోనె యున్నవి. యీశరీర ప్రపంచములు లేనివిసుమా వీటిని తలంచకు యీ పరిపూర్ణబోధవలన ప్రపంచశరీర రూపములను వెంటనే వదలుమని భావము

౧౮౭ కం॥ యెరుకనగా యెరిగేటిది । మరుపనగా యెరుక తనను మరచుట మీరెం । డ్నెరుగనిదె బయలివి నీ । వెలిగెరు కనుమరుపునిప్పు డెరుకాచెవిడరా । వీడితె పైమా । టెరిగెదెవ్వడురా । యెరుకె పరిపూర్ణమం చెదిరించి వదిరేవు । పరిపూర్ణమైతె జూపర బయలందున దాన్ని । యెరుకాచె విడరా । వీడితె పైమా । టెరిగెదెవ్వడురా ॥ ॥౧౩॥

ఓ శిష్యుడా! యెరుక యనగా తనను యెరుగునది మరుపు యనగా యెరుక తనుమరచుట యీ రెండింటిని యెరుగనిదె పరిపూర్ణము యీవిషయ మును నీవు తెలుసుకొని యెరుకను మరుపును యెరుకచేత యిప్పుడె వద లుము వదలిన తరువాత పరిపూర్ణమును తెలుసుకునె వాడెవ్వడుయుండడు నాతో యెవరింకు యెరుకె పరిపూర్ణమని వాదించకు యెరుకె పరిపూర్ణమాయె నేని బయలునందు దానిని చూపుమని భావము.

౧౪౭ కం॥ లేదన్నను కనపడుగద। నేదెలిసితిననిక బైటనే నిల్వ గదా। నేవేసవెనుగద నా। కేవో మూలంబు యిదగా దెకలేదెచ్చోటా। కను కనె వుళ్ళ। కీ్కి నేనన్మాటా। యేద లేదిదిదప్ప నే దెలియనిది యాని। తాదెలుసుకొని యెరుకె తనను వీడితెజాలు। యికలేదెచ్చోటా। కనుకనే వుళ్ళ। కీ్కి నేనన్మాటా॥ ॥౧౪౭॥

ఓ శిష్యుడా! పరిపూర్ణము లేదంటివా ప్రత్యక్షముగ కనబడుచున్నది నేను పరిపూర్ణము తెలుసుకొంటినని అంటివా నేను (యెరుక) పరిపూర్ణమున నిలువజాదు నేను (యెరుక) అనునది పరిపూర్ణమునకు పీడవ బుట్టినదిగదా నాకు (యెరుకకు) మూలములేదు పరిపూర్ణముకాదు ఇతరమేమియులేదు కాబట్టి నేను (యెరుక) అనమాట అబద్ధము సుమా నాకు దెలియనిది పరిపూర్ణము దప్ప మరి యేమియులేదు అని తనకుతాను దెలుసుకొని యెరుక తనకుతాను వదలిపోతె చాలునని యెరుగుమని భావము.

౧౪౮ కం॥ సత్యమరు బట్టబయలు న। సత్యంబగు యెరుకనెరిగి సద్గురుకృపచే। సత్యముగాదని యెరుకను। సత్యముగా నమ్మివుంటె చాలు చాలన్నా। వానితోటి। సాటెవ్వరన్నా। నిత్యానిత్యములానె నిర్ణాయ మెరు గాక। నిత్యుడై యుండేటి నిజబోధ గలిగితె। చాలుచాలన్నా। వానితోటి। సాటెవ్వరన్నా॥ ॥౧౪౮॥

ఓ శిష్యుడా! నిజమైన పరిపూర్ణము కల్లయగు యెరుకను సద్గురు మూర్తి కరుణచేత దెలుసుకొని యెరుకను మిథ్యయని నిజముగా నమ్మియుంటె చాలు చాలునాయనా? యిటువంటివానికి సమానమైనవారు యెవరులేరు సత్యా సత్యములనెడి బయలెరుకల నిర్ణయము దెలియక స్థిరుడై యుండునట్టి అచల పరిపూర్ణబోధ బొందితె చాలునని భావము.

౧౫౦ కం॥ పరిపూర్ణములోదోచిన । యెరుకే కల లేనియెరుక నెరిగి మృషని యీ । మరుగెరుక కెరుకదెల్పిన । యెరుగుటయే మేల్కసుమ్మి యిదియేమారకుమీ । సద్గురువాజ్ఞ । కెదిరీమీరకుమీ । యెరుకయీరీతిగ నెగరిపోయినవెనుక । పరిపూర్ణమొకటుండు పలుకరాదెట్లందు । నిదియేమారకుమీ । సద్గురువాజ్ఞ । కెదిరిమీరకుమీ ॥ ॥౧౬॥

ఓ శిష్యుడా! బట్టబయలులో కనబడిన యెరుకే కలసుమా! లేని యెరుకను తెలుసుకొని అసత్యమని యీరహస్యమును యెరుకకు యెరుక యెరుకపరచిన దానిని తెలియడమే మేలుకసుమా యిది మరచిపోకుము గురువాజ్ఞను మితిమీరి యెదిరించకు యెరుక యీలాగున లేచిపోయినపిమ్మట పరిపూర్ణము ఒక్కటియుండును దానిని చెప్పుటకు సాధ్యముకాదని భావము.

౧౫౧ కం॥ తిప్పలగు రాకపోకల । నెప్పుడు తానె పగునట్టి యీబయలందున్ । తప్పక తనకై తానె । తప్పనగనవచ్చి యెరుక తాగానరాదు । బయలున్నాది । తనకెరుకలేదూ । యెప్పుడు బయలున్న దెగిగితాలేనట్టి । చాపూసద్గురుబోధ చాపూనదెలసితె । తాగానరాదూ । బయలున్నాది । తనకెరుకలేదూ ॥ ॥౧౭॥

ఓ శిష్యుడా! పుట్టిగిట్టుటలను అవస్థలు యెప్పుడు దెలియని పరిపూర్ణములో యెరుకతప్పకుండ తనకుతానే హటాత్తుగావచ్చి తనకుతానె కానరాకుండ బోవును పరిపూర్ణమున్నదని తనకు దెలియదు యెల్లప్పుడు పరిపూర్ణమున్నదని తెలుసుకొని తాను లేనిరీతిగనే సద్గురుబోధ పద్ధతిగ తెలుసుకున్న యెడల తనకుతాను కనబడదుసుమా అని భావము.

౧౫౨ కం॥ అన్నము శుక్లంబగు రస । మున్నతిగా రక్తమగును నొకచో రెండున్ । పన్నుగ గలసిన మేనని । యెన్నబడున్ యెరుకగల్గి । యిదెమాయ సుమ్మీ । మూలములేని । దిదె నీవునమ్మీ । యున్నావు పరిపూర్ణమున్నది గని లేని । దెన్నడు లేదని యెరిగీతెచాలు గు । రిదె మాయ సుమ్మీ । మూలములేని । దిదెనీవునమ్మీ ॥ ॥౧౮॥

ఓ శిష్యుడా! అన్నమె శుక్లము నీరురక్తము ఈరెంటి కలయికయె యెరుక గలిగిన శరీరము యిదెమాయసుమ్మీ మూలములేని దీనిని నమ్మియుంటివి పరిపూర్ణ మున్నదని చూచి లేని గుర్తెరిగె శరీరము యెన్నడు లేదని తెలుసుకుంటె చాలునని భావము.

౧౫౩ కం॥ కనకమన భూషణంబులు । యినుమన శస్త్రాదికంబు లిత్తడియనినన్ । గనుగొన పాత్రలు గనుపడు । తనువన నవయవములన్ని తగదొంతియని నా । కుండలు భూత । తతిజగత్తనినా । వినుమట్ల యెరుకన్న వివరించ తత్వాలు । మనుసందు గట్టిగ మరువాకు మీమాట । తగదొంతి యనినా । కుండలు భూత । తతిజగత్తనినా ॥ ॥౧౯॥

ఓ శిష్యుడా ! బంగారమనగా సొమ్ములు ఇనుమనగా కత్తి మొదలగు ఆయుదములు యిత్తడియనగా (బిందెలు చెంబులు) పాత్రలు శరీరమనగా అవయవములు దొంతియనగా కుండలు జగత్తనగా పంచభూతములు యివి యెట్లనో అట్లనే యెరుకయనగా తత్వములు యివి నీమదిలో మరువకుండ నుంచుకొనుమని భావము.

౧౫౪ కం॥ పొర లరటిదుంప యనినను । తరువులు వనమనిన రవలు ధారుణియనినన్ । గిరియనినరాళ్ళు బట్టలు ధరముల్లెయనిన తత్వ తతి యెరు కంచనినా । లేనిదె యెరుక । స్థితిలెస్సకనినా । యెరుకాజేసిన విశ్వ మెరుక వంటిదె బయలు । నెరుకాగు దైరిగి తానేగితెసరి తత్వ । తతియెరు కంచనినా । లేనిదె యెరుక । స్థితిలెస్స కనినా ॥ ॥౨౦॥

ఓ శిష్యుడా ! పొరలకూడిక అరటిదుంప చెట్లచేరిక తోట రవలరాసి నేల రాళ్ళకూటమి కొండ బట్టలసమూహము ముల్లె యెట్లగునో అట్లనే తత్వ తతియే యెరుక యెరుకయొక్క స్థితిని గుర్తించినచో యీ యెరుక లేనిదే యెరుకచేబుట్టిన ప్రపంచము యెరుకవంటిదే కాబట్టి ఆ పరిపూర్ణమును యీ యెరుక గుర్తించి తనకుతానెపోయితెసరి అని భావము.

౧౫౫ కం॥ పెనుమాయను జూడుముయిదె । జనకుని జఠరంబువలన జననీగర్భం । బునజొచ్చి మారురూపున । జనియించును నవయవములు జనితామైభువినీ । విను కను తిను మూ । ర్కొను వచ్చునుచనీ । దిన న మభివృద్ధ్యై దీనిచే బయలును । గని యీమాయల మల్లి కథమాయించుము పోని । జనితామై భువినీ । వినుకనుతిను మూ । ర్కొను వచ్చునుచనీ ॥

ఓ శిష్యుడా ! ఇదుగో మహామాయను చూడుము ఈమాయయే తండ్రి గర్భముననుండి (శుక్లరూపముతో) తల్లిగర్భములో జొచ్చి కాళ్ళు చేతులు మొదలగు అవయవములతో వేరు స్వరూపము (పిండాకారము)ను బొంది

ప్రపంచములో బుట్టును తరువాత (మాటలను) వినుచు (ప్రపంచమును) చూచుచు (పదార్థములను) తినుచు (పరిమళవస్తువును) వాసనచూచుచు (ఒక స్థలమునకు) వచ్చుచు (మరియొక స్థలమునకు) పోవుచు యీరీతిగ దినదినాభి వృద్ధినొందును. ఈ పెనుమాయచేత పరిపూర్ణమును చూచి ఈ మాయలమల్లి కథలను విడువుమని భావము.

౧౨౮ కం॥ పెట్టియలోపలి గారడి । చెట్టుపయిన్ గానవచ్చి చెట్టున జూడన్ । గట్టుపయిదోచు నిది కన । కట్టుసుమీ దీనివలనే గనుపించునెరుకా। అంతలో యెచట । గనుపించదెరుకా । దిట్టామౌ బోధాచే పట్టీ యెరుకనుతిరిగి। పుట్టాకుండగ దాని పుట్టీముంచుము లేందే । కనుపించునెరుకా । అంతలో యెచట । గనిపించదెరుకా ॥ ॥౨౨॥

ఓ శిష్యుడా! బుట్టలో కనపడె గారడిని చెట్టుమీద చూచెదము. చెట్టు మీద కనపడె గారడిని చూడగా గట్టుమీద కనపడును యిదియంత మాయ సుమా? యీరీతిగనె కనపడెడు యెరుక అంతలోనె యెచ్చట జూచినను కనపడదు కాబట్టి ఘనమైన అచలబోధను గైకొని యెరుక మరల బుట్టకుండ దానిని మొదలార్చుమని భావము.

౧౩౨ కం॥ నేననని బ్రహ్మలోపల । లేనిదె సంభవమునొంది లీల తనకుదా । మేనుజగములై వెలసెను । నేనది మృగజలమురీతి నిజముగా దనుచూ । లోకులనేటి । గజిబిజివినుచూ । మానాసమునవారి మాటకామో దించి । దానికీబోధాకు తగునంచు వినజేస్తి । నిజముగాదనుచూ । లోకులనేటి। గజిబిజివినుచూ ॥ ॥౨౩॥

ఓ శిష్యుడా! నేను అను అహంభావములేని పరిపూర్ణము లోపల లేనట్టి యెరుక జననమై ఆటపాటలుగా తనకుతానె శరీర జగత్తులై యుండెను నేనుఅను ఆయెరుక యెండమావుల వంటిదే సత్యమైనదకాదు. అని మానవు లనె చికాకుమాటలు విని మనస్సులో వారిమాటలకు సంతోషించి అందుకు యీబోధ తగునని తెలియజెప్పితినని భావము.

౧౩౪ కం॥ కేనెడబాసిన మనుజులు । కలలోపలి పనులుజేయ కలవారననా । కలవారుగారు వారల । వలెయెరుకను గురునిచేత వదలెరుక లోనా । గలపనిజేయ । వలదెరుకలోనా । కలవారంచనినోట పలుకూటమర

యాక । పలికిన వారికి తొలగాదు పాపాము । వదలెరుకలోనా । గలపని జేయ । వలదెరుకలోనా ॥ ॥౨౪॥

ఓ శిష్యుడా ! స్వప్నమునుండి మేలుకొన్న మానవులు స్వప్నము లోపల ప్రయోజనములు జేసినను వారు ప్రయోజకులు గారు వారివలె సద్గురుని మూలమున యెరుకను వదలుము యేప్రయోజనములు జేయకు యెరుక లోనున్నవారు అనుమాటలు అనకుండ యుండుము అట్లన్న వారికి పాపము లెప్పుడు తొలగవని భావము.

౧౫౯ కం॥ గుడమేమధురము మధురమె । గుడ మాగుడ మధురము గొనకొని తొలుతన్ । బొడమినదేదన సరిగా । బొడమిం దొకటేగ రెండు పోయి నట్టెకదరా । తనువెరుకాలి । ల్లైనట్టెకదరా । పొడజూచి బయలు నిప్పుడెమేనెరుకలజోలి । విడరా లేనివెరెండు పెడచౌబెట్టక విను । పోయినట్టె కదరా । తనువెరుక । లి ల్లైనట్టెకదరా ॥ ॥౨౫॥

ఓ శిష్యుడా ! బెల్లమునుతీపి తీపినిబెల్లము ఒకేతీరున గ్రహించును బెల్లముతీపి అని రెండు విధములుగానున్న వీటిలో నొకటి పోయెనేని రెండును పోవును ఈరీతిగా శరీరము యెరుక అనునవి కలిగినవి పరిపూర్ణమును చూచి శరిర మెరుకలను ఇప్పుడే వదలుము ఈరెండును లేనివని చెవియొగ్గి (నేజెప్పునది) వినుమని భావము.

౧౬౦ కం॥ ఇదివున్నది యిదివున్నది । యిదివున్నది యనుచు బయలు నెరిగి యెరుకచే । యిదిలేనిది యిదిలేనిది । యిదిలేనిది యనుచు నెరుక నెరిగితె సరిరా । ఆపైనుండె । దెట్లుందువినరా । వుదయాస్త మానాము లుడుగాక యిది నీనె । మ్మదిలోన నమ్మునామాట నిశ్చయమిట్లు । యెరిగితె సరిరా । ఆపైనుండె । దెట్లుందువినరా ॥ ॥౨౬॥

ఓ శిష్యుడా ! ఇదివున్నది ఇదివున్నది ఇదివున్నది అని పరిపూర్ణమును ముమ్మాటికి తెలుసుకొని యెరుకచేత నిదిలేనిది ఇదిలేనిది ఇదిలేనిది అని ముమ్మాటికి యెరుకను తెలుసుకుంటె చాలు ఆతరువాత నున్నట్టి పరిపూర్ణ మును ఇట్టిదట్టిదని చెప్పుటకు వశముగాదు తెల్లవారినది మొదలుకొని పొద్దు గూకువరకు నేనుచెప్పినదానిని విడువక నీమనస్సులో నమ్ముకొని యుండుము నామాట నిశ్చయమని భావము.

**ఇతి, శ్రీమద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే పరిపూర్ణబోధన్నామ అష్టమోధ్యాయః.**

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
**వ్రాయబడిన భావార్థ సహితములు**
(ప రి పూ ర్ణ బో ధ ) అను
**ఎనిమిదవ అధ్యాయము.**

—(౦)—

## —: ౯. గురుమంత్ర ప్రతాపం ౨౭. :—

౧౬౧ కం॥ **యెరుగననేటిది** యెరుకే। యెరుగుదునని తనను పరుల నెరిగేదెరుకే। యెరుగ నెరుంగుదునను దా। న్నెరుగుచు నుండేటి దెరుకే నిరుపామబుద్ధీ। నీవెరుగిది నిగమప్రసిద్ధీ। గురుమంత్రమనియేటి గృద్దాలి తోటి యీ। యెరుకా కూకుడువేరు నెరిగిత్రివ్వితెచాలు। నిరుపామబుద్ధీ। నీవెరుగిది। నిగమప్రసిద్ధీ॥ ॥౧॥

**ఓఉపమాన రహితమైన బుద్ధిగలవాడా!** యెరుగుదును తన నితరులను యెరుగుదు నదియును యెరుగను యెరుగుందును అనేదానిని గుర్తించెటిది యెరుకయేసుమా? ఈయెరుక వేదములయందు ప్రఖ్యాతిజెందినదని నీవు తెలుసుకొనుము గురుమంత్రమనెటువంటి కరుగోలతో యీ యెరుకయొక్క మొదటివేరు తెలుసుకొని త్రవ్వితివా చాలునని భావము.

౧౬౨ కం॥ **యెరుకే** చదువులజేసును। యెరుకేవిను చదువునెరుక నెరుకేతిరమం। చెరిగించును శంకించును। యెరుకే కొనకేమిలేక యేగూనో యన్నా। బయులేచదువు। యెరుగాదోయన్నా। యెరుకే యెన్నటికైన పరి పూర్ణ మున్నాదం। చెరిగీతాలేనాని యెరిగితె నిలువాక। యేగునోయన్నా। బయలేచదువు। యెరుగాదోయన్నా॥ ॥౨॥

ఓ నాయనా! సమస్త విద్యలను కల్పించినది యెరుకయే (అశాస్త్రము లను) యీ యెరుకయే వినును చదువును స్థిరమైనది యెరుకయని దెల్పును సందేహించును కొనకు యేమిలేకుండ బోవునది యెరుకయే పరిపూర్ణము యేవిద్యలనుగూడ తెలుసుకొనదు యెన్నడైన యీ యెరుకయె పరిపూర్ణ మున్నదని తెలుసుకొని తనకుతానె లేనని గుర్తించి నిలువకుండ బోవునని భావము.

౧౬౩ కం॥ చూపులలోగల వస్తువు । చూపులగను వస్తువులును చూపులుగూడన్ । తేపకుయెరుకని తెలియుము చూపులు । లేనట్టి బయలు చూచెదింకేమీ । యెరుకేలేదు । తోచెదింకేమీ । దీపామువలె కనుపాపాలో గలవస్తు । వేపరమాత్మాని చూపితే యెరుకాయె । చూచెదింకేమీ । యెరుకే లేదు । తోచెదింకేమీ॥ ॥౩॥

ఓ శిష్యుడా! చూపులలో నుండెటిపదార్థము చూపులచేత చూచు పదా ర్థములు చూపులు కలయుటె యెరుకయని యెరుంగుము. చూపులులేని పరిపూ ర్ణము దేనిని చూడజాలదు అందులో యెరుకలేదు దానిని వర్ణించి చెప్పుటకు తోచదు కంటిపాపలోగల జ్యోతియను పదార్థమే పరమాత్మని చూపించితె యెరుక ఆయెనని భావము

౧౬౪ కం॥ శతపత్రాప్తుని పొడగని । యతిరయమున తిమిరమణగి యగుపడదెట్లు । ట్లతులిత గురుకృపగలిగిన । మతిమంతుల జూచియెరుక మరినిల్వబోదూ । సంశయమునీ । మదినిల్పరాదూ । శృతులందు స్మృతు లందు యితిహాసములయందు । సతతాము శ్రమపడి వెతకిన యీ యెరుక। మరినిల్వబోదూ । సంశయమునీ । మదినిల్పరాదూ ॥ ॥౪॥

ఓ శిష్యుడా! కటికచీకటి సూర్యుని చూచిన వెంటనే యెట్లు పరుగెత్తు కొని పోవునో అట్లే అతులితమగు గురుకటాక్షమును పొందిన గుణవంతులను చూచి యెరుక నిలువదు నీమనస్సులో సందేహించకు వేదములు శాస్త్రములు ఇతిహాసములు అను వీటియందు నీవెల్లప్పుడు శ్రమజేసి చూచినను ఈయెరుక నిల్వదని తెలుసుకొనుమని భావము.

౧౬౫ కం॥ ఎరుకేకోశములై దెరు । గెరుకే భూతముల నెరుగు నెరు గును సర్వం । బెరుకే యెరుక నెరుంగును । యెరుకను గుర్తెరుగవేరె యెరుకా వున్నాదా । వున్నాదంటె । నరకామెకాదా । నిరతాము గురుసేవ పరతంత్రు

లగుచు త । త్కరుణాకు పాత్రులై యెరుకమాలినవారి । కెరుకా వున్నాదా । వున్నాదంటె । కరకామెకాదా॥ ॥౫॥

ఓ శిష్యుడా ! అయిదు కోశములు అయిదు భూతములను సర్వప్రపంచమును తెలుసుకొనునది యెరుకే యెరుకయనునదే యెరుకను గుర్తించును యెరుకను గుర్తెరుగుటకు వేరెయెరుక లేదు ఉన్నాదంటె పాపము గురుసేవ పరులై యెల్లప్పుడు ఆగురుకటాక్షమునకు పాత్రులై యెరుక వదలినవారికి యెరుకలేదని తెలుసుకొనుమని భావము.

౧౬౬ కం॥ గురుమంత్రముచే నిలువని । యెరుకను పరిపూర్ణమనుచు నెరిగి నిరతమున్ । యెరుకై యుండినవారల । తెరువిక నీకేల వట్టి దీజోలీ మానూ । యెరుకలేని । యాజోలిబూనూ । గురునీచె పరిపూర్ణ మరసి యీ తెలిసిన । యెరుక నెన్నటికినీ వెరువాకు మిదివట్టి । దీజోలిమానూ । యెరుక లేని యాజోలిబూనూ ॥ ॥౬॥

ఓ శిష్యుడా ! గురుమంత్ర ప్రభావముచే నిలువకుండ పోవు యెరుకను పరిపూర్ణమని తెలుసుకొని యెల్లప్పుడు యెరుక అయ్యేవుండె వారితో నీవు విశ్వాసము జేయుకుము ఇది అబద్దము వారిమాట యెత్తకుము యెరుకలేని అచలమార్గమును బట్టుకొనుము గురుముఖముచే పరిపూర్ణమునుజూచి యీ తెలిసిన యెరుకను యెల్లప్పుడు విడువుమని భావము.

౧౬౭ కం॥ లేనికల దోచినప్పుడు । లేనివిచిత్రంబులన్ని లేకనె। తోచున్ । లేనికల మేలుకొన్నను । లేనివిచిత్రములు తాను లేకాపోవునురా అనుమానము । లేదింద వినరా । లేనెరుక యీరీతిగానె బయలునుజూస్తె । తానుతన చిత్రములు పూనెందు నిలచుండ । లేకాపోవునురా । అనుమాకాము । లేదిందు వినరా॥ ॥౭॥

ఓ శిష్యుడా ! లేనికల కనపడినపుడు లేని చిత్రవిచిత్రములన్ని లేనివె కనబడును లేని కలనుండి మేలుకజెందినపుడు లేని చిత్రవిచిత్రములు లేని కల లేకపోవును యిందులో సందేహములేదు వినుము యీప్రకారముగానె లేనియెరుక పరిపూర్ణమును చూచితె తాను తన చిత్రవిచిత్రములు యెక్కడ నిలువకుండ పోవునని భావము.

౧౬౮ కం॥ మరణసుషుప్తుల జెందిన । పురుషుడు మేల్కొనినవాడు భువితదితరుడో । పురుషుకు కలగనువాడని । యెరిగుండుము మొదటియత డెరుగాడీ రెంట్ని । రెండోపురుష । డెరుగునీరెంట్ని । యిరువురొక్కటె సుమ్మి తిరిగిపుడుదురు వీరె । గురునీచెమేల్కొంటె తిరిగీ పుట్టనెపుట్ట । డెరుగాడిరెంట్ని । రెండోపురుష । డెరుగూనీ రెంట్ని ॥

ఓ శిష్యుడా! మరణసుషుప్తుల బొందినవాడు మేలుకొన్న వాడనియు తదితరుడు కలగనువాడనియు తెలుసుకొనుము ఇందు మొదటివాడు కల మేలుకలను తెలుసుకొనడు రెండవవాడు తెలుసుకొనును యీయిరువురును సమానులే వీరికి పునర్జనన మరణాదులు గలుగుచుండును సద్గురు కరుణచే మేలుక జెందినవాడు మరల బుట్టుక దేనిని యెరుగడని భావము.

౧౬౯ కం॥ యెరుకే యెరుకకు కొడుకులు । యెరుకే తలిదండ్రి యెరుకకెరుకే యితరుల్ । యెరుకే యెరుకకు మూలము । యెరుకకు మూలంబు బయలం చెట్లందునో యీ । యెరుకే యెరుక । కేమిలేదోయీ । యెరుకలేని వృత్తపరిపూర్ణమును జూచి । యెరుకె తాలేనాని । యెరిగిపోయితె పై । మా టెట్లందు నోయీ । యెరుకే యెరుక కేమీ లేదోయీ॥ ॥౯॥

ఓ శిష్యుడా! యెరుకకు కొడుకులు తల్లిదండ్రులు తదితర బంధు వర్గము యెరుకయే యెరుకకు మూలము యెరుకే మూలము గాని పరిపూర్ణము యెరుకకు మూలమని యెట్లు చెప్పుదును యీ యెరుకే యెరుకకు యేమిలేనిది యెరుకలేని వృత్తబయలును చూచి యెరుక తనకుతానె లేనని పోవునని భావము.

౧౭౦ కం॥ గురుతను కలలో నారీ । నరులూరికె వచ్చిపొంది నయముగ సుతులన్ । వరకన్నియలను గాంచియు । గురువరుచే మేలుకొంటె గురుతుండదన్నా । ఆపైమాట । నెరిగేదేదన్నా । యెరుకొక్కటుంటె నే యేర్పాటు లుండును । యెరుకొక్కటేగితె యేర్పాడుజేసేటి । గురుతుండ దన్నా । ఆపైమాట । నెరిగెదేదన్నా॥ ॥౧౦॥

ఓ శిష్యుడా! గురుతుయనె స్వప్నములో స్త్రీ పురుషులు వచ్చి సుఖించి కొడుకులను బిడ్డలను కని తరువాత సద్గురునిచే మేలుక బొందితె

అగురుతుయనే కలయుండదు ఆమేలుక యొక్కమాట యేమనిజెప్పుదు ఒక్క యెరుక యుంటెనే అన్నియేర్పాటులుండును ఒక్క యెరుక లేకపోతె యేర్పాటు చేయునట్టి గురుతు యను కల యుండదని భావము.

౧౭౧ కం॥ నినునను నివుకలగాంతువు। నినునను కలలోనగాంతునే నొకవేళ్ళన్। నినునను నివునేననునిను। కనుగొనగా గలమె మేలుకనినా మీదటనూ। గురుబోధట్ల। వినినామీదటనూ। మునువుగలిగిన యెరుక మొదటికె నిలువదు। నినునన్ను నే నన్ను నినునీవెరుగుటమెట్లు। కనినామీదటనూ। గురుబోధట్ల। వినినామీదటనూ॥ ॥౧౧॥

ఓ శిష్యుడా! నిన్ను నన్నును ఒకప్పుడు నీవె కలలో జూతువు ఒకప్పుడు నేనుగూడ కలలోపలనె నిన్నును నన్నును చూతును నిన్నును నన్నును నీవు నేనును నిన్ను మేలుకొన్నతరువాత చూడలేము అట్లే గురుబోధవినిన పిమ్మట మునుపుయున్న యెరుక యెంతమాత్రము నిలువదు నిన్ను నన్ను నేననన్ను నిన్ను నీవు తెలుసుకొన జాలమని భావము.

౧౭౨ కం॥ నినునీవు నన్ను నేనును। ననునివు నేనిన్నుయెరిగి నదెకల యిదితా। తననెరుగని దానినిగని। తనకలిమి మృషనుచు దెలిసి తానేగెనేనీ। అదిమేల్క వలె। దాన్నెవ్వా డెరిగినీ। ననునీవు నేనిన్ను బోధ వినిపించు వినుమాని। యనుటా కిద్దరికిపుడు మునువున్న యెరుకేది। తానేగెనేనీ। అటమేల్కవలె। దాన్నెవ్వడెరిగినీ॥ ॥౧౨॥

ఓ శిష్యుడా! నిన్ను నీవు నన్ను నేను నన్ను నీవు నేను నిన్ను తెలుసుకొన్న యిదె కల తననుతాను తెలుసుకొనని పరిపూర్ణమును చూచి తన స్థితి అబద్ధమనుచు గుర్తెరిగి పోయెనేని అదియే మేలుక తదుపరి ఆ పరిపూర్ణమును యెవడు తెలుసుకొనలేడు నన్ను నీవు బోధ వినుపించుమనియు నిన్ను నేను బోధవినుమనియు అనుటచేత నిపుడు మనయిద్దరికి పూర్వమున్న యెరుకలేదని భావము.

౧౭౩ కం॥ తిమిరారియందు లేనిదె। తిమిరము తనుదానెవచ్చి తేజోనిధియౌ। తిమిరారియునికి గనుగొని। తిమిరము తానిలువనట్లు తెలుసుకోరాదా। బయలెరుకాల। తెలిసి యామీదా। భ్రమరూపమైనట్టి బ్రహ్మాండ మెరుకాల। భ్రమదీసివేసితె భ్రాంతిబుట్టదుమళ్ళి। తెలుసుకోరాదా। బయలెరుకాల। తెలిసీయామీదా॥ ॥౧౩॥

ఓ శిష్యుడా! సూర్యునియందు లేనిచీకటి తనంతటతానె వచ్చి ప్రకాశించును. ఆచీకటి సూర్యుని చూడగనె నిలువకుండ బోవునని తెలుసు కొనుము పరిపూర్ణము యెరుక అను రెండింటిని తెలుసుకొని అటుపిమ్మట భ్రాంతి రూపకమైన బ్రహ్మాండ మెరుకలయందుగల భ్రాంతిని వదలితె తిరిగి భ్రమగలుగదని తెలుసుకొనుమని భావము.

౧౨౪ కం॥ లేదులేదనుచు యెందరు। వాదించిన లేకపోదు పరిపూర్ణముదా। పోదుపోదనుచు నిల్చిన। పోదని యనుకోకు యెరుక పోనెపోచుందీ। గట్టిగలేచి। పోనెపోచుందీ। వాదభేదములేనివారిచె యెరుకాది। పాదూపెకలించేటి పద్ధాతినెరిగితె। పోనెపోచుందీ। గట్టిగలేచి। పోనె పోచుందీ॥ ॥౧౨౪॥

ఓ శిష్యుడా! పరిపూర్ణమును యెందరు లేదులేదని వాదోపవాదములు జేసిన ఆ పరిపూర్ణము స్థిరముగానుండును యెరుకను పోదుపోదని పట్టుకున్నను పోయేతీరును పోదని యెప్పుడు అనుకోకు వాదములలో భేదము లేని వారి (సద్గురుమూర్తి)చే యెరుకయొక్క పునాదిని త్రివ్వేమార్గమును తెలుసుకుంటె తొలగిపోవునని ధృఢముగా నమ్ముమని భావము.

౧౨౫ కం॥ మే నెరుకల రెట్లో నొక। దానిని యెడబాసిచేయు తరమా పనులన్। మేనికి యెరుకకు గావున। మేనన యెరుకెరుక యనిన। మేనాని యెరుగూ। యీరెంట్ని నివు। నేనాని యెరుగూ। యెరిగివీట్లతో బయలునెరిగీ మేనెరుకాల। తిరిగిచూడకు చూస్తె గురుని పాదములాన। మేనాని యెరుగూ। యీరెంట్ని నివు। నేనాని యెరుగూ॥ ॥౧౨౫॥

ఓ శిష్యుడా! శరీరము యెరుక అను రెండింటిలో నొకదానినొకటి వదలి యేపనిని చేయజాలవు శరీరమనినను యెరుకకు యెరుక యనినను శరీరమని తెలుసుకొనుము ఈరెండింటిని నీవని నేనని తెలుసుకొని తరువాత ఈశరీరమెరుకలతో పరిపూర్ణమును గుర్తించి యీ రెండింటిని మళ్ళి చూడకుము చూచితివా నీగురువు పాదములతోడె అని భావము.

౧౨౬ కం॥ మరుపు సుషుప్తియు మూర్ఛయు। మరణంబు సమాధి యనుచు మానవులెరుకన్। దొరికిన నొరుగు శరీరము। నెరిగెదరా నరుడు మేనునెరుగా ఢోయన్నా। తననైనతా। నెరుగ ఢోయన్నా। యెరుగాకుండితె

నేమి తిరిగి పుట్టుచునుండు । తిరిగి పుట్టడువాడె గురుబోధ గలిగీతె ।
యెరుగడో యన్నా । తననైన తా । నెరుగాడోయన్నా ॥ ॥౧౬॥

ఓ శిష్యుడా! మరుపు సుషుప్తియు మూర్ఛ మరణము సమాధి అనుచుయుండె మనుష్యులు యెరుకయందు పడియున్న యితర శరీరములను తన శరీరమును తనను తానును తెలుసుకొనడు అట్లు తెలుసుకొనక పోయి నను పునర్జన్మము తప్పదు సద్గురు ఉపదేశమును పొందితె వారికి తిరిగి జన్మము లేదని భావము.

౧౭౭ కం॥ పరిపూర్ణ మెరుకలివియని । యెరుగని బయలందు లేని యెరుక తనకుదా । నరుదెంచిట గురుశిష్యుల । తెరగున మాట్లాడి రెంటిన్ని దెలసీతా జనునూ । ఆపైమాట । పలికెదేదికనూ । అరమారలేక నే నెరిగించి నట్టి యీ । గురుబోధ పాత్రూల నెరుగాక తెలిపేవు । తెలిసీతాజనునూ । ఆపైమాట । పలికెదేదికనూ ॥ ॥౧౭॥

ఓ శిష్యుడా! పరిపూర్ణమిది యెరుకయిది అనునది తెలియని బట్ట బయలులో లేనియెరుక తనంతటతాను ప్రవేశించి గురుశిష్యులమారిరిగ వాదోప వాదములను జేసుకొన్ని పరిపూర్ణమును యెరుకను యీ రెండింటిని గుర్తించి తనకు తానె పోవును తరువాత ఆ పరిపూర్ణమును చెప్పునది యేదిలేదు సందే హములేక నేనుబోధించిన ఈఅచలబోధను పొందుటకు అధికారము లేని వారికి బోధించకని భావము.

౧౭౮ కం॥ మరుపు సుషుప్తి మరణముల్ । పరిపూర్ణంబునకు సాటి పరచి యెరుకకున్ । మరియాది మేల్కొ పుట్టువు । నిరుతెరగుల నెరిగియెరుక। నెగరా జిమ్మొయీ । ఆపైనుండె । దెరిగెదెట్లోయీ । గురుమంత్ర మిదెసుమ్మి మరువాక యేప్రొద్దు స్మరణజేసితివేని । తిరిగిపుట్టవు నీవి । ౖనెగరజిమ్మొయీ। ఆపైనుండె । దెరిగె దెట్లోయీ ॥ ॥౧౮॥

ఓ శిష్యుడా! పరిపూర్ణమునకు మరుపు సుషుప్తి మరణము అనువాటిని యెరుకకు యాది మేలుక పుట్టుట అనువాటిని సాటిపరచి ఈరెండు విధము లను గుర్తించి యెరుకను యెగరగొట్టుము ఆమీదనున్న పరిపూర్ణమును యెరుగజాలము. ఇదిగో ఇదే సద్గురుమంత్రము ఈమంత్రమును సర్వకాల ములయందు విడువక స్మరియించితివా నీకు మళ్ళి జన్మములేదని భావము.

౧౨౯ కం॥ క్షితిలోననరుడు పక్వా । న్నతతిని ఉని కక్కి మరల నాపనె యతిసం । సృతివిడిచి తిరిగిపూనునె । వితరణ శాలిచ్చినట్టి విత్తా మడిగినే । సత్యవాది । సత్యాముడిగినే । ప్రతిలేని గురుబోధ స్థితి జెంది యెరుకాని । గతి సంగ్రహించాడు కృతకృత్యుడిచ్చిన । విత్తామడిగినే । సత్యవాది । సత్యాముడిగినే ॥ ॥౧౯॥

ఓ శిష్యుడా! ప్రపంచములో మనుష్యుడు పక్వాన్నముదిని వాంతి చేసుకొని దానిని తినడుగదా యతీశ్వరుడు సంసారమును త్యజించి తిరిగి ఆసంసారమును బట్టికొనడు ధర్మాత్ముడు దత్తద్రవ్యమును తిరిగి తీసుకొనడు సత్యముబలుకువాడు సత్యమును విడువడు అట్లనే సాటిలేని పరిపూర్ణ బోధయొక్క పద్ధతిని దెలుసుకొని తరువాత ఇతరమైన పద్ధతిని గ్రహించడు కృతార్థుడైనవాడు అని భావము.

౧౩౦ కం॥ మరుపన తొలిమేనులు మూ । డె రుకన నాలవశరీర మీరెండొకటే । పరిపూర్ణ మవలి దీవలి । యెరుకను గురువాక్కుచేత యెగరాజిమ్మిననూ । పోవును లేని । దెరిగెదేగిననూ । యెరిగేదెలేకుండు యేమొ ఆవలిజాడ । నెరిగెవా రెవరింక యింతెచాలెరుకాను । యెగరాజిమ్మిననూ । పోవునులేని । దెరిగేదేగిననూ ॥ ॥౨౦॥

ఓ శిష్యుడా! స్థూలసూక్ష్మ కారణశరీరములను యీ మూడును మరుపు మహాకారణమను నాలుగవ శరీరము యెరుక యీ మరుపెరుకలు రెండును ఒకటే మరుపెరుకలకు రెండింటికి ఆవలిది పరిపూర్ణము కాబట్టి సద్గురుని బోధచే ఈవలియెరుకను యెగరగొట్టితివేని లేనిది తనకు తానే పోవును తెలుసుకునేది లేకుండపోయితె యెరుక లేకుండ పోవును పిదప అవ్వలనుండు పరిపూర్ణము యొక్కస్థితిని తెలుసుకునె వారెవ్వరు లేరని భావము.

౧౩౧ కం॥ నానావిధావ యవములు । నానావిధ నామరూప నటనలు మాయల్ । నానావిధాల వూహలు । నేనను యెరుకందె యిన్ని । నిబిడామై యుండూ । బయలును గనతా । నిలువలేకుండూ । నేనుమేనీరెండు నేనె నేలేకుంటె । మేనూలేదిది లేక నేనిచ్చెదెట్లిన్ని । నిబిడామైయుండూ । బయలును గనతా । నిలువాలేకుండూ ॥ ॥౨౧॥

ఓ శిష్యుడా! వివిధములగు అవయవములు పేర్లు రూపములు ఆటలు మాయలు ఊహాలు మొదలైనవియు నేను అనునది యెరుకయందె సందు లేకుండ నిండియున్నవి ఇట్టియెరుక పరిపూర్ణమును చూచిన నిలువజాలదు నేను మేను అను యీరెండు నేనె నేనులేకుంటె శరీరములేదు శరీరములేకుంటె నేను నిలువదని గుర్తించుమని భావము.

౧౮౨ కం॥ జగమువలన సంకల్పము । జగమా సంకల్పమునను జనియించును వే । రగుపడదు జన్మమందిర । మగుపడదెడ బాసినిల్వ వారెండెన్నటికీ । బయలును గనినీ । వీరెండెన్నటికీ । యిక దల్చబోకూము యివిబుట్టుటుళ్ళకి । మృగజలమగు పడ్డమిధ్యం చెరిగినమాదిక్కి । యారెం డెన్నటికీ । బయలును గని నీవీ । రెండెన్నటికీ ॥ ॥౨౨॥

ఓ శిష్యుడా! ప్రపంచము సంకల్పము అను యీరెండు ఒకదాని వలన నొకటి కలుగుచున్నది. ఈరెంటికి వేరె జన్మస్థానములేదు ఒకదాని నొకటివిడచి యీరెండు యెప్పుడును యుండవు పరిపూర్ణమునుచూచి నిలువని యీరెండింటిని యెండమావులవలె మిధ్యయని తెలుసుకొని వీటిని తలంచకుము యివి పుట్టుట అబద్ధమని భావము.

౧౮౩ కం॥ పరిపూర్ణమనెటి పత్కి । యెరుకను బల్పాక్షరముల కెచ్చటగననన్ । తిరమైయున్నది కనుగొని । యెరుకను బల్పాక్షరముల నికగట్టిపెట్టూ । యెవరికి దెలియ దిది మూలగుట్టూ । గురుమూర్తి కరుణాచె యెరిగితెల్పితినేని । పరిపూర్ణబోధాను పరులు జెప్పినబోధ । నిక గట్టిపెట్టూ । యెవరికి దెలియ । దిదమూలగుట్టూ॥ ॥౨౩॥

ఓ శిష్యుడా! యెరుకయనెడు బలపముచే వ్రాయబడిన అక్షరములకు యెచ్చటజూచిన పరిపూర్ణమను పలుకయే స్థిరముగా నున్నది దానిని కను గొని యెరుకయనె బలపపు అక్షరములను మలిపివేయుము ఈరహస్యము యెవరికి తెలియదు గురుమూర్తి కరుణచే నేను తెలుసుకొని ఈపరిపూర్ణ బోధను నీకు తెలిపితిని యితరులబోధను వినకుమని భావము

౧౮౪ కం॥ చూపించ జూపరానిది । చూపించితి దాన్ని వుండ జూచినవుగదా । చూపించ జూచెనిది దీ । న్నేప్రొద్దిక దల్చబోకు మిదె గురుబోధా । నిన్నంటూము । నితరామెబాధా । నాపాప నాకూన నాచిన్ని

నాయన్న । నాపెన్నిధానామ నారత్నములకొండ । యిదె గురుబోధా ।
నిన్నంటాదు । నితరమే బాధా ॥ ॥౨౪॥

ఓ శిష్యుడా ! ప్రత్యక్షముగా జూపించుటకు చూపరానట్టి పరిపూర్ణ మును చూపించినాను ఆ పరిపూర్ణమును ఉన్నట్లు చూచితివిగదా నేను! చూపిం చగ యీయెరుక చూచెను దీనిని (యెరుకను) యెప్పుడు స్మరించకు ఇది అచలబోధ నాపాప నాకూన నాచిన్ని నాయనా నాపెన్నిధె నారత్నముల కొండ యీఅచలబోధ విన్నమీదట నిన్ను యితరమైన బాధలేవి యంటవని భావము.

౧౮౫ కం॥ నామము రూపము నటన । స్తోమము బయలందు లేదు చూడుము నీవా । నామమురూపము నటన । స్తోమము యెరుకందుగలదు చూడూమి నిజమూ । బయలెరుకాల । చూచిచూడకుమూ । వేమారు నేనెంత వినజెప్పినాగాని । యీమార్గమెదప్ప యికలేదు రెండోది । చూడూమినిజమూ। బయలెరుకాల । చూచి చూడకుమూ ॥ ॥౨౫॥

ఓ శిష్యుడా ! పరిపూర్ణమునందు లేని నామరూప క్రియాకలాపములు యెరుకయందుగలవని తెలుసుకొనుము ఇవి సత్యము పరిపూర్ణమును చూచి యెరుకను చూడకుము నే నెన్ని పర్యాయములు జెప్పిన యీ అచలబోధ మార్గముదప్ప వేరె మార్గములేదని భావము.

౧౮౬ కం॥ గురుడు గురుబోధ శిష్యుని । కెరిగించెటి వేళ్ళ శిష్యు డెరిగేటి వేళ్ళన్ । యిరువురు వైశ్వానర క । ర్పూరములవలె వెలిగియవల । పొడజూపరోయీ । అట్లనె నీ వి । క్కడ దెలియుమోయీ । పరిపూర్ణ మెరు కాలనెరిగి యా మీదట । యెరుకాను విడచూచె గురుబోధం చెరుగూము। పొడజూపరోయీ । అట్లనె నీవి । క్కడ దెలియుమోయీ ॥ ॥౨౬॥

ఓ శిష్యుడా ! గురువు శిష్యునికి అచలబోధను ఉపదేశించు సమయము నందు శిష్యుడు ఉపదేశమునొందు సమయమునందు అగ్ని కర్పూరములవలె ప్రకాశించి తరువాత కనపడరు. అట్లనే నీవు యీస్థానమందని తెలుసుకొ నుము పరిపూర్ణమును యెరుకను తెలుసుకొన్న పిదప యెరుకను వదలుటయే గురు ఉపదేశమని తెలియుమని భావము.

౧౮౭ కం॥ సతికౌంగిట తత్పతి త । త్పతికౌంగిట సతియుజేరి పవళించిరిలన్ । మృతిజెంది మేలుకని సు । స్థితులై యొకరొకరి కట్టి చేష్టా దెల్పుదురా । సిగ్గెడలి యా । చేష్టా నిల్పుదురా । ప్రితిలేని గురుబోధ స్థితి జెంద్యట్లనె సం । తతితిరిగి లేనెరుక గతియిట్టిదని దాని । చేష్టాదెల్పుదురా । సిగ్గెడలి యా । చేష్టానిల్పుదురా ॥ ॥౧౭॥

ఓ శిష్యుడా! ఆలుమగలిద్దరు ఒకరినొకరు కౌగలించుకొని భార్య మరణించినట్లు భర్తయును భర్త మరణించినట్లు భార్యయును కలగందురు మేలుకొన్న పిమ్మట వారాపనులను మానుకొనరు సిగ్గువిడచి యితరులకు దెల్పరు ఆ విధముగానే సాటిలేని అచలగురుబోధయొక్క స్థితిని పొందినవాడు యెప్పుడు లేని యెరుకను యిట్టిదట్టిదని తిరిగి చెప్పడని భావము.

ఇతి శ్రీమద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే గురుమంత్రి ప్రతాపంన్నామ నవమోధ్యాయః.

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే

వ్రాయబడిన భావార్థ సహితములు

(గురుమంత్రి ప్రతాపం) అను

తొమ్మిదవ అధ్యాయము.

—(౦)—

## —: ౧౦. బోధ దృఢీకరణం ను. :—

౧౮౮ కం॥ రానిది పోనిది బయలని । లేనిది యీయెరుక యనుచు లెస్సగ దృఢమౌ । దానుక నీవీమంత్రము । మానక జపి యింపుచుండు మానీతిశాలీ । లేనిదిలేదు । మరుపకికిజోలి । లేనిది లేదానిపూని నిశ్చయమైతె । తానొక్కటుండునుగాని యెట్లన విను । మానీతిశాలీ । లేనిదిలేదు । మరుపాకీజోలి ॥ ॥౧॥

ఓ గొప్పనైన బుద్ధిమంతుడా! జననమరణములు లేనిది పరిపూర్ణ మరియు ఈ యెరుక లేనిదనియును నీమనస్సునకును నమ్మకము దోచునంత వరకు నీవు యీమంత్రమును స్మరింపు చుండుము లేని యీయెరుకలేదు యిదిమరవకు లేనియీయెరుకలేదని సత్యముగా నిశ్చయించుకుంటె ఆపరి పూర్ణ మొక్కటే యుంటుగాని అపరిపూర్ణమును యెట్లని చెప్పుటకుగూడ తరముగాదని భావము.

౧౮౯ కం॥ ఉన్నది పరిపూర్ణము లేం • దెన్నటికీ యెరుక యనుచు నిది దృఢమౌదా • కెన్నమునే బోధించిన • తిన్నని యీ బోధ శిష్యతిలకా మరువకుమీ • సుజనులమోళ్ల • పలుకా వెరువకుమీ • నిన్ను కుమతులు వచ్చి నీలోతడిగితె వారీ • కెన్నివిధములనీ వెరిగింపకిది శిష్య • తిలకా మరువకుమీ • సుజనుల మోళ్ల • పలుకా వెరువకుమీ। ॥౩॥

ఓ శిష్యశ్రేష్ఠుడా! ఉన్నది పరిపూర్ణమనియును లేని యీ యెరుక యెన్నటికి లేదనియు నీకు విశ్వాసము గలుగు వరదాక నేను బోధించిన యీ అసలబోధను మరువకుము మం వారివద్ద చెప్పుటకు సందేహించకు చెడ్డవారు నీవద్దకు వచ్చి నీభావము నడిగితె వారికి యీపరిపూర్ణబోధను తెల్పకుమని భావము.

౧౯౦ కం॥ పరిపూర్ణము నెరుకను నే • నెరిగించితి నీవు రెంటి నెరి గితివిగదా • యెరుకను గురుదక్షిణగా • మరివేగిర మివ్వవట్టి • మాటలేమి టికీ • యెరుకతోయింక • కూటమేమిటికీ • పరులు నేనని యేదిభావమభావమై • నిరతామునొకరీతి నిలుచుండుమికవట్టి • మాట లేమిటికీ • యెరుకతో యింక • కూట మేమిటికీ॥ ॥౪॥

ఓ శిష్యుడా! నేను పరిపూర్ణమును యెరుకను (విమర్శగా) యెరుగ జెప్పితిని నీవు నేజెప్పిన రెండింటిని తెలుసుకంటివి తొందరగా నెరుకను గురుకట్నముగ మారుమాటలాడక నివ్వుము. ఇంక యెరుకతో స్నేహ మెందు లకు యితరులు నేను అనే భావము లేకపోయి యెప్పటికి నొకేతీరుగానిలబడు మని భావము.

౧౯౧ కం॥ పరిపూర్ణ మెరుక లివియని • గురువరు డెరిగించి యెరుక కూటమి మాన్పన్ • గురువుకుగురు వెవరనుటకు • మరి శిష్యునికింకనోట

మాటవెళ్ళినా • పోయినయెరుక • మళ్ళిమళ్ళినా • గురు శిష్యులనియేటి గురు తెన్నడెరుగాక • నిరతాము యొకరీతి నిండున్న బయలందు • మాడవెళ్ళినా • పోయిన యెరుక • మళ్ళీమళ్ళీనా॥ ॥౪॥

ఓ శిష్యుడా! ఇది పరిపూర్ణము ఇదియెరుక అనుచు సద్గురుమూర్తి తెలియజెప్పి యెరుకను వదలించిన తరువాత గురువుకు గురువెవరు అని యనుటకు శిష్యునకు నోరాడదు పోయిన యెరుక తిరిగిరాదు గురుశిష్యులను నట్టి యెరుకను యెప్పుడు తెలుసుకొనక నిరంతరము నొక్కతీరుగనుండు పరిపూర్ణమునందు మాటలేదని భావము.

౧౯౨ కం॥ స్థిరమగు పరిపూర్ణమునా • స్థిరమగు యీ యెరుక నెరుక దెలియు జగమున్ • యెరిగిన దెరుకేకద స • ద్గురు కృపచే యెరుకబోతె గురుశిష్యులేరీ • నోరెత్తాక • మరివినరోరీ • గురునిపాదములాన గురుతు లేనటువంటి • పరిపూర్ణ మొకటుంటు పలుకరా దట్లుండె • గురుశిష్యులేరీ • నోరెత్తాక • మరివినరోరీ॥

ఓ శిష్యుడా! శాశ్వితమైన పరిపూర్ణమును అశాశ్వితమగు యీ యెరుకను యెరుకచేత నెరుంగు ప్రపంచమును తెలుసుకున్నదే యెరుక సద్గురుని కరుణచే యీ యెరుక తొలగిపోయితే గురువు శిష్యులు యిద్దరు నుండరు మారు మాటాడక వినుము గురుమూర్తి పాదముల సాక్షిగ యెరుక రహితమగును పరిపూర్ణ మొకటి యుండును. ఆ పరిపూర్ణము వర్ణనాతీతమైనదని భావము.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే బోధాదృఢీకరణన్నామ దశమోధ్యాయః.

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజ
యోగిచే వ్రాయబడిన భావార్థ సహితములు
( బో ధ దృ ఢీ క ర ణం ) అను
పదియవ అధ్యాయము.

—(౦)—

## —: ౧౧ బోధస్థితి పురుష లక్షణం ఙ :—

౧౯౩ కం॥ గురుడ చలచలములను తన • కెరిగించిన శిష్యుడెరిగి యెరుకై యుండన్ • యెరుకను నిల్పకుమినినను • యెరుకను విడనాడి శిష్యు డెట్లుండునంటే • అట్లనె నేనిం • కెట్లుండు నంటే • పురషుడు లేనట్టి పొలతి సౌందర్యాము • మరిమరి కలిగుండి మరి లేనట్లనియంటి • యెట్లుండునంటే • అట్లనెనేనిం • కెట్లుండునంటే ॥౧॥

ఓ శిష్యుడా! సద్గురుమూర్తి పరిపూర్ణమును యెరుకను శిష్యునకు జెప్పిన తరువాత శిష్యుడు తెలుసుకొని యెరుకై యుండగా యెరుక నుంచబోకుము అని మరల సద్గురువు బోధించగా యెరుకను వదలిన శిష్యుడు యెట్లుండునో అట్లనే నేను అనునదియుండదు భర్త లేనటువంటి స్త్రీకి యెంత చక్కదన మున్నను లేనిదే కదా అని భావము.

౧౯౪ కం॥ యెరుకను విడనాడినయా • పురషుని స్థితి యెట్టిదనిన పొందుగవినుమీ • సరిపడు సరిపడదనకను • సరిగా వర్తింపు చుండు సమ రాసబుద్ధిన్ • కార్యములందు • సహజప్రవృద్ధిన్ • పరిపరి విధముల పరు వులుబెట్టాడు • మరి వైరాగ్యముచేత మానుకొనుండాడు • సమరసబుద్ధిన్ • కార్యములందు • సహజప్రవృద్ధిన్॥

ఓ శిష్యుడా! యెరుకను వదలిన పురుషుడు యెట్లు వర్తించునో చెప్పె దను వినుము ఒకటి సరిపడుననియు మరియొకటి సరిపడదనియు అనకుండ సర్వసమత్వబుద్ధితో ప్రవర్తించుచును పనిగలిగిన సమయమందు అనేక విధ ములుగా పరుగెత్తక వైరాగ్యముచేత ఆపనులను మానుకొనక సహజ స్వభా వముతో మెలంగునని భావము.

౧౯౫ కం॥ అహంకారు డవిషి షుడు • గనుకనె విశ్వంబనేటి కల గాన డహం • బనువాడు సనిమిషుడు గా • పున విశ్వంబనెటి స్వప్నోద్యో గాము బూనీ • జేయుచుయా ఉ • ద్యోగాను మానీ • యనునీ స్వప్నోద్యో గమునకు నేకారణ • మని తాన విషుడెన్నడనకో డీమాట ను • ద్యోగాము బూనీ • జేయుచు యాఉ • ద్యోగాముమానీ॥ ॥౩॥

ఓ శిష్యుడా! (దేవుడు) అహంకారము లేనివాడు రెప్పపాటు లేనివాడు కాబట్టి జగత్తనే స్వప్నమును చూడడు అహంకారము గలవాడు రెప్పపాటు

గలవాడు గనుకనె అహం (జీవుడు) అనువాడు జగత్తనె స్వప్న వ్యవహార ములో ప్రవేశించి వ్యవహరించు చుండును. ఆవ్యవహారమును వదలి ఈస్వప్న వ్యవహార ములకునే కారణమని చెప్పను. ఈమాటను రెప్పపాటు లేనివాడు (దేవుడు) చెప్పడని భావము.

౧౯౬. కం॥ కలమేలుకొన్న పురుషుడు • కలలోపలి బాములెరుక గలిగుండగనే • తిలకింపలేవు గురుకృప • తెలివొందిన వానికింక తిప్పా లున్నావే • తెల్పరకొద్ది • గొప్పలున్నావే • తలిదండ్రి దొరదాత కులదైవ మాప్తులు • కలబాంధవులు దేశికులని నమ్మితె యింక • తిప్పలున్నావే • తెల్పర కొద్ది • గొపాలున్నావే •

ఓ శిష్యుడా! స్వప్నమునుండి మేలుకొన్న మానవుడు స్వప్నములో అనుభవించిన సుఖదుఃఖములు తెలిసియున్నను వాటిని ప్రత్యక్షముగా జూడ లేడు గురుకటాక్షముచే జాగ్రత్త నొందిన వానికి యేకష్టములులేవు కొద్దిగొప్ప లేవైన యుండె తెలుపుము. తల్లి దండ్రి దొర దాత కులదైవము ఆప్తులు బంధువులు (మొదలగువారు) లందరు గురుమూర్తియేనని భావించిన యెడల యేకష్టములు నుండవని భావము.

౧౯౭. కం॥ ఈరీతిస్థితిగలిగిన • నేరుపుశా లితరజనుల నిందాస్తుతు లున్ • తారేగిచేయదెన్నడు • వారలు మరిచేసిరేని వలదానియనడూ • చెవియొగ్గి కా • వలెనని వినడూ • వారుమీవారు మావారు వీరనుకొంను • సారేకు వీధిలో పోరాడెవారిని • వలదానియనడూ • చెవియొగ్గి కా • వలెనాని వినడూ॥౨॥

ఓ శిష్యుడా! ఈలాటి స్థితిగల గుణవంతుడు యెచ్చటికిని పోడు పోయి నను ఇతరులను దూషించడు వారు దూషించినను భూషించినను వలదని అనడు కావలయునని చెవియొగ్గి వినడు వారు మీవారలు వీరుమావారలు అని అనుకొనుడు మాటిమాటికి వాదవాడలలో జగడమాడు వారిని వద్దని యనడని భావము.

౧౯౮. కం॥ ధ్వని మొదలగు తన్మాత్రలు • గనుగొనగాలేశమైన గాన్పిం చని చో • టును బట్టబయలు గాగని • ధ్వనిముఖ తన్మాత్రలున్న దాన్నె యెరుగకనూ • గనియీరెంట్లో • దేన్ని యెరుగకనూ • వునికి గలిగినయట్టి ఘనుని సన్నుతిజేయ • జనులాకు శక్యమంచనరాదు వినరాదు • దాన్నె యెరుగకనూ • గనియీ రెంట్లొ • దేన్ని యెరుగకనూ॥ ॥౬॥

ఓ శిష్యుడా! శబ్దము మొదలగు పంచతన్మాత్రలు యేమాత్రములేని దానిని పరిపూర్ణమనియు శబ్దము మొదలగు పంచతన్మాత్రలు గలదానిని లేని యెరుక యనియు తెలుసుకొనుము ఈరెండింటిలో దేనిని తెలుసుకొనక అచల బోధ స్థితిలోనున్నట్టి మహానుభావుని స్తోత్రము జేయుటకు నెవ్వరికి వశమవి అనరాదు వినరాదని భావము.

ఇతి, శ్రీమద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే బోధస్థితి పురుషలక్షణంనామ ఏకాదశోధ్యాయః. ౧౧॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు (బోధస్థితి
పురుషలక్షణం) అను పదకొండవ
అధ్యాయము.

—(౦)—

## —: ౧౨. బోధ పతన లక్షణం ౧౪. :—

౧౯౯ కం॥ నామాట లెన్నవినుమా । సామాన్యం బనుచుజూడ జనటీ బోధన్ । ప్రేమాతి శయముసంగని । వేమారిను గురునినోట వినవలెనుమ్మీ । నిత్యముజదువు । కొనవాలె నమ్మీ । నామారూపక్రియను నటనలుగలిగిన । దేమివస్తువో దాన్ని యెటు నిల్వనివ్వాదు । వినవాలెనుమ్మీ । నిత్యము జదువు। కొనవాలెనమ్మీ ॥ ॥౧॥

ఓ శిష్యుడా! నేను జెప్పునది శ్రద్ధగా వినుము. ఈ అచలబోధను కొద్దిదని భావించక మిక్కిలి భక్తితో గురునివలన వినవలయును యెల్లప్పుడు పఠియించుచుండ వలయును ఇది నిజమని భావించి అట్లుజేసిన యెడల నామ రూప క్రియ నటనలు గలిగిన యెరుకను యెచ్చట నిలువనివ్వదని భావము.

౨౦౦ కం॥ నేమొదట నిన్నుగనుగొని । యేముక్కలు నీదుచెవులొ యిమిడిస్తినో నీ । వాముక్కల మూడింటిని । యేమాత్రము మరువకుండ

యీబోధనిస్తీ । అంతకెయింత । గాబోధజేస్తీ । ప్రేమతో జదువుమి దేమార కెప్పుడు । కామితార్థమునిచ్చు పోమీ యింటికి దీవిం । చీ బోధనిస్తీ । అంతకెయింత । గాబోధజేస్తీ ॥ ॥౨।

ఓ శిష్యుడా! నిన్ను చూడగానే మొట్టమొదట నేను యేమాటలు జెప్పితినో నీవు ఆ (ఒకటి పరిపూర్ణము ఒకటి లేనియెరుక యీరెండింటిని తెలుసుకొని యెరగిన యెరుకను వదలుము అను) మూడుమాటలను యెంత మాత్రము మరచిపోకుండ నుండుకొరకు యీ అచల బోధ నింతగా బోధించితిని దీనిని యెల్లప్పుడు చదువుచుండుము నీవు కోరిన కోర్కెలను సమకూర్చును అని ఆశీర్వదించి నీకు యీబోధ జేసితిని నీవుయింటికి పొమ్మని భావము.

౨౦౧ కం॥ అన్నముదిన్నను ఆకలి । తిన్నగ నీరంబుదాగివ తృష్ణయు రోగం । బెన్నగ నౌషధసేవను । జన్నట్టియన్ యెరుకనిల్వ జాలదోయన్నా । యీబోధ నీ । చౌలాతో విన్నా । కన్నులతోజూచి కడ ముట్ట జదివిన । నిన్నెన్నటికి ఎదుట నిలచుండి కనుగొన । జాలదోయన్నా । యీబోధ నీ । చౌలాతో విన్నా ॥ ॥౩॥

ఓ నాయనా! భోజనముజేసిన ఆకలిదీరినట్లు నీళ్ళు దాగితె దప్పి ఆరునట్లు మందుదిన్నచో రోగము బోయినట్లు యీపరిపూర్ణ బోధను నీచెవులతో విన్న కన్నులతోజూచి చివరకు చదివినను యీ యెరుక నీముందర నిలచి నిన్ను యెప్పటికిని చూడజాలదని భావము.

౨౦౨ కం॥ జనన మరణ ప్రవాహము । నణచును యీబోధ పట్టు దని సాధువులిప్పిన । నొల్లకుండి వారలు । జనిపరుడా బోధమీద జనియించి ప్రేమా । వెదకెదరట్టి । జనచేష్టలేమా । యనితోచి నీకునేనిన జెప్పనలసె । నీవును యీబోధను వల్లననకు దొరుకదు మళ్ళి । జనియించి ప్రేమా । వెదకెద రట్టి । జనచేష్టలేమా ॥ ॥౪॥

ఓ శిష్యుడా! (ప్రపంచములో) సత్పురుషులు పామర జనులనుచూచి జననమరణ భ్రాంతిని తొలుగజేయు పరిపూర్ణ బోధోపదేశము నొందుమని చెప్పగా వద్దని ఆపామరులు అసత్పురుషులు పోయినతరువాత బోధమీద ప్రేమగలిగి వారిని వెదకెదరు పామరుల నడవడి యేమనిజెప్పుదును అని

ఆలోచించుకొని నీకు అచలబోధను చెప్పితిని దీనిని వద్దనకు తరువాత దొరకదని భావము.

౨౦౩ కం॥ మనువుకు తన్మాత్రలుగల । వెరుకకు తన్మాత్రలన్ని నీరె డొంకటే । పరిపూర్ణమునకు లేవవి । పరిపూర్ణము యెరుకగాదు మనువుగాదోయీ । వెనకినదీని । సరిది లేదోయీ । పరిపూర్ణ మెరుకాం పరిశోధించి గ్రంథము । రచించి నీకిస్తి మరువకచదు వెరుక । మనువుగాదోయీ। వెనకినదీని : సరిది లేదోయీ ॥ ॥౫॥

ఓ శిష్యుడా! శబ్దాది పంచతన్మాత్రలుగల మను వెరుకలు రెండు నొక్కటే అశబ్దాది పంచతన్మాలులేని పరిపూర్ణము మను వెరుకలుగాదు వెదకి చూచిన యీ పరిపూర్ణముతో సమానమైనది లేదు బయలెరుకలను విమర్శించి యీ గ్రంథము వ్రాసినీకు యిచ్చితిని దీనిని జ్ఞాపకముతో జదువుకొనుమని భావము.

౨౦౪ కం॥ ఆందముగా సద్గ్రంథము • చందము వినిపింతు దాన్ని చదివిన వినిరన్ • ముందుగ బయలెరుకై యే • సందునలే నెరకలేక జనవలె సుమ్మీ • అదె యిది విని • చదువు మీనమ్మీ • యెందూకు నీకింక యితర శాస్త్రముల జో•ందు గుర్తుండి పోదని గాన యీ యెరుక • జనవలెసుమ్మీ • అదె యిది విని • చదువుమీ నమ్మీ॥ ।౬॥

ఓ శిష్యుడా! (పరిపూర్ణబోధయను) ఈ గ్రంథము యొక్క పద్ధతిని చక్కగావినిపింతును దానిని చదివిన వినిన మొట్టమొదలు పరిపూర్ణము దెలిసి లేనియెరుక యెచ్చట లేకుండబోవును ఆగ్రంథమే యీ గ్రంథము నమ్మికతో నీగ్రంథమును గురువువలన విని చదువుకొనుము నీకు యితర చదువులతో పనిలేదు ఆ చదువుల యందు గుర్తనె యెరుకయుండి పోదుగ బట్టి దీనినే చదువుకొనుమని భావము.

౨౦౫ కం॥ చక్కెర మెక్కాలోకులు • చక్కెర మాధుర్యమెరుగ జాలరటువలెన్ • మక్కువతో విని చదువక • చక్కగ గ్రంధార్థమెరుగ జాలేరజనులూ • కావుననీవు • చాలించి పనులూ • చొక్కామీ గ్రంధాము చూడూమి కొనవెళ్ళ • యిక్కాడితో జన్మమెత్తావు సరి • తెలియజాలేర జనులూ • కావున నీవు • చాలించి పనులూ॥ ॥౭॥

ఓ శిష్యుడా! ప్రపంచములో మనుష్యులు శర్కరను తినక శర్కరలోని తీపిని తెలుసు కొనజాలరు అట్లే ప్రేమతోవిని చదువుకొనక ఈ గ్రంథమునందలి అర్థములను చక్కగా తెలుసుకొనజాలరు కాబట్టి నీవు నీపనులను చాలించుకొని స్వచ్ఛమైన యీ గ్రంథమును పూర్తిగా చదువుకొనుము నీకు తిరిగి జన్మలేదని భావము.

౨౬౬ కం॥ గూఢార్థమెరిగి సతతా • రూఢుండైనతడు గ్రంథరుచిగొనడు భువిన్ • గాఢతరజ్ఞానంబున • మూఢుండై యున్నవాడు మొదటికె వినడూ • సుజనుల పొద • ముదమొప్పగనడూ • వాడువీడనరానివాడే గ్రంథము వినె • వాడు నిశ్చయపెట్టి వార్తలెరుగని వాడు • మొదటికె వినడూ • సుజనులపొద • ముదమొప్పగనడూ॥ ॥౮॥

ఓ శిష్యుడా! ప్రపంచములో పరమ రహస్యార్థములను తెలుసుకొని యెల్లప్పుడు ఆరూఢస్థితిలో నుండు వానికి యీ గ్రంథార్థములతో పనిలేదు అట్లే జ్ఞానశూన్యుడైన మూర్ఖునకుగూడ గ్రంథార్థములతో నవసరములేదు మరియు యెన్నటికిని సంతోషముగా సత్పురుషుల సేవించడు యీపై సమాచారములు తెలియనివాడు కానివాడె వీడు నిశ్చయముగ యీ గ్రంథము వినే వాడని భావము.

౨౬౭ కం॥ తాబేటి తలపుచేతను • తాబేల్పిల్లల క్షుధార్తి తలగుట తెలియన్ • తాబేటి గర్భమందున • తాబేలై పుట్టకున్న తరమా యితరులకూ • సద్గురుబోధ • ట్లరయ నితరులకూ • యేబాధలెరుగాని యీబోధగలవారి • చేబోధ బడయాక చేకొనదలచితె • తరమాయితరులకూ • సద్గురుబోధ • ట్లరయానితరులకూ॥

ఓ శిష్యుడా! తాబేలు తనపిల్లలయొక్క ఆకలిబాధ పోవలయునని అనుకున్నంత మాత్రములోనె ఆకలిబాధపోయి తాబేలు పిల్లలు సుఖముగా నుండును. యిది తాబేలు గర్భమున పుట్టినవాటికిదప్ప యితర గర్భములయందు బుట్టిన వాటికి దెలియదు అట్లే సద్గురుబోధ యితరులకు తెలియదు యే అవస్థలు లేని ఈ అచల బోధ గలవారిచేతనే ఉపదేశము పొందక తెలుసుకొనవలయు నంటే సాధ్యముగాదని భావము.

౨౦౮ కం॥ ఈతాపేక్షను మనుజులు • నూతిదరిం జేరి నిల్చి నోట గొలిగినన్ • యీతేల వచ్చువారికి • చేతులతో నీళ్ళమీద చేరీయీదకనూ • మునునేర్చిన • వారీదించకనూ • యీతీరుగనె దేశికేంద్రుడు దెల్పక • చాతుర్యమునబోధ సాధించ నయ్యీన • చేరియీదకనూ • మునునేర్చిన • వారీదెంచకనూ॥ ॥౧౦॥

ఓ శిష్యుడా! ఈత నేర్చుకొన వలయునని ప్రేమగలిగిన మానవులు బావిదగ్గరకు వచ్చి నిలువబడి నోట అనుకున్నంత మాత్రమున ఈతరాదుగదా చేతులతో నీళ్ళమీదబడి యీదక పోయినను ముందు యీత వచ్చినవారు (వీరిని) యీదించక పోయినను యీదరానట్లు సద్గురుడు బోధించకుండె నీబోధను తన ఊహాపోహలచే సాధించలేడని భావము.

౨౦౯ కం॥ పరిశుద్ధమల చిత్తుడు శిష్యుడు • సవినయమున దేశికునకు శరణాగతుడై • త్రివిధప్రసాదములగొని • భవనాశస్థితులు లేని పద్ధాతి వినినన్ • తిరిగిరాని • పద్ధాతి గనినన్ • భువిలో వానిసాటి బోల్ప నెవ్వరు లేరు • అవిరాళభక్తినీ వారీతినుండేవీ • పద్ధాతివినినన్ • తిరిగిరాని • పద్ధాతి గనినన్॥ ॥౧౧॥

ఓ శిష్యుడా! మాలిన్యములేని మనస్సుగల శిష్యుడు వినయముతో సద్గురునకు శరణుజేసి మూడు విధములగు (ఒకటి పరిపూర్ణము ఒకటి లేనియెరుక యీ రెండిటిని యెరిగిన యెరుకను వదలుట అనువాటిని) అనుగ్రహముల బొంది ఉత్పత్తి స్థితిలయములు లేని పద్ధతిని విని తిరిగి జన్మలేని మార్గమును చూచిన యీ ప్రపంచములో వానితో సమానమైనవారు యెవ్వరులేరు కాబట్టి నీవుగొప్ప భక్తితో నుండుమని భావము.

౨౧౦ కం॥ ఉపనయనము గానిదెతా • నుపనయనము మీది చదువు నూహనుగొనినన్ • విపరీతమగు దానను • చపలుడు • బ్రాహ్మణుడుగాడు చర్చించిచూడా • శూద్రుడు వాన్ని • యర్చించరేడా • ఉపమాచెబోధట్లు ఊహించి నిక్కెటి • కపటాచిత్తుడు సాధుగణముతొ సమమౌనె • చర్చించి చూడా • శూద్రుడు వాన్ని • యర్చించరేడా॥ ॥౧౨॥

ఓ శిష్యుడా! ఉపనయన కర్మగాని బ్రాహ్మణుడు ఉపనయనమైన తర్వాత నేర్చుకునే విద్యను తన తెలివి తేటలచే నేర్చుకొన్నచో ఆవిద్య విరుద్ధమగుట అందుచేతనే శూద్రుడు బ్రాహ్మణుడు కాడు ఆలోచించగా నాబ్రాహ్మణుడుగూడ శూద్రుడేసుమా? అట్టివానిని యెచ్చట పూజించరు అట్లే ఊహచేత అచల బోధను ఊహించి నాతో సమానులైన బోధకులు లేరని తెగనీల్గెడి దుష్టచిత్తుడు సత్పురుషులతో సమానుడుకాడని భావము.

౨౧౧ కం॥ మంత్రముచే సంతెట్లగు • తంత్రము లేకున్నకాను తంత్రముచేతన్ • మంత్రములేకను వడుగిల • మంత్రము తంత్రంబురెండు మరిగూడుకోనీ • కార్యములన్ని • జరిగించుపూనీ • మంత్ర తంత్రములాలో మర్మము గురుడెరుగ • మంత్రతంత్రములాలో మరుగెరుగు గురునీచే • మరిగూడుకోనీ • కార్యములన్ని జరిగించుపూనీ॥ ॥౧౩॥

ఓ శిష్యుడా! మంత్ర తంత్రములేకుండ సంతానము గలుగదు మంత్ర తంత్రముల చేతనే ఉపనయన మగును మంత్ర తంత్రములు రెండు కలసుకొని పనులనన్నిటిని చేయును మంత్ర తంత్రములో నుండె రహస్యము గురుడు తెలుసుకొనును. మంత్ర తంత్రములలోని రహస్యము సద్గురుని వలన తెలుసుకొనుమని భావము.

౨౧౨ కం॥ సంకల్పాదిక గుణముల • సంకులమీ యెరుక యందు సమకూడుండున్ • సంకల్పాదిక గుణముల • సంకుల మచలమున జాడ జాడాలేదన్నా • యీ రెంటికి • యీడుగాదన్నా • కొంకక యీ రెంట్ని గూర్చి గ్రంథముజేస్తి • సంకోచింపక జదువు శంకబుట్టదు శంక • జాడ లేదన్నా • యీ రెంటికి • యీడుగాదన్నా॥ ॥౧౪॥

ఓ నాయనా! ఈ యెరుకయందు సంకల్పము మొదలైన గుణముల యొక్క కలిమిడి గలుగుచుండును. పరిపూర్ణమునందు ఆలోచించి చూడగా యీ సంకల్పము మొదలైన గుణముల యొక్క కలిమిడి యేమాత్రము లేదు. యీ రెండింటికి సమానత్వము లేదు. భయములేక (నేను) యీ రెండింటిని గురించి (విచారించి) ఈ గ్రంథమునువ్రాసితిని సందేహములేక జదువుము. నీకు యేసంశయము కలుగదని భావము.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే బోధపఠనలక్షణంన్నామ ద్వాదశోధ్యాయః.

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆ౦దాసు రాజ
యోగిచే వ్రాయబడిన భావార్థ సహితములు
( బో ధ ప ఠ న ల క్ష ణ ం ) అను
పన్నెండవ అధ్యాయము.

-(౦)-

## —: ౧౩ భ ద్రా ద్ర్యం కి త ం లా :—

౨౧౩ కం॥ అలభద్రాద్రిపల మనిన బ। యలుగా గురైరుగ వలయు యెరుకను విష్ణ్వం। దు౦దోచి గురుని కృపచే। నిలువక విష్ణ్వేగిరిపోతె నిశ్చయమదెరా। కృష్ణదాసు। నిశ్చయమిదెరా। యిలమీద యెవరైన యీ కందార్థములలో। పలిగూఢార్థము దెలియ భ్రమను జెందరువారు। నిశ్చయమదెరా। కృష్ణదాసు। నిశ్చయమిదెరా॥ ॥౧॥

ఓ శిష్యుడా! భద్రాచలమనగా పరిపూర్ణమని తెలుసుకొనుము యెరుక యనే విష్ణువు ఆ పరిపూర్ణములో కనపడి సద్గురుని కటాక్షముచే ఆయెరుక యనె విష్ణువు లేకపోతె అదే నిశ్చయమైన పరిపూర్ణమని తెలుసుకొనుము కృష్ణదాసుయొక్క నిశ్చయము యిదే ప్రపంచములో నెవరైన యీ కందార్థములలోనుండెటి రహస్యార్థములను గురువువలన విన్నట్లైతె భ్రాంతిని పొందరని భావము.

౨౧౪ కం॥ భాగవతుల నారాయణ। యోగికి జానకి యనేటియు చిదామణికిన్। బాగుగ పుత్రుడనై భూ। భాగమున కృష్ణననుచు। ప్రభవించినానూ। అనంతీకి। ప్రభువునైనానూ। నాగురువు కృపచేత నయమైన యీబోధ। నేగంటి కన్నంత నీకు దెల్పుట కిట్లు। ప్రభవించినానూ। అనంతీకి। ప్రభువునైనానూ॥ ॥౨॥

ఓ శిష్యుడా! భాగవతుల నారాయణయోగికి జానకి యనే ధర్మపత్నియందు కుమారుడనై కృష్ణదాసు అనే పేరుతో నీ భూమిమీద బుట్టితిని

అనంతలక్ష్మిని చేపట్టితిని నాసద్గురు కటాక్షముచే నిర్మలమైన యీబోధను వింటిని విన్నదానిని విన్నట్లుగనే నీకు జెప్పుటకు నిట్లు జన్మించితిననిభావము.

౨౧౩ కం॥ దేశాటనంబుజేసితి । వ్రాసితి గ్రంథములుకొన్ని వర గురుశిష్యుల్ । జేసేటి చర్చలు వింటిని । రోసితిమోక్షాద్య పేక్ష రూఢిగ వినుమీ । నీవిట్టి యా రూఢాతగనుమీ । దేశికు దయబుట్టజేసి శుశ్రూషోప । దేశముగొని యుపదేశామిచ్చితి మెచ్చి । రూఢిగవినుమీ । నీవిట్టియా । రూఢాతగనుమీ ॥ ॥౩॥

ఓ శిష్యుడా! దేశములను తిరిగితిని గ్రంథములను వ్రాసితిని గురు శిష్యులు వాదించెడి కొన్ని వాదోపవాదములను వింటిని తుదకు మోక్షాపేక్ష వదలితిని గట్టిగావిను నీవుగూడ యీ ఆరూఢస్థితినే పొందుము గురుకటా క్షము కలుగునట్లు పరిచర్యజేసి ఉపదేశమును పొంది నిన్నుమెచ్చి నీకు ఉపదేశ మిచ్చితినని భావము.

౨౧౬ కం॥ హాటమున కుటిలాత్ముని జం । పుటకై భటకోటికాజ్ఞ భూపతియిడినన్ । భటులుటునలె జేసెటిలో । పట కుటిలుడు బడినపాట్లు పాటించికనునా । అట్లనెగురుని । నోటతావినెనా । యిటువంటి బోధాను యెటు వంటి నరుడైన । అటువెనుక తనచేష్ట లెటువంటివోవాట్ని । పాటించికనునా । అట్లనెగురుని । నోటతావినెనా ॥ ॥౪॥

ఓ శిష్యుడా! రాజు దుర్మార్గుని చంపుటకు సైన్యముకు ప్రతిజ్ఞగా చెప్పినచో ఆసైన్యము అట్లే చేయునంతలోపల ఆదుర్మార్గుడు తానుచేసిన తప్పులను విచారించుకొనడు అట్లనే యెటువంటిమానవుడైన యీ నిర్మలమైన బోధను సద్గురువలన విన్నట్లులయితె అంతకు పూర్వము తానుచేసిన చేష్టలను విచారించి చూడడని భావము.

౨౧౭ కం॥ సకలజనుల సమ్మతిగా । నొకరైనను నడువలేరు । నుర్వీస్థలిపై । మకరాంక జననిజనకా । ద్వ్యంశంకులలోను నేనీ వననేమి గణనా । బోధం దితర । జనులేమి గణనా । వికలామానసుడావై వెతనొంద బోకు నీ । వకుటిలభక్తుడ వని తెల్పితీబోధ । ననేమిగణనా । బోధందితర । జనులేమి గణనా ॥ ॥౫॥

ఓ శిష్యుడా! ప్రపంచములో నందరికి యిష్టమగునట్లు ఒకరైనను ప్రవర్తించలేరు కళంకములేని మన్మధుని తలిదండ్రులు మొదలగు దేవతలలోగూడ లేరు. గనుక నేనునీవు ఒక లెక్కలోవారము కాము లోకమందు యితరజనులు మనకేమిలెక్కా? చంచల స్వభావముతో దుఃఖించకు నీవు కపటిలములేని భక్తుడవని నేను నీకు యీబోధను చెప్పితినని భావము.

౨౧౭ కం॥ బలధన విద్యలుదుష్టుల। కిలగల్గిన నోరుల నొంతురీర్ష్యముతోడన్। బలధనవిద్యలు శిష్టుల। కిలగలిగిన నోరులబ్రోతు రెంతో మోదమునా। నీవీరెంటి। నెరిగిమోదమునా। కలలోననైన దుష్టులచెంత జేరకు। మెలమి శిష్టులచెంత కలనైన వదలాకు। యెంతోమోదమునా। నీవీరెంటి। నెరిగి మోదమునా॥ ॥౬॥

ఓ శిష్యుడా! ప్రపంచములో దుర్మార్గులకు బలము ధనము విద్య అనునవి యుండిన అసూయతో నితరులను నొప్పింతురు ప్రపంచములో సజ్జనులకు బలము ధనము విద్య అనునవి యుండిన యెంతో సంతోషముగా పరులను రక్షింతురు నీవు యీరెండింటిని సంతోషముగా గుర్తించి స్వప్నమందైన దుర్మార్గులవద్దకుపోకు శిష్టులతో సహవాసము స్వప్నమందైన విడువకుమని భావము.

౨౧౮ కం॥ అందమగు స్వాతివర్షపు। బిందువు లెందెందుబడునొ పృథివిని త। ద్బిందువు లుపాధివశమున। జె దును తగునామరూప। చేష్టాదికమునూ। అట్లనే నీవు। జెందె విన్నియమునూ। మందీతో తగూడి మాట్లాడినంతాలో। అందూకె సహవాస మరయూము తగుదాన్ని। చేష్టాదికమునూ। అట్లనెనీవు। జెందెవిన్నియమునూ॥ ॥౭॥

ఓ శిష్యుడా! స్వాతికార్తిలో వర్షించిన చక్కని వర్షబిందువులు భూమిమీద యేయేస్థలములయందు బడునో ఆ బిందువులు ఆయాస్థల విశేషముల ననుసరించి నామ రూప క్రియ (మృత్యము)లు గలవి యగును. ఆవిధముగానె నీవును యితరులతో సహవాసము చేసి మాట్లాడితె యువనిష్ఠయును పొందుదువు (అనగా దుష్టులతో గూడిన దుష్టత్వము శిష్టులతోగూడిన శిష్టత్వము కలుగునని భావము) కాబట్టి తగినస్నేహమును సంపాదించుకొనుమని భావము.

౨౨౦ కం॥ జారులకు లోకులందరు । జారులవలె తోచబడుట సహజగుణంబౌ । చోరులకు సకలజనములు । చోరకులని మదికిదోచు । వునికి సహజమురా । అట్లనె దుష్టా । త్ము నికి సహ మురా । సారాములేని సం సారాబ్ధి దాటించు । వారిని తమవంటి వారిగ గనుటట్టి । వునికి సహ జమురా । అట్లనె దుష్టా । త్మునికి సహజమురా ॥ ॥౮॥

ఓ శిష్యుడా ! ప్రపంచములోని మానవులందరు జారులకు జారులవలెను దొంగలకు దొంగలవలెను తోచుట స్వభావసిద్ధము అట్లనే దుష్టబుద్ధిగలవానికి అంతులేని సంసార సముద్రమును దాటించు సత్పురుషులను తమవంటివారే నని తలంచుట సహజగుణమని తెలుసుకొనుమని భావము.

ఇతి, శ్రీమద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైత రహితపరమ తత్వే భద్రాద్ర్యంకితన్నామ త్రయోదశోధ్యాయః ౧౩॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే వ్రాయబడిన భావార్థ సహితములు (భద్రాద్ర్యంకితం) అను పద మూడవ అధ్యాయము.

—(౦)—

## —: ౧౪. గురు ని లక్షణం ౧౧. :—

౨౨౧ కం॥ బయటిదరుకలు శిష్యునకున్ । దయతో గురుదెపకజేసి తరువాతను స । దేహమేమిలేక యెరుకన్ । నయమున విక్షపింపగురుడు నయశాలిగాదా । నీమదికిది । నాటెనలేదా । భయభక్తి గురుసార్వభౌమూని సేవ ని । శ్చయముమూర్ జేసితె జయ మొందెదౌ గురుడు । నయశాలిగాదా । నీమదిని । నాటెనలేదా ॥ ౧॥

ఓ శిష్యుడా ! సద్గురుమూర్తి తన శిష్యునకు అనుగ్రహముతో పరిపూర్ణ మెరుకను తెలియజేసి అటుపిమ్మట యే అనుమానము లేకుండ యెరుకను

కష్టములేకుండ వదలించవలయును అట్టిసద్గురుమూర్తియే బుద్ధిమంతుడు యిది నీహృదయమునకు అతికెనాలేదా! నీవు భయభక్తులతో గురుశ్రేష్ఠునికి శుశ్రూష యథార్థముగా జేసితివేని నీకు జయము గలుగునని భావము.

౨౨ కం॥ పన్నెండక్షరములుగల । సదమల మంత్రార్థమెరిగి సద్గురు కృపచే । పదియారక్షరములుగల । యదియెట్టిదొ తెలిసెనేని యతడె సద్గురుడూ । యివిరెండెరుగ । నతడేడిగురుడూ । మొదటిది పరిపూర్ణమును దెల్పు నెరుకాను । తదనంతర పుదిబోధనుజేయు నిదిదెలిసి । నతడెసద్గురుడూ। యివిరెండెరుగ । నతడేడి గురుడూ॥ ॥౨॥

ఓ శిష్యుడా! పన్నెండు (ద్వాదశ) అక్షరములుగల నిర్మలమగు మంత్రముయొక్క అర్థమును తెలుసుకొని సద్గురు కటాక్షముచే పదహారు (షోడశ) అక్షరములుగల మంత్రము యెటువంటిదో అటువంటి మంత్రమును తెలియు వాడెవ్వడో అతడె సద్గురువు ఈ ద్వాదశి షోడశి అను మంత్రములను తెలియనివాడు సద్గురువు కాడు మొదటిమంత్రము పరిపూర్ణమును దెలుపును. రెండవది యెరుకను దెలుపునని భావము.

౨౩ కం॥ ఆమంత్రయుగము దెల్పెద । నేమముతో దలపుము తడీ బట్టబయల్ । యేమీలేదని బల్కిన । యీమంత్రమే ద్వాదశాక్ష రింకోటి వినుమీ । యెప్పుడు నోట । యివిమరువకనుమీ । యీమూలంలేని గుర్తెరిగె శరీరాము । యేమీలేదనియంటె యిదె షోడశాక్షరి । యింకోటి వినుమీ । యెప్పుడునోట । యివి మరువకనుమీ ॥ ॥౩॥

ఓ శిష్యుడా! ఆరెండు మంత్రములను చెప్పెదను నియమముగా వాటిని ధ్యానింపుచుండుము ఈ వృత్తబట్టబయలు యేమిలేదు అను ఈమంత్రము ద్వాదశాక్షరి మరియొకటి చెప్పెద వినుము మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమిలేదు అను యిదె షోడశాక్షరి యీరెండు మంత్రములను నీ వెల్లప్పుడు పఠింపుచుండుమని భావము.

౨౪ కం॥ తొలుమంత్ర పర్థమెక్కడ • కలదోయని వెదకనేల కలదంతట యా • నలిమంత్ర పర్థమెక్కడ • గలదోయని చూడనేల కాదా చూచేదీ • వినేది య • నేదీ తినేదీ • అలతొల్త దాన్ని నీవవశోకనముజేసి • కలకాలమెరుకాలుగల దాన్ని విడువెరుక • కాదాచూచేదీ • వినేదియ • నేదీ తినేదీ॥ ॥౪॥

ఓ శిష్యుడా! మొదటి మంత్రిముయొక్క అర్థము యెచ్చటున్నదో యని దేవులాక నక్కరలేకుండ అంతట నిండియున్నది. రెండవ మంత్రము యొక్క అర్థము యెచ్చటనున్నదో యని ఆలోచించవద్దు చూచునది వినునది అనునది తిరుగక అదేకదా నీవు మొదటిదానినిచూచి యెల్లప్పుడు యెరుకమరుపులు గందానిని వదలి వేయుమని భావము

౨౨౫ కం॥ ఇదిదప్పి యేమిలేదని • మొదటిది మొరబెట్టు చుండు ముదమున వినుమా • యిదియెమిలేదు పొమ్మని • వదలక రెండోది లెస్స వదరూ చుండునురా • బయలెరుకాల • నిదినిశ్చయమురా • అదిగాననీ రెంటినదసి నీవిప్పుడు • విడితాముగా రెంటిని విడరా మంత్రములిట్లు • వదరూచుండునురా • బయలెరుకాల • నిదనిశ్చయమురా॥ ॥౫॥

ఓ శిష్యుడా! మొదటిమంత్రిము ఈ పరిపూర్ణము దప్ప యితరమైనది యేమిలేదని మొత్తుకొనుచుండును నేను చెప్పునది సంతోషముగా వినుము రెండవ మంత్రిము యిది యేమిలేదు పొమ్మని చెప్పుచుండును కాబట్టి పరిపూర్ణ మెరుకలయొక్క నిశ్చయము యిది యీ రెండింటిని తెలుసుకొని నీవు యిప్పుడే యీ రెండింటిని వదలుమని భావము.

౨౨౬ కం॥ పరిపూర్ణమిదుగొ యిదుగో • యెరుకని చూపించి లేని యెరుకను లేదం • చెరిగించిన గురుడేసరి • యెరుకను నిల్పేటి గురుడు యెందూకో యన్నా • తత్భేదనీ • కెందుకోయన్నా • శరణన్నవారి మస్తకమందు చెయిబెట్టి • తిరమూగ యెరుకాను తీసి వెయ్యలివాడు • యెందూకో యన్నా • తద్బోధనీ • కెందుకోయన్నా॥ ॥౬॥

ఓ శిష్యుడా! ఇదుగో పరిపూర్ణము ఇదుగో యెరుక అని పరిపూర్ణ మెరుకలను చూపించి లేని యెరుకను లేదని బోధించె గురువే సద్గురువు యెరుకను వదలించలేని గురువు వ్యర్థుడే ఓ నాయనా? అటువంటి బోధలు నీకు వలదు శరణు అని అన్న శిష్యుల తల మీద చేయిబెట్టి నిశ్చయముగా యెరుకను తొలగించ లేనివాడు గురుడుకాడని భావము.

౨౭౭ కం॥ పరిపూర్ణ బోధనెరిగిన • గురువరుచే బోధగొన్న గొప్ప ఫలంబౌ • పరిపూర్ణబోధ నెరుగని • గురువరుచే బోధగొన్న గొప్పా ఫలమౌనా • అదియెట్లన్న • కూడిరతిలోనా • పురుషుని చేసంతుపొలతి బడయును బడయ • తరమౌనవారికె తమవంటి వారిచే • గొప్పా ఫలమౌనా • అదియెట్లన్న • కూడిరతిలోనా॥

ఓ శిష్యుడా! పరిపూర్ణ బోధను పూర్తిగ దెలుసుకున్న సద్గురునివలన ఉపదేశమును పొందినచో అది ఫలించును పరిపూర్ణబోధ దెలియని గురునిచే ఉపదేశమును పొందినచో అది విఫలమగును అదియెట్లంటివేని ఆడదిమగ వానితో రతిసుఖమును పొంది పిల్లలను కనునుగాని తనవంటి ఆడవారి వలన కనదని భావము.

౨౭౮ కం॥ పరిపూర్ణ బోధనెరుగని • గురుశిష్యులు బోధకొరకు కోరపనిబడున్ • గురువర్యునొకని మరలను • హరువరమున బుట్టినట్టి యా శిఖండికినీ • భార్యైనట్టి • యబలాతండ్రికినీ • వరుల నిద్దరిని దేవలెని యల్లుడు నేను • వరియింతుమని చెప్పి వనితనంపినయట్లు • యాశిఖండికినీ • భార్యైనట్టి • యబలాతండ్రికినీ॥ ॥౮॥

ఓ శిష్యుడా! పరిపూర్ణబోధను యెరుగజాలని గురుశిష్యులిద్దరు ఆపరిపూర్ణబోధ కొరకు వేరె యింకొక సద్గురుని ఆశ్రయించుటకు కోరుచుందురు అదియెట్లంటె శంకరుని వరమువలన బుట్టిన శిఖండికి భార్యయైన స్త్రీ తన తండ్రి వద్దికి నేను నీ అల్లుడును ప్రేమించుటకు మగవారల నిద్దరిని తిసుక రావలసినదని ఒక స్త్రీతో చెప్పంపినట్టు యుండునని భావము.

౨౭౯ కం॥ దృష్టాంత మెరుకకేదని • యోష్టముగదిలించగానె యొరులు కలనుచున్ • దార్ష్ట్రాంత మడుగ బోధకు • స్పష్టముగాక పూర్ణము దీపము జూపవోయీ • యీయుక్తి • లోపముజేయకోయీ • తుష్టినొందెదరిట్లు తోచి చెప్పితివేని • శ్రేష్ఠమౌ యీ బోధచే కొన్నవారు • దీపము జూప వోయీ • యీ యుక్తి • లోపము జేయకోయీ॥ ॥౯॥

ఓ శిష్యుడా! యెరుకకు దృష్టాంతము యేదయని అడుగుతే పరులు కల అనియును బోధకు దార్ష్ట్రాంతము యెదయని అడుగుతే కర్పూర దీపమనియు స్పష్టముగా జెప్పుము ఈయుక్తిని మరచి పోకుము. ఇట్లు ఆలోచించి చెప్పితివేని ఉత్తమమైన ఈబోధోపదేశమును పొందినవారు తృప్తి పడెదరని భావము.

౨౩౦ కం॥ యెరుక భ్రమగల్గు శిష్యుని • పరితాపము మాన్పినట్టి పండితుడెవడో • గురుడతడె కాని గురువులె • గురువులమని పొట్టకొరకు గొలిగెవారెల్లా • వారికిబోధ • తెలియూటకల్లా • పరిపూర్ణమును లేని యెరుకా నేర్పడదెల్పి • యెరుకాను విడిపించ నెరుగాక గురువులై • గొలిగెవారెల్లా • వారికిబోధ • తెలియూటకల్లా॥ ॥౧౦॥

ఓ శిష్యుడా! యెరుక అనే భ్రాంతిగలిగిన శిష్యునకు వుండె ఆధిక తాపము పోగొట్టినటువంటి విద్వాంసుడెవడో వాడె గురువు పొట్టకూటికొరకు గురువులమని చెప్పుకొను వారందరు గురువులు కారు ఈబోధ వారికి తెలియదు పరిపూర్ణమును లేనియెరుకను యీ రెండింటిని తెలియునట్లు జెప్పియెరుకను వదలించుట తెలియనివారు గురువులు కారని భావము.

౨౩౦ కం॥ గురుశుశ్రూషనొనర్చుట • మెరిగించెద నెట్లననిన యేర్పడవినుమా • నరులిష్ట దైవములకున్ • పరిచర్య యొనర్చునట్లు భక్తి తోడుతనూ • గురుమూర్తిక • త్యుక్తితోడుతనూ • నిరతా మరమర లేకనీవు సల్పితివేని • గురుబోధ మరుగు సద్గురునిచెదెలిసేవు • భక్తితోడుతనూ • గురుమూర్తిక • త్యుక్తితోడుతనూ॥ ॥౧౧॥

ఓ శిష్యుడా! సద్గురుమూర్తికి శిష్యుడు పరిచర్యయెట్లు జేయవలయునో ఆవిధానమును చెప్పుచున్నాను వినుము మనుష్యులు భక్తితో తమఇష్టదేవ తలకు సేవజేసినట్లు సద్గురువునకు అరమర లేక అతిభక్తితో నీవు శుశ్రూష చేసితివేని గురుబోధ యందలి రహస్యమును ఆసద్గురుని కటాక్షముచే నీవు తెలుసుకుందువని భావము.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే గురునిలక్షణం న్నామ చతుర్దశోధ్యాయః. ॥౧౪॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు
( గు రు ని ల క్ష ణ ం ) అను
పదునాల్గవ అధ్యాయము.

—(౦)—

## -: గు. శిష్యుని లక్షణంగు :-

౨౩౨ కం॥ తనుమనధనములు గురునకు । వినయంబున ధారబోసి వేడ్క గుగనిచే । అనువైన బోధబడసిన । ఘనమతి మంతునకు సాటి గలదా యీభువినీ । లోకులుమొ9క్క । వలదాచౌలవినీ । తననితరులనె తాననక యేమాటను । వినక పరిపూర్ణత దనరువానికిసాటి । గలదా యీ భువినీ । లోకులుమొ9క్క । వలదా చౌలవినీ ॥ ॥౧॥

ఓ నాయనా! తన శరీరమును మనస్సును ధనమును భక్తితో గురుదేవునకు అర్పించి సంతోషముతో ఆగురుమూర్తి వలన తగిన ఉపదేశమును పొంది ఉత్తముడైన ఆశిష్యునకు సమానమైనవాడు ఈ ప్రపంచములో యెవడుకాడు ఉత్తముని లక్షణములుగని ప్రతిమానవుడు నమస్కరించు చుండును తనను యితరులేమన్నను తాను మారుమాట బలుకక వారిమాటను వినక పరిపూర్ణ భావమును పొందిన వానికి సాటియెవ్వరు కారని భావము.

౨౩౩ కం॥ జలము నెడబాయనొల్లని । జలచరముల రీవిబూని సచ్ఛిష్యుడు హృ । జ్జలజంబను పీఠముపై । నిలిపి తరముమాని గురువునే కొల్చుసుమ్మీ । తదుక్తూల । నేతల్చునమ్మీ । కలకాలమీరీతి గడుపూచు నేపొ9ద్దు । తలిదండ్రి దొరదాత దైవమనుచు గురువు । నేకొల్చుసుమ్మీ । తదుక్తూల । నేతల్చునమ్మీ ॥ ॥౨॥

ఓ శిష్యుడా! నీటిని యెడబాయుట కిష్టములేని జలచరముల (చేపలు తాబేళ్ళు మొదలైనవి) వలె బుద్ధిమంతుడగు శిష్యుడు హృదయకమలమనే సింహాసనముపైన గురుమూర్తిని నెలకొల్పుకొని యితర చింతలు విడచి గురువునే సేవించుచుండును గురువు చెప్పిన మాటలనే నమ్మికగా ధ్యానించుచుండును. ఈ ప్రకారముగా దినములు గడుపుచు సర్వకాలములయందు గురుమూర్తినే తల్లి దండ్రి దొర దాత దైవమును కొనుచు సేవించుచుండునని భావము.

౨౩౪ కం॥ సతి పొరుగూరికిబోయిన । పతిరాకడ కోరినట్లు భావములోనన్ । మతిమంతుడు సచ్ఛిష్యుడు । సతతము గురురాకగోరు సత్యాము వినరా । వానితోటి । సాటెవ్వరనరా । హితుని రాకడను స్నేహితుడు గోరిన

యట్లు । అతిదరిద్రుడు ద్రవ్యతతి రాగోరినయట్లు । సత్యాముపినరా । వాని తోటీ । సాటెవ్వరనరా ॥ ॥౩॥

ఓ శిష్యుడా ! పరగ్రామమునకు పోయిన మగనిరాక కొరకు యిల్లాలు యెట్లు యెదిరి చూచుచుండునో మిత్రుని రాకడను మిత్రుడు యెట్లుకోగనో నిరుపేదవాడు ధనమును యెట్లు రాగోరునో అట్లె బుద్ధిమంతుడగు శిష్యుడు గురుమూర్తి రాకడకు యెల్లప్పుడు కోరుచుండును ఇది సత్యము ఆశిష్యునితో సమానమెవ్వడు కాడని భావము.

౨౩౫ కం॥ అతివెలరతి చతురతలా । యతివలచే వారితంత్రుడు లరయ రనుచు త । త్పతులరయరె రతినట్లనె । మతిమంతుడు గురుడుబోధ । మానీ నగాని । తద్బోధతా । మానాడుపూనీ । అతిదరిద్రునిచే విద్యార్జించి నతగాడు చతురుడై విత్తామార్జనజేయు పంతూలు । మానీనగానీ । తద్బోధతా మానాడుపూనీ ॥ ॥౪॥

ఓ శిష్యుడా ! స్త్రీలయొక్క క్రీడలయందలి నేర్పులను ఆ స్త్రీలచే వారితండ్రులు తెలుసుకొనలేరు కాని వారిభక్తులు మాత్రము తెలుసుకుందురు అని అన్నట్లు బుద్ధిమంతుడగు శిష్యుడు తన గురువు బోధను విడిచినప్పటికి ఆబోధను తానుమాత్రము విడువడు నిరుపేదవద్ద విద్యనేర్చు కున్నవాడు తన తెలివితేటలచే ధనమును సంపాదించును పంతులు విద్యజెప్పుట మాని నప్పటికి విద్యార్థి మానడని భావము.

౨౩౬ కం॥ పరిపూర్ణబోధదెల్పే । పరియంతము సేవజేసి బహునమ్మి కగా । గురుమూర్తికి తరువాతను । మరికన్నుల గననివాని మార్గాము ఛీఛీ । తలచరాదా । మాట ఛీఛీఛీ । గురువాజ్ఞ యివనీదె గురువై శిష్యులగూర్చి । గురుబోధ దెల్పెటి గురువంచకుని యొక్క । మార్గాము ఛీఛీ । తలుచరాద । మాట ఛీఛీఛీ ॥ ॥౫॥

ఓ శిష్యుడా ! పరిపూర్ణబోధ జెప్పునంతవరకు మిక్కిలి నమ్మికతో సద్గురునకు శుశ్రూషలుజేసి బోధపొందిన తరువాత కన్నెత్తిచూడని శిష్యుని పద్ధతి మంచిదికాదు ఆశిష్యుని ముచ్చట తలచుకోకూడదు ఛీఛీ నీచము సద్గురుమూర్తి ఆజ్ఞలేకుండ తాను గురువై తన శిష్యులకు గురుబోధను చెప్పునట్టి గురుద్రోహిపద్ధతి తలంచకూడదు ఛీఛీ అని భావము.

౨౩౭ కం॥ తనశిష్యులువిని తననతి । వినయంబున గొల్చుకొరకు వినుతియొనర్చు । తనగురువును గురుడింటికి । జనుదెంచిన జూచి శుశ్రూష నొనర్చకుండా । లేమినిదెల్పి । చనుమనుచుండూ । వినుముకుచ్చిత శిష్యా గ్రణివీడు వీడెట్లు । ఘనబోధోక్తస్థితి గనునా గురునకు శుశ్రూష । నొనర్చ కుండూ । లేమినిదెల్పి । చనుమనుచుండూ ॥ ॥౬॥

ఓ శిష్యుడా! కపటశిష్యుడు తన శిష్యులు విని తననెంతో గౌరవించు కొరకు తనగురువును స్తోత్రము జేయుచుండును తన యింటికి గురువు వచ్చితె చూచి సేవజేయక తన దరిద్రమును చెప్పి పొమ్మనుచుండును వీడే కపట శిష్యులలో మొదటివాడు వీడు ఉత్తమమైన పరిపూర్ణబోధస్థితిని తెలియజాల డని భావము.

౨౩౮ కం॥ కుటిలాత్ముడైన శిష్యుడు । యిటువలె తాబలుకుచుండు యింటికివస్తే । యెటుబోవుచుండివస్తిరొ । యిటకిక దర్శనముమళ్ళి యెప్పు డయ్యానో । యెవరికి దెలుసు । నెప్పుడేమౌనో । యేదోఒక దేమైన యిత్తా మంచనుకుంటె । తుటుకూన వొకరాగి దుడ్డైన లేదిప్పు । డెప్పుడయ్యానో । యెవరికిదెలుసు । నెప్పుడేమౌనో ॥ ॥౭॥

ఓ శిష్యుడా! కపట శిష్యుడు తనయింటికి సద్గురుమూర్తి వచ్చినట్లు అయితె యీక్రిందిమాటలు బలుకుచుండును (ఓగురుమూర్తి) యెక్కడికి పోవుచు యిక్కడికి వచ్చితిరో మరల దర్శనము యెప్పుడవుతుందో యేకాల ములో యెట్లయ్యేది యెవ్వరికిని తెలియదు యేమి తోచటములేదు. ఏమైన (ద్రవ్యమును) యిస్తామనుకుంటె చేతులో యిప్పుడు రాగిదమ్మిడి కూడలేదని భావము.

౨౩౯ కం॥ జపములు తపములు సలుపును । విపరీత స్మరణజేయు వేదాంతార్థం । బపరిమితంబుగ జెప్పును । కపటాత్ముడు శిష్యకోటి । గని మెచ్చుకొరకూ । మెచ్చిద్రవ్య । మును యిచ్చుకొరకూ । అపకీర్తిచేతాల కదరినట్లగుపడి । ఉపముచే బ్రతుకూచునుండు లోకులు తనను । గనిమెచ్చు కొరకూ । మెచ్చిద్రవ్య । మును యిచ్చుకొరకూ ॥ ॥౮॥

ఓ శిష్యుడా! కపటశిష్యుడు తన శిష్యులందరు చూచి మెచ్చుకొను కొరకు మెచ్చుకొని ధనము యిచ్చేకొరకు జపతపములు జేయుచుండును

విపరీతముగా స్మరించుచుండును. మితిలేని వేదాంతార్థములను చెప్పుచుండును. అపకీర్తిపాలగుటకు భయపడుచున్నట్లు కనపడి ఉపాయముగా లోకులు తనను చూచి మెచ్చుకొనునట్లు బ్రతుకుచుండునని భావము.

౨౯౧ కం॥ గురుమూర్తి కెదు రహంకృతి । దొరకొన్నను దొంగ తోవ్రవదొక్కను చెవులన్ । గురునింద వినినచేసిన । నరునకు పరిపూర్ణబోధ । నలువీయె తెలియా । కూడదువాన్ని । తెలియాక కలియా । గురుడుదెల్పని పుస్తకరీతిచే పూర్ణ । మరసీతినని యెంతో మురసీన యీబోధ । నలువీయె తెలియా । కూడదు వాన్ని । తెలియాక కలియా ॥ ॥౯॥

ఓ శిష్యుడా! సద్గురుమూర్తికి యెదురుగా అహంకారముతో ప్రవర్తించి నను దొంగతోవలు పోయినను గురువును నిందించినను ఒకరు నిందించగా విన్నను యిటువంటి మనుష్యుడు పరిపూర్ణబోధను తెలుసుకొనజాలడు వానిని తెలియక స్నేహము జేయకూడదు గురువు బోధించకనే పుస్తకములోనున్న ప్రకారము పరిపూర్ణమును తెలుసుకొంటినని యెంతో సంతోషించినను వ్యర్థమే అని భావము.

౨౯౦ కం॥ నాలుగు శుశ్రూషణములు । లోలతగావించుకొనుచు లోకాతీతం । బాలోచించి గురునిచే । యీలోకముజోలి విడువు । మింతేచాలున్నా । నీతోగూడ । యిదిమురువకన్నా । కీలుదెలియని చదువు చాలాజది వెందూకు । చాలించి నీవిట్టికేలూ దెలిసితివేని । యింతేచాలున్నా । నీతోగూడ । యిది మరువకన్నా ॥ ॥౧౦॥

ఓ శిష్యుడా! సద్గురువునకు నాలుగు విధములగు శుశ్రూషలు భక్తితో జేసి ఆసద్గురుమూర్తిచే లోకాతీతమైన పరిపూర్ణమును చూచి యీ ప్రపంచము యొక్క సంగతి వదలు కొమ్ము యింతే చాలును నీతోబాటు దీనిని మరువకు రహస్యములు దెలియని విద్యలను యెక్కువగా చదువకు వాటిని చాలించి నీవు యీరహస్యము తెలుసుకుంటివేని చాలునని భావము.

౨౯౨ కం॥ దేశికుని చరణతీర్థము । కాశీగంగయని గురుని గను గొన్నను వి । శ్వేశుడని యతడుతన కుప । దేశంబొనరించి నట్టిదే తారక మనీ । మనసందుతా । సితీరునగనీ । యేసీ యందున్న కాశీపట్టియాగరా । వేశుని పురమై ప్రకాశించు నాసీమ । దేతారకమని మనసందుతా । నీ తీరు నగనీ॥ ॥౧౧॥

ఓ శిష్యుడా! సద్గురుమూర్తి యొక్క పాదజలము కాశిలోని గంగాజల మనియు సద్గురువును చూచినపుడు విశ్వేశ్వరుడనియు ఆ గురువుతనకు ఉప దేశించిన మంత్రము తారక మంత్రమనియు మనస్సులో తలంచవలయును ఈ ప్రకారముగ దలంచిన మానవుడు యేదేశమందున్నను ఆ దేశమే కాశి ప్రయాగ రామేశ్వరము అనుపట్టణములవలె ప్రకాశించు చుండునని భావము.

౨౪౩ కం॥ గురుచరణ జలముగోదా • వరియని గురుమూర్తి రామ భద్రుండని త • త్పురమును భద్రాచలమని • గురుమంత్రమే తారకమని గురిగలిగినట్టి • తిరిగిరాని • మరుగెరిగి నట్టి • నరుడున్నచోటె సుందర శేషగిరి భద్రి • గిరిరంగనాయక పురమానదగియుండు • గురిగల్గినట్టి • తిరిగిరాని • మరుగెరిగినట్టి॥ ॥౧౨॥

ఓ శిష్యుడా! సద్గురుమూర్తి యొక్క పాదతీర్థము గోదావరిలోని తీర్థ మనియు గురుమూర్తి శ్రీరామ చంద్రుడనియు ఆగురుమూర్తి యుండె పట్టణ మును భద్రాచలమనియు ఆసద్గురు మంత్రమే తారకమంత్రమనియు నర్ణ యించుకొని మరల జన్మలేని రహస్యము దెలుసుకున్న మనుష్యుడున్న స్థలమే అందమైన తిరుపతి భద్రాచలము శ్రీ రంగము అని చెప్పుటకు సామ ర్థ్యముగలిగి యుండునని భావము.

౨౪౪ కం॥ గురుడు నరుడనుచు • దలచిన • గురుమంత్రము మరచి యున్న గురుపుత్రులనా • దరణయొనర్చకయుండిన • గురువును విడనాడి రెండో గురుని జేరిననూ • సద్గురుబోధ • నెరిగి దూరిననూ • యెరుక మహ త్యాము నెరిగినయిటువంటి • నరు నాకదప్పా దునరకాము నిజమింకో • గురుని జేరిననూ • సద్గురుబోధ • నెరిగి దూరిననూ॥ ॥౧౩॥

ఓ శిష్యుడా! గురుమూర్తిని మానవుడని అనకున్నను గురువుచెప్పిన మంత్రమును మరపోయినను గురుపుత్రుల నాదరించక పోయినను మంత్రము జెప్పిన గురువును వదలి రెండవ గురువును ఆశ్రయించినను గురుబోధను పొందదూషించినను ఈ యెరుకయొక్క మహిమ తెలిసిన యిటువంటి మను ష్యుడు తప్పక నరకమును పొందునని భావము.

౨౪౫ కం॥ జ్ఞానవైరాగ్య భక్తి • సమాజ నదీస్నాన దేవమంత్ర పఠ నత • ధ్యాన మఖతంత్రములు పర • మానిని రతిగోరునట్టి మనుజా సంఘ

ముకూ ♦ బోధనుదెల్పు మనినవారలకూ ♦ తాను బోధించుటాట తగదు బోధిం చితె ♦ తాను నేనను భ్రాంతి తొలగెదేలాగట్టి ♦ మనుజాసంఘముకూ ♦ బోధ నుదెల్పు ♦ మనినవారలకూ॥

ఓ శిష్యుడా! జ్ఞానము వైరాగ్యము భక్తి నదిస్నానము దేవతాదర్శనము మంత్రపఠనము ఆధ్యాన్నము యజ్ఞములు తంత్రములు పరస్త్రీ సంభోగము అనునవి కోరునట్టి మనుష్యులు పరపూర్ణబోధ దెలుపుమని వారు ప్రార్థించినను తాను బోధించ గూడదు బోధించితే వారికి తాను నేను అను భ్రాంతి తొలగ దని భావము.

౨౯౮ కం॥ ఇంగితము నెరిగి సద్గురు ♦ పుంగవుచే నరుడుభుక్తి ముక్తి క్రియలన్ ♦ సంగాసంగము లెడలిన ♦ శృంగారమె వానిచేష్ట చూచెవారలకూ♦ వాడున్నట్టు ♦ తోచె వారలకూ ♦ మంగాళసూత్రిమే భంగిశృంగా రామె ♦ శృంగార వతికి యశృంగార వతికట్టు ♦ చూచెవారలకూ ♦ వాడున్నట్టు ♦ తోచెవారలకూ॥

ఓ శిష్యుడా! సద్గురుమూర్తి అభిప్రాయము (సూచన)ను తెలుసుకొని మనుష్యుడు భుక్తి ముక్తి క్రియలయొక్క సంయోగములను వదలుకున్నటు లయితే వానినడకలు చూచెవారలకు వాడున్నటు అనుకునె వారలకు అంద ముగా నుండును. అదెట్లంటె చక్కదనముగల స్త్రీకి మంగళ సూత్రము యెట్లు అందమైనదో చక్కదనములేని స్త్రీకిగూడ మంగళసూత్రమట్లే అందముగా నుండునని భావము.

౨౯౭ కం॥ జనులందరు గురుబోధను ♦ గని రాజనులందు నేను గలి యక యున్నన్ ♦ నన్ను మన్నింతురెవారని ♦ మనసున తలపోసె బోధ మర్మామబ్బినా ♦ అబ్బినవారి ♦ ధర్మామబ్బినా ♦ జనన మరణములేని ఘనమైనత్రోవనే ♦ గనసైతినని బోధగనకున్న యీ బోధ ♦ మర్మామబ్బినా♦ అబ్బినవారి ♦ ధర్మామబ్బినా ॥౧౬॥

ఓ శిష్యుడా! మానవులందరు గురుబోధను పొంది వచ్చుచుండగ చూచిన వాడొకడు నేను వీరికి కలవకుండనుంటె వీరు ఆదరించరు అని మన స్సులో అనుకుంటె బోధరహస్యము తెలువదు తెలిసినను వారిధర్మము అల

బడదు జననమరణ భ్రాంతి రహితమగు ఈ గొప్పబోధయొక్క మార్గమును నేను చూడనైతినని బోధను పొందినచో యీబోధ రహస్యము తెలియదని భావము.

ఇతి, శ్రీ మద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే శిష్యుని లక్షణం న్నామ పంచదశోధ్యాయః. ॥౧౫॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు
(శిష్యుని లక్షణం) అను పది
యైదవ అధ్యాయము.

-(౦)-

## —: ౧౬ గురుశిష్యోభయ లక్షణం ౧౬ :—

౨౪౮ కం॥ హృదయగ్రంధి విడుటకై, సదయత యీ బోధదెల్ప జనదాగురుడై, వదలక చిత్తములో గురు, పదయుగళము దలుపవలదే, భక్తుడైనపుడూ, భ్రాంతిరహిత, సక్తుడైనపుడూ, కుదురాదు యిదిరెండు గురుశిష్యులకు లేక, కదలిక లేనట్టిఘనబోధోక్తస్థితి, భక్తుడైనపుడూ, భ్రాంతిరహిత, సక్తుడైనపుడూ॥ ॥౧॥

ఓ శిష్యుడా! గురుమూర్తియైన మహానుభావుడు శిష్యుని హృదయముతో గల సందేహము దొలగుటకై దయతో ఈ పరిపూర్ణబోధ నుపదేశించ వల యును శిష్యుడైనవాడు భ్రాంతిరహితమైన అచలబోధ నుపదేశము కావలయు నని ప్రేమగలిగినపుడు గురుమూర్తియొక్క రెండు పాదములను వదలకుండ తన హృదయములో ధ్యానింపు చుండవలయును గురుశిష్యులకు యీ రెండు పద్ధతులు లేకున్నచో చలనరహితమైన అచలబోధయందు చెప్పినట్టి స్థితి కుదరదని భావము.

౨౪౯ కం॥ గురుడాసవదలకుండిన, మరి శిష్యుడు ద్రవ్యశోభ మగ్నుండైనన్, మరియాదదక్కదిరువుర, కెరిగుండము వీరలతి విహీను

లోయన్నా • గట్టిగదురభి • మానులోయన్నా • గురుడు శిష్యునికన్న కొడు కూగ గనకున్న • గురునీపై శిష్యుడా గురినిల్పకుండీన • హీనులోయన్నా • గట్టిగ దురభి • మానులోయన్నా॥

ఓ శిష్యుడా! ఆశవిడువని గురువైనను ధనలుబ్ధుడు శిష్యుడైనను ఈ గుర్తు శిష్యులిద్దరికి గౌరవములు దక్కవని తెలుసుకొనుము వీరు మిక్కిలి హీనులు గట్టిగవీరు దురఅహంకారము గల వారు శిష్యున్ని తన కన్నకుమారునిగా గురువు చూచుకొన కున్నను గురువుపై శిష్యుడు లక్ష్యముంచ కున్నను వీరిద్దరు హీనులేనని తెలుసుకొనుమని భావము.

౨౫౦ కం॥ గురు గురుబోధలచేతను • పరిపూర్ణము నెరిగి యెరుక బాసినయతనిన్ • గురుతెరుగ నొరులశక్యమె • యెరిగిన నరులిట్టిబోధ నెరిగేరోయన్నా • వారెరుగాని • మరుగుండదన్నా • చిరుతపాపనిరీతి నురిపిశాచము భాతి • తిరుగూచునుండు పెక్కురుమాక్కి గురు డెట్లు • యెరిగేరోయన్నా • వారెరుగాని • మరుగుండదన్నా॥ ॥౩॥

ఓ శిష్యుడా! గురుసాంప్రదాయము గురుబోధ అనువాటిచేత పరిపూర్ణము తెలుసుకొని యెరుకను వదలిన మహాపురుషున్ని తెలుసుకొనుటకు యితరుల (పామరుల) కు సాధ్యముకాదు తెలుసు కున్నను ఆపామరులు యీ బోధను తెలుసుకొనలేరు. నాయనా? ఆసద్గురుమూర్తి తెలియని రహస్యము యుండదు ఆ మహాను భావుడు చిన్నపిల్లవానివలె పిశాచమువలె పిచ్చివానివలె తిరుగుచుండునని భావము.

౨౫౧ కం॥ మలయాద్రి చెంతచెంచుల • కిలచందన భూరుహములె యింధనమట మిక్కిలి గలుగబట్టి యట్లనె • చులుకన సుమీ యింటగలుగు సూరిభూషణుడూ • బహుమాన్యుడు • దూరస్థు డెపుడూ • తెలయానివారికి తెలిసేదికఠినాము • తెలివిచెదెలిసితె తెలియ జేసునుబోధ • సూరిభూషణుడూ • బహుమాన్యుడూ • దూరస్థుడెపుడూ॥ ॥౪॥

ఓ శిష్యుడా! చందన పర్వతమువద్ద నివాసముజేసె చెంచువారలకు ఆ చందనపుచెట్లే యెక్కువగా నుండుటచే వారు పొయిలో కట్టెలుగా వాడు కుందురు. అట్లనే తన యింటిలోనున్న సాధుభూషణుడు నిర్లక్ష్యముగా నుండును. దూరముగా నున్న సద్గురుమూర్తి సర్వదా పూజింపబడుచుండును. యిది తెలియనివారికి తెలియుట కష్టము. అట్టి సద్గురువును తన తెలివితో. తెలుసుకుంటె ఆసద్గురువు తనకు పరిపూర్ణబోధను తెలియ జెప్పునని భావము

౨౫౨ కం॥ దూరముననుండి విన్నను • చేరును సజ్జనుడు గురుని చెంతకు బోధన్ • గోరి దుర్జనుడు గోరడు • దూరస్థుడు గాక గురునితో గూడియుండీ • యెట్లనియన్న • దూరాననుండీ • కోరితుమ్మెద తమ్మి జేరి తేనియగ్రోలు • నారీతి నెరుగావు చేరికప్పలు తమ్మి • తో గూడియుండీ • యెట్లనియన్న • దూరాననుండీ॥ ॥౫॥

ఓ శిష్యుడా! సత్పురుషుడగు శిష్యుడు దూరము నందుండి విన్నను పరిపూర్ణ బోధను వినగోరి గురువు సన్నిధికి పోవును దుర్జనుడు దూరముగా నుండక గురువుతో కలసియుండి బోధను వినడు అది యెట్లంటె తుమ్మెదలు మకరందము నపేక్షించి దూరమునున్న కమలముల వద్దకుపోయి మకరంద మును త్రాగును. కమలములతో కలసియున్న కప్పలు మకరందమును త్రాగ వని భావము.

౨౫౩ కం॥ చూసి మదిదెలిసి శిష్యుని • యాశయమును తగినబోధ నతనికి దెలియన్ • జేసిముద మొందజేసెటి • దేశికుడే ముఖ్యుడనుచు తెలుసు కోవోయీ • కనియతగాన్ని • కలుసుకోవోయీ • చేసినిదయతో నీయాశసం పూర్తిట్లు • వ్రాసై తెవేసు కొచూచేవు తార్థాణ • తెలుసుకో వోయీ • కని యతగాన్ని • కలుసుకోవోయీ॥ ॥౬॥

ఓ శిష్యుడా! శిష్యునిజూచి అతని అభిప్రాయము మనస్సులో తెలుసు కొని అతనికి తగిన బోధను ఉపదేశించి సంతోషింపజేయు సద్గురువే ప్రధాను డని తెలుసుకొనుము అటువంటి వారినిచూచి కలిమిడి చేయము ఆగురుమూర్తియు దయతో నీ ఆశను పూర్తిచేమును ఇట్లు వ్రాసియుంచుకొనుము దానికి నిదర్శ నము తరువాత చూచెదనని భావము.

౨౫౪ కం॥ మంతనమున గురుబోధను యెంతో వింతనుచు నమ్మి తింతేకద • యేవింతలు గనరావని ధాంవంతము నొందేటి వానిబ్రతు కెంత కంతే • చింతలులేని • గతిగానడింతే • అంతకంతకు వానికతి చాదస్తమెకాని • సంతాకూటముతోటి సంభాషించడు వాని • బ్రతుకెంతకంతే • చింతలులేని • గతిగానడింతే॥ ॥౭॥

ఓ శిష్యుడా! కపట శిష్యుడు తనమనస్సులో గురుబోధ అనగా యెంతో వింతగా నుండుననుకుంటిని యింతేకదా యిందులో యేమి వింతలులేవు అని యేడ్చేవాని బ్రతుకు యెంతకంతె వాడు దుఃఖములేని త్రోవకు పోజాలడు అంతకంతకు వానికి పిచ్చియెక్కువే కాని సత్పురుషులతో మంచిగ మాట్లాడ లేడని భావము.

౨౫౩ కం॥ తనగురుబోధను తా జది, విన విను జనసంతతి మదికి వింతై యీబో, ధను నేర్వకున్న వ్యర్థము, జననంబని తోచిశరణు శరణా నెటట్టూ, వెంటనెవాండ్లు, దరిజేరెటట్టూ, ఘనమైనయుక్తి జేసినవాడె శిష్యుకు, అనుమాన మేమిందు గనరాదు వినవోయి, శరణానెటట్టూ, వెంటనెవాండ్లు, దరిజేరెటట్టూ ॥౮॥

ఓ శిష్యుడా! తన గురువు చెప్పినబోధను తాజదువుకన్నప్పుడు వినుచున్న ప్రజలందరు మదిలో ఆశ్చర్యము గలిగి యీబోధను నేర్చుకొనకున్న మన జన్మములు సార్థకములు కావని ఆలోచించి వెంటనే ఆప్రజలు దగ్గరకు వచ్చి శరణుశరణు అనునట్లు గొప్పనైన యుక్తిచేయువాడె శిష్యుడు యిందుకు సందేహము యేమిలేదని భావము.

౨౫౪ కం॥ తనభార్య రూపురేఖలు, తనపుత్రిల సద్గుణములు తన సంపదయున్, తన పెరటి మందుచెట్లులు, తనగ్రామపు సాధుజనులు తనకూ మెప్పౌనా, యీ యిలలో యెం, తటి వానికైనా, వినలేదె నీవా హల్యనుజూచి మోహించె, ఘనవాహనుండు చక్కని భార్యగలిగుండి, తనకూ మెప్పౌనా, యీ యిలలో యెం,తటి వానికైనా॥ ॥౯॥

ఓ శిష్యుడా! తన యిల్లాలి సౌందర్యము తన కొడుకుల మంచిగుణములు తన ఐశ్వర్యమును తన పెరటిలోనుండెడి ఓషధులు తన వూరిలోనున్న సత్పురుషులు యీ ప్రపంచములో యెంతవానికైన గురిగానుండవు అదెట్లంటె యింద్రునకు సౌందర్యముగల శచీదేవి భార్యగానున్నను గౌతముని భార్యయగు అహల్యను చూచి మోహించెనని భావము.

౨౫౫ కం॥ జతనముగదాచి చదువుము, రతనమ్ముల హారమిదియు రసికులగళమా, యతనము దీనికి నేబహు, యతనము గావించితెచ్చి యిస్తిర నేడూ, బోధకుబందో, బస్తారచూడూ, రతనాలెట్లొరాళ్ళు రతనాలంచని యంటె, రతనాలి పద్యాలే రసికులెరిగెద రివినీ, కిస్తిరనేడూ, బోధకుబందో, బస్తారచూడూ॥

ఓ నాయనా! ఇదిరత్నములహారము దీనికి సాధువుల యొక్క కంఠము నివాసస్థలము దీనిని జాగ్రత్తగా దాచుకొని చదువుకొనుము. నేనుచాల ప్రియత్నముచేసి తెచ్చిన యీ హారమును నేను నీకిచ్చితిని పరిపూర్ణబోధను యిది గట్టిపరచును. రాళ్ళను రత్నాలని చెప్పితె రాళ్ళురత్నములుగావు. అనిఅంటె విద్వాంసులు యీ పద్యములనె రత్నములని తెలుసుకుందురని భావము.

౨౫౮ కం॥ వినసేర్చి చెప్పనేర్చిన • మనుజులకే దీనిలోని మర్మము దెలుసున్ • వినజెప్పనేరకుండిన • మనుజులు యీ బోధలోని మర్మామెరి గెరా • దీనందుండే • ధర్మామెరిగేరా • జనులె కొబ్బరికాయ తినసేర్పుగల వారు • తినసేర్చునాకోతి తనకా కాయబ్బిన • మర్మామెరిగేరా • దీనందుండే • ధర్మామెరిగేరా॥ ॥౧౧॥

ఓ శిష్యుడా! వినుటకు చెప్పుటకు సామర్థ్యముగల మానవులకే యీ గ్రంథములోని రహస్యము తెలుసును వినుటకు చెప్పుటకు సామర్థ్యములేని మనుష్యులు యీ బోధలోని మర్మధర్మములను తెలియజాలరు అది యెట్లంటె మనుష్యులు కొబ్బరికాయను తినుటకు నేర్పరితనముగలవారు కోతికి కొబ్బరి కాయదొరకిన తినుటకు నేర్పరితనములేదని భావము.

౨౫౯ కం॥ నేనెంత లెస్సజదివిన • దీనినిదెలియంగగలరె దేశిక వర్యున్ • పూనిసేవించకుండిన • మానవులది యెట్లనన్న మరివినకోయీ • నామాటందు • మనసుంచవోయీ • వానకాలములోని వర్షాము వొకబిందు • వైనమిట్టనునిల్వ • దది నిశ్చయమెకద • మరివినవోయీ • నామాటందు • మనసుంచవోయీ ॥౧౨॥

ఓ శిష్యుడా! మానవులు గురుమూర్తికి భక్తితో శుశ్రూష చేయకపోతె ఈ పరిపూర్ణ బోధను నేనెంత బాగుగ చదివినను తెలుసు కొనజాలరు నామాట యందు మనస్సునుంచి చక్కగా వినుము అదెట్లంటె వర్షకాలములో వర్షించెడి ఒక వర్షబిందువైన మిట్టప్రదేశములో నిలువజాలదు యిది నిశ్చయమని తెలుసు కొనుమని భావము.

ఇతి, శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహితపరమ తత్వే గురుశిష్యోభయ లక్షణంన్నామ షోడశోధ్యాయః. ॥౧౬॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు
( గురుశిష్యో భయలక్షణం ) అను
పదహారవ అధ్యాయము

—(౦)—

## —: ౧౭ గురు దత్తాభయ దానం ౧౧ :—

౨౬౦ కం॥ నన్నాశ్రయించినావని, యన్నాయీబోధనీకు అతుకుట కొరకై, యెన్నో యుక్తులజెప్పితి, విన్నావా దీన్నినీవు విడువాకెప్పటికీ, నాయాజ్ఞాను, గడువాకెప్పటికీ, ననునీవునిన్ను నేగన్నా పెళ్ళేట్టిదో, ననునీవు విడలేవు నిన్ను నే విడలేను, విడువాకెప్పటికీ, నాయాజ్ఞాను, గడువాకెప్పటికీ॥ ॥౧॥

ఓ నాయనా! నన్ను నీవు ఆశ్రయించితివని నీ మనస్సునకు పట్టేనిమిత్తమై దృష్టాంతదార్ష్టాంతములతో యీ బోధను నీకు ఉపదేశించితిని వింటివిగదా దీనినెప్పుడు మరువకుము నాయాజ్ఞ మితిమీరకుము నన్నునీవు నిన్నునేను చూచినకాలము యెటువంటిదో కానినన్ను నీవునిన్ను నేనువిడచియుండ లేకుండనున్నామని భావము.

౨౬౧ కం॥ పతియెనను సతియెనను, నతిసాహస పరులుగాక యాంతర్యమునన్, రతిచేళ్ళ లజ్జపడ సం, తతి గలుగదు చూడుమట్ల తగదులజ్జించా, గురుశిష్యులు, తగులజ్జనొంచా, మతిని నీవిట్లు సమ్మతిజేసియేయె సం, గతి నన్నుడుగుము బోధ స్థితి నీకుదృఢపరతు, తగదూలజ్జించా, గురుశిష్యులు, తగులజ్జనొంచా॥

ఓ శిష్యుడా! భార్యభర్తలు ధైర్యములేకుండ మనస్సుతో క్రీడాసమయములందు సిగ్గును పొందితె సంతానము గలుగదు అట్లనే గురుశిష్యులు బోధోపదేశ కాలమందు సిగ్గుపడకూడదు నీ హృదయమును స్థిరపరచుకొని యేవృత్తాంతమునైన నన్నడుగుము బోధస్థితిని నీకుచక్కగా బోధింతునని భావము.

౨౬౨ కం॥ రతికొరకు గాదె సతిపతి, కతిహితమతి సేవజేయు నటువలెబోధ, స్థితినీకు కుదురుటకు సమ్మతితో గురుసేవజేయు మానీతివంతా, అభిమానాము, పోనినీదంతా, అతినీకిదయ వస్తె అకనిమిషమున బోధ, స్థితినీకుదిరించు సిగ్గు విడచికొల్వు, మానీతివంతా, అభిమానాము, పోనినీదంతా॥ ॥3॥

ఓ శిష్యుడా! భార్యప్రేమతో తన సౌఖ్యముకొరకే భర్తకుసేవజేయునట్లు నీకుబోధస్థితి అలవడుటకు ప్రేమతో గురువును సేవించుము బుద్ధి

మంతుడా! నీ అహంకారము నంతను వదలుము ఆ సద్గురు మూర్తికి దయగలిగితె అరనిమిషకాలములో నీకు బోధస్థితిని అనుకూలింప జేయునని భావము.

౨౬౩ కం॥ నీమానసమున సంశయ • మేమాత్రిము నిల్పబోకు మిక నాతోడే • నామాట నిశ్చయమునే • నేమాత్రిము దాచలేదు నీతోడుసుమ్మీ • యింతకుమిక్కి • లిగలేదు లెమ్మీ • నామీదతలపుంచు ననుమరువ కిక నేను• నీమీద దయవుంతు నిజమిందుకిదె వొట్టు నీతోడు సుమ్మీ • యింతకుమిక్కి • లిగలేదుసుమ్మీ॥

ఓ శిష్యుడా! నీమనస్సులో సందేహ మేమాత్రము నుంచుకొనకు నాతోడేసుమా నామాట నిజము నేను యీ పరిపూర్ణబోధలో నేనెంతమాత్రము రహస్య ముంచలేదు నీతోడు యింతకన్న గొప్పదివేరె యేమిలేదు లెమ్ము నన్ను మరచిపోకనామీద తలంపు యుంచుము నేను నీమీద అనుగ్రహము యుంతును యిదినిజము దీనికి యిదె ఒట్టు నీతోడుసుమా అని భావము.

౨౬౪ కం॥ నీగురుబోధను నీచే • బాగుగవిని నిందజేయు భ్రష్టుల మాటల్ • లోగొని విడచేవిది నీ • కేగురు డీలాటి బోధనెరిగించడోయీ • యెరుకలోదె • యెరిగించునోయీ • ఆగురుబోధలన్నీనే దెలిసుండి • నాగురు బోధ నేనయముగ నీకిస్తి యెరిగించడోయీ • యెరుకలోదె • యెరిగించునోయీ॥ ॥౫॥

ఓ శిష్యుడా! నీవుచెప్పె గురుబోధను బాగుగవిని దూషించుచుండెడు దుర్మార్గుల మాటలునమ్మి యీ గురుబోధను విడువకు నీకు యేగురువు కూడ యిటువంటిబోధను బోధించడు యెరుకలో నుండెడి భ్రాంతిమార్గములే బోధించును ఆయొక్క గురువులబోధలను తెలుసుకొని నేను నాగురుబోధను నీకు తెల్పియుంటినని భావము.

౨౬౫ కం॥ నిక్కముగ బీరపీచుల • చిక్కుసుమీ విచ్చరాదు చీ యీ యెరుకన్ • మక్కువనే బోధించిన • చక్కని బోధాగ్నిచేత సాధించు పోరా • విచ్చేచింత • చాలించుకోరా • చొక్కమౌ యీ బోధ కెక్కడ యీడౌను • తక్కినబోధాల దిక్కుజూడక దీన • సాధించుపోరా • విచ్చే చింత • చాలించుకోరా॥ ॥౬॥

ఓ శిష్యుడా! ఈయెరుక బీరకాయ పీచువంటిది యీచిక్కును నిజముగా విడదీయరాదు ప్రేమగానేను బోధించిన అందమగు యీ పరిపూర్ణబోధయను అగ్నిచే సాధించుకొనుము ఆ యెరుకయను చిక్కును విచ్చవలయునను ఆలోచన జేయకుము నిర్మలమైన యీ బోధకు సమానమైనది యెక్కడలేదు ఇతరా బోధలను వదలుకొనుమని భావము.

౨౬౬ కం॥ అడివి పుశిరికాయు జలనిధి • బొడమినలవణం బటంచు బొగడినరీతిన్ • పుడమిని యీ స్థలమందున • కడువేడుక నీవునేను గలసూట వినరా • నీనా ప్రేమ • గలసెగన్గానరా • విడలేవు నీవు నన్ను విడలేను నేనిన్ను • పొడజూచి నీవు నేనెక్కడబోక నిలచిట్లు • గలసూటవినరా • నీనాప్రేమ • గలసెగన్గానరా ॥౭॥

ఓ శిష్యుడా! అరణ్యములో కాసిన పుసిరికాయయు సముద్రములో బుట్టిన ఉప్పును కలసినట్లు నీవునేను యిచ్చోట సంతోషముతో కలిసితిమి నీకు నాకు భక్తి విశ్వాసములుగూడ కలిసినవి నీవునేను విడచి పోలేము నీవు నన్ను నేనునిన్ను చూడగానె యెచ్చటికి పోకుండ నిలచియుంటిమని భావము.

౨౬౭ కం॥ పెద్ధలనింద యొనర్చకు • పెద్దల సేవించుకొరకు పిరిదివియకు మే • పెద్దలతో వాదించకు • పెద్దలు జెప్పేటి సుద్దిపెద చెవుల వినకూ • పెద్ధలునడిచె • నడకానే మనకూ • పెద్దలకన్న నెపెద్ద నంచనుకోకు • పెద్దలగనుగొన్న ప్రియముతో మ్రొక్కుము • పెదచెవుల వినకూ • పెద్దలు నడిచె • నడకానే మనకూ॥ ॥౮॥

ఓ శిష్యుడా! పెద్దలనిందించకు పెద్దలకు పరిచర్య చేయుటకై నేను దీయకు పెద్దలతో వివాదముజేయకు పెద్దలు చెప్పిన మాటలు శ్రద్ధగా వినుము పెద్దలుయెట్లు నడచినను యేమియనబోకుము పెద్దలకన్న నేనెపెద్దయని గర్వించకు పెద్దలను చూచిన ప్రేమతో నమస్కరించుమని భావము.

౨౬౮ కం॥ పెత్తనమున యేనుంగిల • చెత్తనుదినవలసె చీమచిన్నతనమునే • హత్తుగొని తినును చక్కెర•యిత్తరి యీ రెంట్లో నీకు • యిష్టామేదైతే • చేకొను మదె • స్పష్టామిదైతే • పెత్తనమున చేటె పెంపొందుచుండూను • చిత్తాములో దెలియు • చిన్నతనమె మేలు • యిష్టామేదైతే • చేకొను మదె • స్పష్టామిదైతే॥ ॥౯॥

ఓ శిష్యుడా! పెద్దతనము గలిగిన యేనుగు చెత్తను తినును చిన్నతనముగల చీమ చక్కెరను తినును యిటువంటి పెద్దతనము చిన్నతనము అను యీరెండింటిలో యేదినీకిష్టమో దానిని చేపట్టుము స్వష్టముగా పెద్దతనముచేత కష్టములే ప్రాప్తించుచుండును మనస్సులో ఆలోచించుకొనగా చిన్నతనమే మంచిదని భావము.

౨౬౯ కం॥ తనకు శరణన్న వారల । మనుసెట్టిదో తరచిచూచి మరి తెల్పదగున్ । వినువారికి తగినట్టిది । యని రిట్లు మహానుభావు ఁతిచాతుర్య మునా । వినికని నీమను । సతిచాతుర్యమునా । ఘనమైన యీబోధ కరుణిస్తి దీన్ని । చచ్చేదాక నిదురావచ్చినదాక మరువాకు । మతిచాతుర్యమునా । వినికని నీమను । సతిచాతుర్యమునా ॥ ॥౧౦॥

ఓ శిష్యుడా! తనకు సాష్టాంగనమస్కారము జేసిన మానవులయొక్క స్వభావ మెటువంటిదో పరీక్షించి చూచి వినువారికి తగినట్లుగా యీబోధను చెప్పవలయునని సత్పురుషులు జెప్పిరి నాయనా? నీమనస్సును పరీక్షించి నీమాటలను విని అతిచాతుర్యముతో గొప్పనైన యీబోధను నీకనుగ్రహించితిని యీబోధను నీవు చచ్చునంతవరకు నిదుబోవు నంతవరకు మరువక ధ్యానించుచుండుమని భావము.

౨౭౦ కం॥ చెప్పదగు గురుడు బోధను । చెప్పినపని జేసెనేని శిష్యాగ్రణికిన్ । చెప్పదగదు చెప్పినపని । తప్పనివాదించేనేని దయదల్చిబోధా । యిద్దరికుండ । దగునిట్టిమెధా । చెప్పిముందుగ బోధచెప్పండి పనులన్న । చెప్పాగూడదువాన్ని తిప్పాలబెట్టాక । దయదల్చిబోధా । యిద్దరికుండదగు । నిట్టిమేధా ॥ ॥౧౧॥

ఓ శిష్యుడా! సద్గురుమూర్తి తాను చెప్పిన పరిచర్యను చేయు ఉత్తమ శిష్యునకు ఈపరిపూర్ణబోధను చెప్పవలయును తాను చెప్పినపనులు తప్పుడువి అని యెదిరించి మాట్లాడెవానికి చెప్పగూడదు యీఅభిప్రాయము గురుశిష్యులకు యిద్దరికి నుండవలయును మొదలు బోధను బోధించి తరువాత పరిచర్య

చేయుమని చెప్పండి అనేవానిని శ్రమ పెట్టకుండ బోధను బోధించవద్దని భావము

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే గురుదత్తాభయ దానం న్నామ సప్తదశోధ్యాయః ౧౭॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆదాసు రాజయోగిచే

వ్రాయబడిన భావార్థ సహితములు

( గురుదత్తాభయదానం )అను

పదిహేడవ అధ్యాయము.

-(౦)-

## —: ౧౮ సు జ న ల క్ష ణ ం బు :—

౨౭౧ కం॥ ఇవివినుమనినను సుజనులు । చెవియొగ్గెద రవియుసృష్టి జేసి కృతికిఇల్ । చవిబుట్టించుర దెట్లన । శివుడు కళానిధిని చక్కజేసేన లేదా । నీమదిశంక । బాసేనలేదా । అననిలో శ్రీరాము దవగుణినాహ్య నెవరేమి యనకుండ సవరించి సుగుణిగ । జేసేనలేదా । నీమదిశంక । బాసేనలేదా ॥ ॥౧॥

ఓ శిష్యుడా ! సత్పురుషులు ఈ పద్యములను వినుమనగానే చెవివంచి వినెదరు విని వీటిని విమర్శించి యీ గ్రంథమునకు రుచిని కలిగింతురు అదెట్లనగా (గురుభార్యను పొందిన) చంద్రున్ని శంకరుడు తలయందు ధరియించి చక్కపరచెను నీమనస్సులో సంశయము నుంచుకొనకు శ్రీరామ చంద్రుడు గుణహీనురాలగు అహల్యను జనులు నిందించకుండ బాగుపరచి గుణవంతురాలినిగా జేసెనని భావము.

౨౭౨ కం॥ గురుసూచనైన నరులను । మరిమరి వినుమనుచు జదువుమా పద్యములన్ । గురుసూచన యెరుగని యా । నరులను వినుమనుచు జదువ నగుబాటౌ గదరా । అదియెట్లన్న । యిదిగో దెల్పెదరా । పురుష సంగతి లేనిపోలతి కొక్కోక శాస్త్ర । మరసి మెచ్చునెదాన్ని యతిప్రౌఢ సతివాలె । నగుబాటౌ గదరా । అదియెట్లన్న । యిదిగో దెల్పెదరా ॥ ॥౨॥

ఓ శిష్యుడా ! గురుసూచన తెలుసుకున్న మనుష్యులను మాటిమాటికి మాపద్యములను వినుమని వారిముందర జదువుము గురుసూచన తెలియని మనుష్యులముందర జదివితివేని పరిహాసముగా నుండును అదెట్లంటె యిదుగో నేజెప్పెదవినుము. పురుష సంపర్కములేని స్త్రీ మిక్కిలి ప్రౌఢ స్త్రీవలె కొక్కోక శాస్త్రమును చూచి ఒప్పుకొనదని భావము.

౨౭౩ కం॥ యెవరుంటె యేమిభయముర । సవరింతురు తప్పులుంటె సాధులువిన్నన్ । సవరించనివ్వు మీ విని । యవనీతులు నిందజేస్తె అయ్యేదే మోయీ । అందులో మనది । పొయ్యేదేమోయీ । భవనాశస్థితిలేని పద్ధాతి యీబోధ । చౌరంగవినుపించు చాటేలమాటేల । అయ్యేదేమోయీ । అందులో మనది । పొయ్యేదేమోయీ ॥ ॥౩॥

ఓ శిష్యుడా ! సభలో యెవరున్న యేమిభయములేదు నిర్భయముగా జదువుము (ఈపద్యములయందు) తప్పులయుంటె సత్పురుషులు వింటె సరి జేయుదురు సరిజేయనిమ్ము బుద్ధి హీనులు నిందించిన వారితో నేమియుకాదు నిందించిన మాత్రమున మనకు పొయ్యేది యేమిలేదు ఉత్పత్తి స్థితి లయములులేని పద్ధతిగల ఈపరిపూర్ణబోధను బహిరంగముగా రహస్య మర్మములు లేకుండ వినిపించుమని భావము.

౨౭౪ కం॥ పుట్టిటబిడ్డబహుగా । దిట్టైయుండినను యెవరు దిట్టరు భువిలో । పుట్టింటివారు కోడలు । దిట్టైనను అత్తవారు ఉట్టేరుసుమ్మీ । చేతుల కొద్ది । గొట్టేదుసుమ్మీ । అట్టుంబగనె బహుదిట్టైన శిష్యుని । తిట్టాడు గురుమూర్తి వట్టివారుజూస్తె । తిట్టేరుసుమ్మీ । చేతులకొద్ది । గొట్టేరుసుమ్మీ ॥౪॥

ఓ శిష్యుడా ! ప్రపంచములో ఆడపిల్ల తన పుట్టింటిలో యెంతగడుసుగా నున్నను పుట్టింటివారు యెవ్వరేమనరు కోడలు గడుసుదైతె మెట్టినింటి

వారు ఉడుదురు చేతులతో గొట్టుదురు. అలాగే సమర్థుడైన శిష్యున్ని గురు మూర్తి దూషించడు యితరులు జూచి దూషింతురని భావము.

౨౭౫ క॥ అందముగ ఘనులు మెచ్చెద । రెందుకు మెచ్చెదరు దీన్ని యితరజనంబుల్ । చందురుడు వుదయ మొందిన । సింధువు చెలరేగినట్లు చెలగూనె చెర్లూ । కోనేర్లు నూ । తులు భావులేర్లూ । మందయానలపొందు మగవారెనుతిజేతు । రెందూకు నతిజేతు రిలషండపురుషూలు । చెలగూనె చెర్లూ కోనెర్లు నూ । తులు భావులేర్లూ ॥ ॥౫॥

ఓ శిష్యుడా! ఈ గ్రంథమును పెద్దలు సంతోషముగా నాదరింతురు నీచులు ఆదరించరు అదెట్లంటె చంద్రోదయమైనప్పుడు సముద్రము ఉప్పొంగునుగాని చెర్లు కోనేర్లు నూతులు భావులు యేర్లు వుప్పొంగవు మరియు స్త్రీ సంపర్కమును పురుషులు మెచ్చుకుందురుగాని నపుంసకులు మెచ్చుకొనరని భావము.

౨౭౬ క॥ కాకంబులు సంపూర్ణ త । టాకస్థజలంబు లెట్లు త్రాగక తృషచే । గైకొనునొ కుంభజలము । ల్లీకలియుగమందు దుష్టు లింపుమీర గనూ । నిర్వురుబోధ । కంపూబారిననూ । మీకు దీనికెంకె మాకేంయిట్టి చి । కాకు కొక్కెకమైతె గైకొందుమందూరు । యింపూమీరగనూ । నిర్వురు బోధ । కంపూబారిననూ ॥ ॥౬॥

ఓ శిష్యుడా! ప్రపంచములో కాకులునిండు చెరువులోని నీళ్ళతో దప్పి దీర్చుకొనక కుండలోని నీళ్ళను త్రాగును అట్లే ఈ కలియుగమున దుర్మార్గులు ఈ పరిపూర్ణబోధయొక్క వాసనతగిలితె సంతోషముగా నిలువరు మీకు యీబోధకు సంబంధము మాకు యీచికాకు వద్దు కొక్కెకమైతే సంతోషముగా విందుమందురని భావము.

ఇతి, శ్రీమద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైత రహితపరమ తత్వే సుజన లక్షణంన్నామ అష్టాదశోధ్యాయః ॥౧౮॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే వ్రాయబడిన భావార్థ సహితములు (సుజన లక్షణం) అను పది ఎనిమిదవ అధ్యాయము.

—(౦)—

## —* ౧౯ కుజన లక్షణం ౪ *—

౨౭౭ కం॥ కుచ్చితమతియగు పురుషుని • చెచ్చెరవిను మనుచు జదువ శిష్టులవలె తా • ముచ్చట పాటుగవిన డివి • కుచ్చులకుళాయికుక్క కూనా కెందుకురా • పిడుదుకు దుగ్ధ • పానామెందుకరా • హెచ్చైన ముత్యాలు పచ్చాల పతకాము • గ్రుచ్చిపేరుగ జేసితెచ్చి వేసితెకోతి • కూనాకెందు కురా • పిడుదుకుదుగ్ధ • పానామెందుకురా॥

ఓ శిష్యుడా! చెడుబుద్ధిగల మనుష్యున్ని ఈ పద్యములను వినుమని మాటిమాటికి బ్రతిమిలాడి జదివినను సత్పురుషుల వలె ముచ్చట పాటుకైన వినడు కుక్కపిల్లకు కుచ్చుటోపి యెందుకు పిడుదుకు పాలుదాగుటెందుకు గొప్ప ముత్యములు పచ్చలపతకమును కుచ్చి హారముగాజేసి కోతిమెడలో వేసితె దానికెందుకురా అని భావము.

౨౭౮ కం॥ అక్షయబోధస్థితిగల • లక్షణ వేత్తలకు మెప్పులైన కృతులలో • కక్షకుతప్పులు కుమతి ప • రిక్షింపుచునుండు నెన్నొరీతూల వినుమీ • తద్భావమీ • రీతిదికనుమీ • మక్షిక మెప్పూడు మానిసుగంధాదు • లీక్షించువ్రణము ప్రత్యక్ష మెకద యెన్నొ • రీతూలవినుమీ • తద్భావమీ • రీతిదిగనుమీ॥ ॥౨॥

ఓ శిష్యుడా! నాశరహితమైన బోధస్థితిగలిగిన లక్షణములు దెలుసుకున్న మహాత్ములు మెచ్చుచున్న గ్రంథములలో దుష్టబుద్ధిగల వాడు అసూయతో యెన్నోరీతుల తప్పులు వెదకు చుండును ఆ దుష్టుని స్వభావము యిటు వంటిదె అదెట్లంటే ఈగ ఎప్పుడైన పరిమళ వస్తువులను వదలి పుండ్లనే వెదకు చుండును యిదినీకు అనుభవమే కదా అని భావము.

౨౭౯ కం॥ రమ్మని పిలువనిదే ప • ద్యమ్ములు జదువంగవచ్చి యతి నిందించున్ • సమ్మతిగాక కుమతివిని • యిమ్మహియది యెట్లనన్న నిట్లానే

వినుమీ • వానిబుద్ధి • దట్లానె కనుమీ • బొమ్మలాటలొాదిచ్చు బొమ్మతా నొకటి ఛీ • పొమ్మని యనినా హాస్యమ్మొనర్చుదెపోక • నిట్లానె వినుమీ • వానిబుధ్య • దట్లానెకనుమీ॥ ॥3॥

ఓ శిష్యుడా! ప్రపంచములో కుచ్చితబుద్ధిగల మనుష్యుడు రమ్మని పిలువకముందే పద్యములు జదువుచుండగ తనంతట తానె వచ్చి తనకిష్టము గాక అనేకముగా దూషించును అదియెట్లనన్న యిట్లనే వానిబుద్ధి గట్లనే ఉండును అదెట్లంటె బొమ్మలాటలోదిచ్చు బొమ్మ అనె ఒక బొమ్మను యితర బొమ్మలు పొమ్మంటెపోక ఛీ అని హాస్యము చేయుచునుండునని భావము.

౨౦౦ కం॥ వటియించిన చన్నులుగల • కుటిలాలకి నిందజేయు గుత్త పురవికెన్ • యెటువలె తనతప్పెరుగక • నటువలె గ్రంథమును మెచ్చ దతిదుర్జనుండూ • లేనిదెతప్పు • వెదకూచు నుండూ • యిటువంటి బోధనే నెరిగెదెట్లనుకోక • కటువాక్యములు బల్కి ఘనులగా సిలజేయు • నతిదుర్జ నుండూ • లేనిదెతప్పు • వెదకూచునుండూ॥

ఓ శిష్యుడా! తనతప్పు లెరుగని జారిపోయిన చన్నులుగలస్త్రీ గుత్త పురవికను యెట్లు నిందించునో అట్లనే మిక్కిలి దుర్మార్గుడు గ్రంథమును మెచ్చుకొనడు లేనితప్పులను వెదకుచుండును యిటువంటి పరిపూర్ణబోధను నేనెట్లు తెలుసుకుందును అని ఆలోచించుకొనక ఖండితముగ మాటలాడి మహ త్ములను చిన్నబుచ్చునని భావము.

ఇతి, శ్రీ మద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహితపరమతత్వే కుజన లక్షణం నామైకోనవింశోధ్యాయః. ॥౧౯॥

ఇతి, పుర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు
(కుజన లక్షణం) అను పందొమ్మిదవ
అధ్యాయము.

—(•)—

## —: ౨౦ శిష్యవిజ్ఞాపన లా :—

౨౮౧ కం॥ గురువర మీనాసందున • యెరుకను తెరగలిగియుండె యిన్నాళ్ళగొలెన్ • కరుణారసేక్షణములన్ • తెరదీసితి రెరుకమాట దీరె నిక్కడికీ • చాలునుబోధ • దూరే దెక్కడికీ • పరిపూర్ణమును లేనియెరుకాను జూపించి • యెరుకలేదని యంత్రి యెరుకెలేహాయెను • తీరెనిక్కడికీ • చాలునుబోధ • దూరేదెక్కడికీ॥

ఓ గురూత్తమా! మీనామధ్యలో యెరుకయను తెరయుండెను మీకరుణారస దృష్టితో యిన్నాళ్ళకు తెరను తొలగించితిరి. యెరుకమాట తీరినది పరిపూర్ణబోధ చాలును పరిపూర్ణమును లేని యెరుకను నిదర్శనముగా జూపించి యెరుకనులేదని జెప్పితిరి. యెరుక లేనెలేదని భావము.

౨౮౨ కం॥ ధారుణికొంత జరించి వి • చారించితిగాని యీ విచారము నేనె • వ్వారలు జెప్పగ వినలే • దారయ మీనోటవిన్ననయ్యా గురుమూర్తీ• నాతరమానుతి • జెయ్యామీకీర్తి • సారాసన యనపురారి నీరజబ్భం • దారాకముఖులైన నేరారుమిముదెలియ • రయ్యాగురుమూర్తీ • నాతరమా నుతి • జెయ్యామీకీర్తి॥ ॥౨॥

ఓ గురుమూర్తీ! ప్రపంచములో కొంతవరకు తిరిగి ఆలోచించి చూచితినిగాని మీరు చెప్పినటువంటి యీ పరిపూర్ణబోధను యెవరు చెప్పగవినలేదు మిమ్ముల స్తోత్రము జేయుటకు నాకు శక్తిలేదు హరిహర బ్రహ్మాది దేవతలకు గూడ మిమ్ము దెలియుటకు సాధ్యము కాదని భావము.

౨౮౩ కం॥ ఘటమెదుట బెట్టిచూచిన • యటువలె బయలుండ జూపి యతిమాయంచే • నటియింపుచున్న యెరుకను • తృటిలో విడిపిస్తిరిపుడు దీరెమచ్చుంకా • యికబుట్టాదు • యేరీతిశంకా • యెటుదోచకిలు వెళ్ళియిట మిమ్ముజూచిన • ప్పటినుండి దయజేసిప్పటిదాక బోధిస్తె • తీరేమచ్చుంకా • యికబుట్టాదు • యేరీతిశంకా.। ॥౩॥

ఓ గురుమూర్తీ! యెదురుగా కుండనుబెట్టి ఇదుగోకుండయని జూపించి నట్లు పరిపూర్ణము నుండజూపి అనేక మాయలతో ఆడుచున్న లేనియెరుకను క్షణములో వదలించితిరి యిప్పుడు నాసందేహముదీరినది యికముందు యేసందేహము బుట్టదు యెక్కడ దోచక యింటినుంచి బయలుదేరి యిక్కడ తమను దర్శించి నప్పటినుండి యింతవరకు మీరుభోధించితె నాసందేహము దీరినదని భావము

౨౮౪ కం॥ ఒరులు నేననక నిండిన • దెరిగింపుమదేమొ బయలు యేనొరులనుచున్ • యెరుగునీవెవరు యీ లే • నెరుకను వున్నావు వుంటె యిదిలేవంచనుకో • నేనా నినునీ • మదినీ లేననుకో • యెరిగి యీలేనెరుక యిట్లాలేకుండితె • పరిపూర్ణమో దాన్నె పగిదీగురెరిగేము • యిదిలేనంచ నుకో • నేనానినునీ • మదినీ లేననుకో॥

ఓ శిష్యుడా! పరులు నేను అను బేధము లేకుండ నిండియున్నది యేదో దానిని దెలుపుము శి॥ పరిపూర్ణము. గు॥ నేనుపరులు. అని దెలుపునట్టి నీవే వరు. శి॥ యీ లేనియెరుకను. గు॥ ఉన్నావు. శి॥ ఉంటె యిదిలేననుకో. గు॥ నేనో. శి॥ నిను నీమనస్సులోలేననుకో. గు॥ యీ లేనియెరుక యీరీతిగ లేకుంటె పరిపూర్ణమో. శి॥ దానిని యెట్లు తెలుసుకుందుమని భావము.

౨౮౫ కం॥ నాబుద్ధికి సరిపడ్డది • నీబుద్ధే కానియెన్ని నేర్పుల గనినన్• ఛి బుద్ధులయాబుద్ధులు • నాబుద్ధికి మెప్పురావు నాతండ్రి వినరా • శాబాసు ని • న్నె తండ్రి గనెరా • యీబుద్ధినిక మానకే బుద్ధిబూనాకు • యేబుద్ధి బూనీన నీబుద్ధి చెడిపోవు • నాతండ్రి వినరా శాబాసు ని • న్నె తండ్రిగనెరా॥ ॥౫॥

ఓ శిష్యుడా! యెన్నితీర్లు పరీక్షించి చూచినను నాబుద్ధికి సరిగా నున్నది నీబుద్ధియేసుమా పామరుల బుద్ధులు నాబుద్ధికి నచ్చవు శబాసు నాయనా నిన్ను యేతండ్రి కన్నాడురా యీబుద్ధిని విడవకుము యితరమైన బుద్ధిని పొందకుము యేబుద్ధి పొందినప్పటికి నీబుద్ధి చెడిపోవునని భావము.

భద్రముగా దాచుకొనుము సర్వదా చూచుకొను చుండుము యే మనుష్యుడైన యీ పరిపూర్ణబోధ నడిగితె ఆ మనుష్యుని హృదయము తెలుసుకొనక బోధించకుమని భావము.

ఇతి, శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే శిష్యవిజ్ఞాపనం నామ వింశోధ్యాయః ॥౨౦॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి అగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు
(శిష్యవిజ్ఞాపన) అను ఇరువదవ
అధ్యాయము.

— (౦) —

## -: ౨౧ గ్రంథ పూర్తి :-

౨౮౯ కం॥ కూడి గురు శిష్యులిద్దరు । వేడుకతో బ యలువున్న విధ మెరి గెరుకన్ । వీడిరిది లేనిదని మా । టాడుట కికయేమి దోచ దదియేమొ కానీ । వింటిరెమీర । లిది యిందులోనీ । జాడమీకెరుకాని వేడీతి వినుమంచు । యీడికి సరి ముచ్చటాడూట కికదోచ । దదియేమొకానీ । వింటిరెమీర । లిది యిందులోనీ ॥ ॥౧॥

ఓ జనులారా ! సంతోషముగ గురుశిష్యు లిద్దరు కలసి పరిపూర్ణము యున్నరీతిని దెలుసుకొని యెరుకను లేనిదని వదలిరి. అదేమొకాని మాట లాడుటకు యేమియు తోచదములేదు మీరు యీ గ్రింథమును వింటిరి ఈ గ్రింథములోని అభిప్రాయము మీకు తెలుసునని మిమ్ముల వినుమని కోరితిని యిక్కడికి సంపూర్ణమని భావము.

౨౯౦ కం॥ శర శాస్త్రస్వర హిమకర (౧౭౬౫) పరిమిత మైనట్టి శాలివాహన శకమం । దరయగ శోభకృదను వ । త్సర మార్గశిరంబు కృష్ణ చవితినాటికి నీ । పద్యాల్పది ద । క్కువ మున్నూటికినీ । మురయూమ

జేస్తి నెవ్వరువిన్న చదివీన । పరిపూర్ణ మెరుకై లేనెరుక లేకుండానె । చవితీ నాటికినీ । పద్యాల్పదిద । కృ్కవ మున్నూటికినీ ॥ ॥౨॥

ఓ జనులారా ! పదిహేడువందల అరువై అయిదవ సంఖ్యగల శాలి వాహన శకమునకు సరియగు శోభకృతు నామసంవత్సర మార్గశిర బహుళ చవితినాటివరకు పదితక్కువ మున్నూరు (౨౯౦) పద్యములను సంతోష ముగ జేసితిని ఈ పద్యములను యెవ్వరు విన్నను చదివినను పరిపూర్ణము దెలిసి లేనియెరుక లేకుండునని భావము.

౨౯౧ కం॥ ఏపురుషుడు గురువర్యుని । శ్రీపాదము బట్టలేదొ సేలుగ నాతం । డీ పుస్తక మునుజూచిన । యేపట్టుననిలువ కేగునిది నిజమయ్యా। నరులారమీ ।మది దెలియరయ్యా । యీపరమ గోప్యాము యెవరెరుగరో యయ్య । నాపలుక్కు మదిలోన నాటీనవారికె । యిదినిజమయ్యా । నరులార మీ । మది దెలియరయ్యా ॥ ॥3॥

ఓ జనులారా ! యే మానవుడు సద్గురుమూర్తి పాదములను ఆశ్రయించడో ఆ మానవుడు క్రమముగా ఈ గ్రంథమును చూచెనేని లేనియెరుక యెచ్చట నిలువకుండపోవును యిది యదార్థము. అని మీమనస్సులో తెలుసు కొండి ఈపరమరహాస్యము యెవరు తెలుసుకొనజాలరు. నామాట నమ్మిన వారికె యిది యథార్థమౌనని భావము

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే గ్రంథపూర్తిర్నామ ఏకవింశోధ్యాయః. ౨౧॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు
(గ్రంథపూర్తి) అను ఇరువ
దొక్క అధ్యాయము.

—(౦)—

## —: ౨౨ గ్రంథసమాప్తి ౧ :—

౨౯౨ కం॥ ఎరుక నెరుంగని బయలులో । గురుడును శిష్యుండు వారిగొడవయు నే మీ । కెరిగించిన వన్నియు మీ । కెరిగినవన్నియును మీర । లేను నుళ్ళక్కి । పుళ్ళక్కితా । నెప్పుడుళ్ళక్కి । మరియింక మాటాడ మాటేలేదాయెను । సరిపాయె సరిపోతెసరిపాయె సరిమీర । లేను నుళ్ళక్కి । ఉళ్ళక్కి తా । నెప్పుడుళ్ళక్కి ॥ ॥౧॥

ఓ జనులారా ! యెరుకను తెలియని పరిపూర్ణములో గురువును శిష్యుడును వారిద్దరి వాదోపవాదములను నేను మీకు జెప్పిన వన్నియును మీరు తెలుసుకున్న వన్నియును మీరును నేనును అబద్ధమేసుమా ? ఆ అబద్ధము సర్వదా అబద్ధమే తరువాత మాట్లాడుటకు మాటయేలేదు యెరుక మరుపులు పోయెను యెరుకమరుపులు పోతె సంపూర్ణము సమాప్తి అని భావము.

ఇతి, శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే గ్రంథసమాప్తి నామ ద్వావింశోధ్యాయః. ॥౨౨॥

ఇతి, పూర్ణానంద వాడపల్లి అగదాసు రాజయోగిచే
వ్రాయబడిన భావార్థ సహితములు
(గ్రంథసమాప్తి) అను ఇరువది
రెండవ అధ్యాయము.

సీ॥ శ్రీకర లోకప్రసిద్ధి కెక్కినవోరు । గల్లునివాస గ్రగణ్యుడైన । పరమ భక్తుడు వాడపల్లి పాపయసతి । కనకమాంబకుబుట్టి కాంక్షమీర । రత్నమాంబను ధర్మపత్నిగా జేపట్టి । జననమరణభ్రాంతి ఝుకుపుదీర । వరనేతి వేంకటేశ్వరులను సేవించి । పరిపూర్ణభావంబు నెరిగినట్టి । అగదాసుడ రాజయోగిపూర్ణానంద । ఆఖ్యుండనై పెద్దలాజ్ఞబూని॥

1871

గీ॥ చంద్ర గిరి కరి శశి (౧౮౭౧) సంఖ్య శాలివాహ । శకమునను విరోధాబ్దివై శాఖశుక్ల । దశమినాటికి కందార్థ దర్వులకును । వ్రాసితిని గురు దయను భావార్థములను॥

శ్రీసీతారామాయనమః

క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత

# ప ర మ త త్వ కం ద ము లు

భా వా ర్థ స హి త ము లు.

కం॥ ఈకల కందములను విను
డోకల నరులారమీకు • ఒప్పిదమైనఁ
నేకలగనుక రచించితి
యాకల మోక్షమును జెంద • నగునివి వినినఁ 1॥

నేను అను కలలోనున్న ఓ మానవులారా! నేను అను కల రూపమును తెలియజేయు యీ కందపద్యములను మీరు వినుటకు యిష్టపడితె వినండి నేను అనునది కల కాబట్టి వ్రాసితిని ఈపద్యములను వింటె ఆ నేను అను కల తొలగిపోవునని భావము.

కం॥ మాటలేనట్టి బయలున
మాటగలిగెననుట వినుట • మాయగదయ్యా
మాటమాయైతె మానెను
మాటను మాట్లాడిమనము • మానుది మవలఁ. 2॥

పలుకులేనిపరిపూర్ణములో పలుకుగలిగినదనుమాటను మనము వినుటయే మాయయని తెలుసుకొనండి మాటమాయయై నప్పటికి మొదలు ఆమాటనుమాట్లాడి తరువాత వదలుకుందామని భావము.

కం॥ ఏకందము కాకందమె
మాకంద ఫలరసరుచిని • మరిపించురుచిఁ
మీకందములై నను విను
డీకందములన్ని సత్క • వీంద్రుల్లారా. 3॥

ఓ కవీంద్రుల్లారా! ఈ గ్రంథములోని ప్రతిపద్యము తియ్య మామిడి

పండ్లరసమునందుండె రుచిని మరిపించును. మీకు చక్కగా వినవలయునను తలంపుయుంటె యీ పద్యముల నన్నింటిని వినండని భావము.

కం॥ నే ఛందము జదివెరుగను
నా చందంబిదియు గురుని • నమ్మి రచిస్తిఁ
యీ చందపు పద్యములను
చూచందరు నగక ధిద్ద • జోరుడి సుకవుల్॥ 4॥

నేను ఈగ్రంథము వ్రాయుటకు తగిన చందస్సును చదువ లేదు కాని నా విషయ మిదిగదా సద్గురుమూర్తి కటాక్షము చే వ్రాసితిని ఇటువంటి పద్యములను చూచి పరిహసింపక సత్కవులగు మీరు సవరించుడని భావము.

కం॥ కథగాదు జననమరణ
వ్యథమానుటకై రచిస్తి • వరకవులారా
మథియించి చూచిదిద్దుడి
పథమేమాత్రంబు దప్పి • పారకయుండఁ॥ 5॥

ఓ కవిశ్రేష్ఠులారా! ఈగ్రంథమును ఒకకథ ననుసరించి వ్రాయలేదు. జనన మరణ దుఃఖములు పోవుటకై వ్రాసితిని దీనిని విమర్శించిచూచి మార్గము తప్పిపోకుండ దిద్దుడని భావము.

కం॥ తక్కువ పాండిత్యముచే
నిక్కి పండితులు మెచ్చ • నేరరు వీటిఁ
యెక్కువ పాండిత్యముగల
చక్కని పండితులు మెచ్చి • సరెనన్నట్లఁ. 6॥

పాండిత్యములేకుండ పండితులమని నీల్గెడు అల్ప విద్వాంసులు ఈ గ్రంథమును చూచి సంతోషించరు మిక్కిలి పాండిత్యముగల మంచిపండితులు సంతోషింతురని భావము.

కం॥ సూరిజనులె యీగ్రంథపు
సారముగను వారుగాని • సంసారమహా

ఘోరవారాసి జేరిన
వారలువిని దీన్నిజూచి • వచియింపుదురే. 7॥

విజ్ఞానముగల మానవులు మాత్రమే ఈగ్రంథ సారముజూచి విచారింతురు కాని భయంకరమగు సంసార సముద్రములో నున్న పామరులు దీనిని చూచి విచారించరని భావము.

కం॥ గొప్ప ప్రతిష్ఠకు మిక్కిలి
తిప్పలబడు నృతతికెపుడు • దీరదువిన నీ
యొప్పుల కుప్పగు బోధను
తప్పక నామాటనమ్మ • దగు తప్పనకః. 8॥

పెద్దకీర్తి ప్రతిష్ఠలను పొంద వలయునని ఆశించె మానవులకు యీ చక్కని బోధవినుటకు తీరకయుండదు నేను చెప్పె యీమాట అబద్ధమని యనుకోకండి సత్యమని భావము.

కం॥ మెప్పైనబోధగల మా
యప్పలు తప్పుంటె దిద్దు • డది నాకిష్టం
బిప్పగిది కందముల నే
జెప్పితి యీకవితజూచి • శిచిముడి పడకః. 9॥

సిద్ధాంతమగు పరిపూర్ణబోధగల (యీపద్యములను) మాతండ్రులగు మీరు తప్పులుంటె దిద్దండి నాకు అదియిష్టము ఈప్రకారముగా కందపద్యములను చెప్పితిని యీకవిత్వముకు చూచి కోపగించక దిద్దుడని భావము.

కం॥ ఒకసారియైన వినకః
వికవిక నవ్వేటి కు కవి • వేత్తల్లారా
ప్రకటించక మీ శౌర్యం
బికదాచుటమీకు మాకు • హితమై యొప్పుః॥ 10॥

ఓ కుకవుల్లారా! ఈపద్యములను ఒకపర్యాయము గూడవినక పకపక నవ్వకండి మీ పరాక్రమమును చూపించక యుండుటయే మీకును మాకును మంచిగా యుండునని భావము.

కం॥ స్వచ్ఛాన్వయ గుచ్ఛములని
పృచ్ఛయొనర్చెదరు కవులు • పృథుయశులారా
యిచ్ఛజనించిన జదువుడి
యచ్ఛాపద్యంబులివ్వి • యాసాంతముగాఁ. 11॥

ఓ మంచికీర్తి గలమానవులారా! సత్కవీంద్రులు ఉత్తమ వంశమునకు పూలగుత్తులవంటివారని ప్రశ్నించుచుందురు మీకుయిష్టమున్నచో ఈమంచి పద్యములనుపూర్తిగ జదువుకొనండని భావము.

కం॥ తక్కిన బోధలవలె నిది
చిక్కులుగల బోధగాదు • చేపట్టదగుఁ
మక్కువతో మీ మునుపటి
చిక్కుల బోధలను చూనఁ • జెక్కి ముదమునఁ. 12॥

ఇతరమతస్తులు బోధించె బోధలవలె యీబోధ చిక్కులు గలదికాదు కాబట్టి మీరు ప్రేమతో యీబోధనుగ్రైకొనండి మీరు పూర్వము ఉపదేశము బొందిన చిక్కులుగల బోధలను సంతోషముగా చూరులో పెట్టం (విడువం) డని భావము.

కం॥ సకలకార్య ప్రయత్న
జనకమగు వస్తువును బట్టి • నలచివైచుదీ
న్నొకసారి వినిన చదివిన
నికనింతకు యెక్కువైన • వేబోధలయా॥ 13॥

ఈ గ్రంథమును ఒకసారి వినిన చదివినయెడల నన్నికార్యములను చేయుటకు మూలకారణమైన వస్తువు (అహం)ను పట్టుకొని పొడిపొడిగా నలచి వేయును. గనుక యింతకన్న యెక్కువది యేబోధ కాదండని భావము.

కం॥ కేరుచు మిము వినుమని నే
సారెకు మీచుట్టుదిరిగి • సన్నుతిజేసే
తోరపుబోధకు మూలం
బైరెవ్వరో వార్నిదలచి • వరుసనుతింతుఁ. 14॥

ప్రేమగానప్పుడు మిమ్ముల వినునని మాటిమాటికి మీవద్దికివచ్చి ప్రార్థించె యీనిర్మలమగు బోధకు యెవరు కారణమో వారిని నేను స్తోత్రము జేయుదునని భావము.

కం॥ ఈక్షితి శివరామాహ్వయ
దీక్షితులకు బోధజేసి • దిద్దినసామ్యా
దక్షుని శ్రీధరమూర్తిని
నిక్షేపముగా దలంచి • నేవినుతింతున్. 15॥

ఈ ప్రపంచములో శివరామ దీక్షితులకు (ఈపరిపూర్ణ బోధను) బోధించి దిద్దు పాటుజేసిన శ్రీధరస్వామిని ప్రేమతో ధ్యానించి నమస్కరింతుననిభావము.

కం॥ దక్షిణామూర్తి యనదగు
నీక్షితి శివరామనామ • దీక్షితులనుచున్
వీక్షింతు రార్యులతని క
పేక్షను దండములుబెట్టి • ప్రేమనుతింతున్. 16॥

ఈ ప్రపంచములో దక్షిణామూర్తి స్వరూపుండని పెద్దలెల్లరు పొగడిన శివరామ దీక్షితులకు భక్తితో నమస్కారములు జేయుదునని భావము

కం॥ ఆదీక్షితుల కృపకు దా
పాత్రై యప్పయ్యమంత్రి • పరియించెను యీ
మేదిని తద్బోధ నని
పాదములకు నుతులొనర్చి • ప్రార్థింతుమదిన్. 17॥

ఆ శివరామదీక్షితులవద్దబోధనుపొంది వారికృపకు పాత్రుడైన అప్పయ్య మంత్రి పాదములకు నమస్కరించి ప్రార్థించెదనని భావము.

కం॥ నుతిజేసెద నప్పయ్యన్
గతికై కొల్చితడు బోధ • గనెనో నేనా
ప్రతిలేని పరుశురామ
క్షితిసురవంశ మణియైన • సీతాపతికిన్॥ 18॥

అప్పయ్యమంత్రిని తన సద్గతికై ఆశ్రయించి బోధనుపొందిన ఉపమానరహితుడగు బ్రాహ్మణ శ్రేష్ఠుడైన పరుశురామ సీతారాములకు నమస్కరింతునని భావము.

కం॥ బుచ్చి వెంకమ్మ తల్లిని
దెచ్చెర పెండ్లాడి కాశి • సేతువదాకన్
విచ్చల విడియెగజల్లెను
సచ్చరితుల కచలబోధ • సాకల్యముగాన్. 19॥

బుచ్చి వెంకమ్మయను నామెను పెండ్లి జేసుకొని ఈపరిపూర్ణబోధను కాశి సేతువులవరకు సత్పురుషులకు బాగుగా దెలియునట్లు ప్రచారము జేసెనని భావము.

కం॥ ఆసీతాపతి నతివి
శ్వాసమునం గొల్చికొంటి • సర్వేశ్వరుడం
చీసద్బోధను తేటగ
జేసితి నివి సకలజనులు • చెవియొగ్గవినన్. 20॥

అట్టి పరుశురామ సీతారాములను సర్వేశ్వర స్వరూపుడని భావించి ఆశ్రయించి సమస్తజనులు తెలుసుకొనునట్లు ఈబోధను తేట తెల్లముగా వ్రాసితినని భావము.

కం॥ భాగవత వంశభవుడను
భాగవతోత్తముల పాద • పద్మంబులకున్
సాగిలి మ్రొక్కెడువాడను
బాగుగ నను జనులు కృష్ణ • భట్టందురిలన్ 21॥

భాగవత వంశములోబుట్టి పెద్దలపాదములకు సాష్టాంగ నమస్కారము గావించువాడనగు నన్ను ఈప్రపంచములో కృష్ణభట్టు యనిపిలతురని భావము.

కం॥ ధారుణ్యత్య నసూయలు
పేరేచని జనులు బొగడ • వెలసినవారల్
నారాయణ జానకియను

వారియవ్వరుగన్నయట్టి • వాడనుసుమ్మీ 22॥

వీరు అత్రి అనసూయ వంటివారని ప్రపంచములోని జనులందరు పొగడుచుండెడి నారాయణ జానకమ్మలను దంపతులకు జన్మించితినని భావము.

కం॥ అనే నొనర్చినాడను
యీనిజకందముల గ్రంథ • మెప్పుడుదీనిన్
వీనులవిని కన్నులగని
రేనట్టి జనంబులుల్క • లేనే ననుచున్. 23॥

అట్టి నేను యథార్థమును బోధించు కంద పద్యములుగల ఈ గ్రంథ మును వ్రాసితిని దీనిని చెవులారవిని కన్నులార చూచినట్టి జనసమూహము నేను అనె పలుకును పలుకకుండ నుండునని భావము.

కం॥ చిల్లర బోధలనన్నిటి
నొల్లరు నిజబోధ దెలిసి • యొప్పెటి పెద్దల్
పొల్లనియందుకె నేనవి
వల్లక యీబోధయందె • వర్తిస్తినుమీ. 24॥

సత్యమగు పరిపూర్ణబోధదెలిసిన మహాత్ములు యితరబోధలు పొట్టు వంటివనివాటిని విడతురు కాబట్టి నేను ఆచిల్లర బోధలను చేపట్టక ఈబోధ లోనే యున్నాననిభావము.

కం॥ గురుశిష్యుల మాటలవలె
పరిపూర్ణపుబోధ కంద • పద్యఫణతిచే
విరచిస్తి వినుడి ముందర
జరిగే ముచ్చట్లుమీకు • సహ్యంబైనన్. 25॥

గురుశిష్యసంవాదమువలె పరిపూర్ణబోధను కందపద్యాలుగా వ్రాసితిని ముందు ఈ పద్యములలో చెప్పెమాటలు మీకు యిష్టముంటె వినండని **భావము.**

కం॥ సకల నిగమాగమాది
ప్రకరమహా నారికేళ • ఫలసారము దీ

సొకగ్రంథముజేసితి లో
కికజను లోకవేళఁ గొన్న • కీడుఁ దొలంగుఁ. 26॥

వేదవేదాంతముల యందన్నిటిలోనుండు నారికేళ పాకమువంటి సారమునుదీసి ఈ గ్రంథమును రచియించితి దీనిని పామరజనములు జదివితె ఆపదలు పోవునని భావము.

కం॥ తనకుదావచ్చి సద్బో
ధనుదెల్పుమటంచు మ్రొక్కు • తనశిష్యునకుఁ
వినజెప్పదొడగె నొకగురు
డను మానించకను వాని • కతిదయతోడఁ. 27॥

తనంతట తానువచ్చి పరిపూర్ణబోధను దెలుపుమని నమస్కరించిన తనశిష్యునకు ఒక గురుమూర్తి మనస్సులో యేమి అనుమానము లేకుండ దయతో బోధించ నారంభించెనని భావము.

కం॥ పరమ పురుషుడును లేనిది
యెరుకయు గలదరసి లేని • యెరుకను విడుమం
చెరిగించిన శిష్యుఁడు గురు
వరు నడిగెను మ్రొక్కి రెంటి • వర్తన లపుడుఁ, 28॥

పరమ పురుషుడు (పరిపూర్ణము) లేనియెరుక అనునవి గలవు ఈ రెండింటిని తెలుసుకొని లేనియెరుకను విడువుము అని జెప్పిన శిష్యుడు గురువర్యునికి నమస్కరించి ఈరెంటి లక్షణములను తెలుపుమని అడిగెనని భావము.

కం॥ పరమ పురుషుడన నెవ్వడొ
యెరుకెట్టిదొ తెల్పియపల • యెరుకను విడిచే
తెరవెట్టిదొ యిన్నియు నా
కెరుగించు మటంచు బల్క • నిట్లనె గురుడుఁ. 29॥

పరమ పురుషుడనగా నెవ్వడు లేనియెరుక అనగానేమి ఈ రెండింటిని తెలిపి యెరుకను విడచిపెట్టె మార్గము నాకుబోధింపుడని శిష్యుడు అడుగగా సద్గురు విట్లనియెనని భావము.

కం॥ నేపెద్దలచే విన్నది
నీపైదయ బుట్టిచెప్ప • నే బూనితినీ
కాపద్ధతి నంతయు విని
యేపద్ధతికాశపడకు • మిది విడువకుమీ. 30॥

ఓ శిష్యుడా! నేను పెద్దలవలన విన్నదానినంతయు నీయందు దయ గలుగుటచె చెప్పుచుంటిని నీనామార్గమునంతయువిని యితర మార్గములకు ఆశపడకు దీనిని విడువకని భావము.

కం॥ కదలడట పరమపురుషుడు
కదిలికమాయయట యిట్టి • కదిలిక కేదో
మొదలన పెద్దలుబల్కిరి
కదలనిదేకలదు లేదు • కదిలికయనుచుఁ. 31

ఓ శిష్యుడా! పరమపురుషుడు అచలుడు చలనముమాయ ఈ॥ మాయకు మూలకారణము లేదని మహాత్ములు జెప్పిరి అచలమే ఉన్నది చలనము (మాయ) లేనిదని భావము.

కం॥ పురుగుకుక్క స్తంభంబును
కొరికినదన వీతిహోత్రుగొని • మ్రింగెచదల్
ధరననినను మాయాసతి
హరిని చికాకుగయొనర్చె • ననవినదగునే. 32॥

ఓ శిష్యుడా! ప్రపంచములో ఉక్కుస్తంభమును పురుగు కొరకినది నిప్పుకు చదలుపట్టినది హరిని (పరిపూర్ణమును) మాయ చికాకు పరచినది అను మాటలు వినగూడదని భావము.

కం॥ హరియందుదోచు విశ్వము
నరస్వప్నమువంటిదనిరి • నానాజనముల్
సుర స్వప్నమువంటిదియనె
స్థిరమతి శివరామనామ • దీక్షితులు ధరఁ. 33॥

ఓ శిష్యుడా! హరి (పరిపూర్ణము) అందుతోచిన ప్రపంచముమానవ స్వప్నమువంటిదని అనేకులు జెప్పిరి ఆస్వప్నమునే దేవతాస్వప్నము

వంటిదని స్థిరబుద్ధిగల శివరామదీక్షితులు చెప్పిరని భావము.

కం॥ సురలందు దోచుస్వప్నము
హరియందున దోచువిశ్వ • మాసురలహరిఁ
యెరిగినకల విశ్వము తా
మరుగవె తమలేమినెరిగి • యితిబిడియమునఁ. 34॥

ఓశిష్యుడా! దేవతలయందు కనపడె స్వప్నము హరియందు కనపడె ప్రపంచము ఆ దేవతలను హరిని తెలుసుకున్న కలవిశ్వములు రెండును తమ లేమిని గుర్తించి తమంతట తామే మిక్కిలి సిగ్గుతో బోవునని భావము.

కం॥ కదలనిది కదలదెన్నడు
కదిలికగల దనినదాని • కగుపడదుమొదల్
కదిలికలేదది గావున
యిది పరమరహస్య మెవ్వ • రెరుగరు దీనిఁ. 35॥

ఓ శిష్యుడా! చలనములేనిది సర్వదాచలించదు చలనముగలదన్న దానికి మూలములేదు చలనము లేదదికాబట్టి పరమరహస్యమైన దీనిని యెవ్వరు దెలుసుకొన జాలరని భావము.

కం॥ కదలనిది కదిలెనన్నను
ముదమున వినదగదు వారి • ముచ్చట లెపుడుఁ
కదిలిన కదలని దెట్లగు
నదిగావున కదలదనుచు • నమ్మదగుసుమీ. 36॥

ఓశిష్యుడా! చలనములేనిది చలించినదనెవారి మాటలనుయెంత మాత్రను వినగూడదు చలించిన అచలముగాదు కాబట్టి అది చలించదనుచు నమ్మమని భావము.

కం॥ నిను మేనును ప్రకృతిద్వయ
మని నిను నీ మేను మృషని • మానిరి నీ జో
లిని పెద్దలు నీవెరుగక
నిను నీవొక కొండనంటె • నిజమామాటా 37॥

ఓశిష్యుడా! నిన్ను నీ దేహమును ప్రకృతిద్వయమని (చెప్పిన) పెద్దలునిన్ను ని దేహము అబద్ధమని తెలుసుకొని నీజోలిని వదలుకొనిరి నీవు తెలుసుకొనలేక నేనొక కొంతనని అనుకొనుచున్న నీ మాటనిజము కాదని తెలుసుకొమ్మని భావము.

కం॥ పేరచలమనుచు బయలని
పేరెప్పుడులేని మనము • బెట్టుట చేతఁ
పేరాయెబయలు కిప్పుడు
పోరానివునేను మృషని • పోతేజాలుఁ. 38॥

ఓ శిష్యుడా! నామరహితమగు పరిపూర్ణమునకు అచలమనియు బయలనియు మనము పేర్లుబెట్టుటచేత యిప్పుడా పరిపూర్ణమునకు నామములు యేర్పడినవి నీవు నేను అన్నృతమని తెలుసుకొనిపోతె చాలునని భావము.

కం॥ పరమ పురుషుడీ బయలని
గురుడెరిగించినను జూచి • గొప్పకురుచలై
యెరిగెటి నిను నే మృషనని
యెరిగరుగుము నీవెమాయ • వికబుట్టవిలన్. 39॥

ఓ శిష్యుడా! సద్గురుమూర్తి ఈబయలు పరమపురుషుడని తెలియ జెప్పగానెచూచి కొద్దిగనో గొప్పగనో తెలుసుకునె నీవునిన్నును అబద్ధమని తెలుసుకొని పొమ్ము నీవె మాయవు తిరిగి యీప్రపంచములో బుట్టవని భావము.

కం॥ అయమాత్మ యనినరీతిగ
నయముగ యీబట్టబయలు • నదుగో యనుటల్
అయమియమని యనుటుళ్ళ
క్కియయిన ననవలసె నీమ • కీడుడుగుటకై. 40॥

ఓ శిష్యుడా! అయమాత్మ (పీడుజీవుడు) అని అన్నట్లుగా ఈ పరిపూర్ణమును అదుగో అని అనేది అయమియం (అదియిది) అనేది అబద్ధమైనను నీఆపదపోయ్యేకొరకు అనవలసి వచ్చె నదని భావము.

కం॥ లేని నే నీవు లేని
స్థానంబును కారణంబు • సర్వమున కధి
ష్ఠానంబుసాక్షి సత్య
జ్ఞానానందంబు లనిన • సత్యములగునే. 41॥

ఓ శిష్యుడా! నేను నీవు అను అహములేని పరిపూర్ణమును కారణము సమస్తమునకధిష్ఠానము సాక్షి సత్యజ్ఞానానందములు అని చెప్పేమాటలు నిజమైనవి కావని భావము.

కం॥ అట్టిది యిట్టిదియనరా
నట్టిది బయలనుచు దెలిసి • యామీదట నీ
వట్టిది యిట్టిదియనరా
నట్టిది బయలనిన దాని • నరయకు మెపుడున్. 42॥

ఓ శిష్యుడా! అటువంటిది ఇటువంటిదని వర్ణించుటకు సాధ్యము కాని పరిపూర్ణమును తెలుసుకొని తరువాత నీవు అటువంటిది. ఇటువంటిదని చెప్పుటకు సాధ్యముకానిది పరిపూర్ణమని చెప్పిన దానిని సర్వదా చూడకుమని భావము.

కం॥ అదియిది యంచని యనరా
నిదిబయలని తెలిసి నీవు • యిది యదియనరా
నిదిబయలని తెలిసిన నిను
వదిలుండుము లేనటంచు • వరగుణవంతా. 43॥

ఓ మంచి గుణములు గలవాడా! అది ఇది యని చెప్పనలవిగానిది పరిపూర్ణమని తెలుసుకొని నీవు ఇది అది యని చెప్పనలవిగాని పరిపూర్ణమని తెలుసుకున్న నిన్ను లేనని వదలుకొని యుండుమని భావము.

కం॥ కలనీకు జగము కంతట
గలబయలుకు గలిగి యున్న • ఘనమగు తిప్పల్
కలయగని మేలుకని యా
కలవలె మేలుకనుజూచి • కదులు ముళక్కి. 44॥

ఓ శిష్యుడా! కలలోనున్న నీకు ప్రపంచమునకు అంతటనిండియున్న పరిపూర్ణమునకు కలిగియుండె గొప్పబాధలను కలియజూచి జాగ్రతనొంది మేలుకనుచూచినకలవలె కదలుమని భావము.

కం॥ కల నేన్గ సింహ్వముమను క
నులగనమృతి జెందినట్లు • యుళ్ళక్కగు నీ
వలగురుకృపచే బయలుఙ
దెలిసూరికె యుంటివేని • తీరునుమాటా 45॥

ఓ శిష్యుడా! యేనుగుతనస్వప్నములో సింహమునుచూచి మరణించి నట్లు మిధ్యయగునీవు సద్గురుకటాక్షముచే పరిపూర్ణమును తెలుసుకొని ఊరు కొని యుంటె మాటతీరి పోవునని భావము.

కం॥ ఎప్పటికి యొక్కరీతిగ
తప్పక నిలచున్నదాన్ని • దయతో గురుడుఙ
చెప్పినగని యగణితమగు
తిప్పలుగల నిన్నునీవు • దీసి తె సరిరా॥ 46॥

ఓ శిష్యుడా! సర్వదాయొకే రీతిగానుండు పరిపూర్ణమును సద్గురు మూర్తి కారుణ్యముతో దెలియజెప్పితె జూచి లెక్కలేని బాధలుగల నిన్ను నీవుతీసివేసితె చాలునని భావము.

కం॥ నీవున్న చోటనుండును
నీవివిధ విచిత్రజగము • నీతోగూడఙ
నీవులేనట్టి చోటను
నీవివిధ విచిత్రజగము • నిలువదు కుర్రా. 47॥

ఓ బిడ్డా! నీవు ఉండెస్థలములో నీతోగూడ అనేకరీతులగు చిత్రవిచిత్ర ములుగాయుండే ప్రపంచము యుండును నీవులేని స్థలములో ఈ వివిధ విచిత్రజగత్తుయుండదని భావము.

కం॥ నానా వికారములుగల
నానావిధ నామరూప • నటనలుగల యీ
నీనా దశదిశలనుగల

దీనందేలేక మనము • తిరుగుటమప్పా. 48

ఓ నాయనా! అనేక వికారములు నామరూపక్రియలు గలిగిన నీకు నాకు పది దిక్కులయందుగల యీపరిపూర్ణమునందే మనము లేకుండ తిరుగుదుమని భావము.

కం॥ అబ్బి యీబయలున్నది
దబ్బున గురుదెలుకజేయ • దబ్బరననుచుఞ
దెబ్బకుమాయముగాకను
కబ్బము జెప్పుటకు • నిల్వగలవే నీవు. 49॥

ఓ నాయనా! ఈపరిపూర్ణమున్నదనే విషయమును తొందరగా సద్గురుమూర్తినీకు తెలియ జెప్పితె నేను అబద్ధమనుచు అప్పుడే మాయముగా కుండపుస్తకము జెప్పుటకు నిలువవుగదాయని భావము.

కం॥ మూలములేక నె వచ్చిన
నీలీలలు జూచుకొనుచు • నీవె మురుతు వీ
బైలున్న దనుచు దోచితె
నీలేమిని నీవెరింగి • నిలువవు కుర్రా. 50॥

ఓ బాలుడా! మూలము లేకుండవచ్చిన నీవు నీఆటలను చూచుకొని నీవె సంతోషింతువు ఈ పరిపూర్ణముయున్నదని తెలిసితె నీలేనితనమును తెలుసుకొని నీవు నిలువజాలవని భావము.

కం॥ జ్ఞానకర్మస్వరూపము
గానిబయల్ నదుగొమాచి • కలకాలము యీ
జ్ఞాన కర్మస్వరూపం
బౌ నిను నీవెరిగి మృషని • పని వినవోయీ॥ 51॥

ఓ శిష్యుడా! జ్ఞానస్వరూపము కర్మ స్వరూపముగాకుండ యుండె పరిపూర్ణ మదగో దానినిజూచి సర్వదా కర్మజ్ఞానస్వరూపుడవగు నిన్ను నీవు అబద్ధమని తెలుసుకొని నీపనిని పూర్తి చేసుకొనుమని భావము.

కం॥ ఈ నిర్మలమౌ బయలున

నానాగమ నిగమ కల్ప • నాయనటంచే
యేనరులునమ్మ రిందుకు
నానీయందున నటంచె • నమ్మిన మాడ్కిన్. 52॥

ఓ శిష్యుడా! నిర్మలమైన ఈపరిపూర్ణములో నానావిధములగు నిగమాగమములు కల్పితమైనవంటె యేమానవులు నమ్మరు నీనాయందు కల్పితములైనవంటె నమ్మినట్లుగ నమ్మరని భావము.

కం॥ నే నీవనని మహాత్ముని
కీనిగమాగమ విచార • మిష్టతియౌనా
నేనీవని యీపల్కే-
నానీకే యిష్టతౌర • నా నాయన్నా. 53॥

ఓ నాయనా! నేను నీవుఅను భేదములేని మహాత్మునకు ఈవేదవేదాంత విచారణచేయుటయందు ఇష్టముయుండదు నేనునీవు అనేపలుకులు పలికే నాకునీకు ఇష్టమగునని భావము.

కం॥ కల వేళ్ళను యీ మేల్కను
గలయీ బయలుండ జూచి • కలమేల్కలలో
గలలేని నిన్ను నీమే
నులలేవని నీవుదెలిసి • యుండుము చాలున్. 54॥

ఓ శిష్యుడా! కల సమయమందు యీమేల్కయందు యుండె పరిపూర్ణమునుయుండచూచి కలయందు మేల్కయందు ఉన్న లేని నిన్ను నీదేహములనులేవనితెలుసుకొనియుండుము యింత మాత్రము చాలునని భావము.

కం॥ మేను జడ మజడమనినను
నేనుసుమీ రెండుగలసి • నేననబడు స్వ
ప్నానందమె మదవస్థగు
నేనేనను మృషని తెలియ • నేమృషనౌదున్. 55॥

ఓ శిష్యుడా! శరీరము జడము అజడము నేను అను ఈ రెండు కలసి నేనుఅని చెప్పబడె స్వప్నానందము ఈస్వప్నానందమే మద వస్థయగును

నేనున్న అనృతమని తెలుసుకొనగ నేను అబద్ధమౌనని భావము.

కం॥ నేనె తానైతె నావలె
యీనేలేనట్టి బ్రహ్మ • నే ననకున్నే
నేనందు నేను లేనిదె
మేనుజగత్తులయితోచి • మృషనౌ కొంచున్. 56॥

ఓ శిష్యుడా! నేను తానౌతె ఈ అహంకార రహితమగు బ్రహ్మ నేను అని అనును నేనులేని పరిపూర్ణమునందు శరీర ప్రపంచములై నేను కనపడి తుదకు అసత్యమౌచుండునని భావము.

కం॥ కానరా వారు మతములు
నానాగమ నిగమ సమితి • నామముదూపం
బేను లేనపుడు నాకై
నేనరుదెంచినను వెంట • నేయవి వచ్చున్. 57॥

ఓ శిష్యుడా! అరుమతములు అనేకములగు నిగమాగమములు నామ రూపములు నేను లేనప్పుడు కనబడవు నాకై నేనువచ్చిన వెంటనే యవి వచ్చునని భావము

కం॥ నామీది ప్రేమచేతను
యీ మనుజులు నిలుపదలచి • యెన్నో యుక్తుల్
తా మొనరించిన నిల్తునె
నేమృష మృష నిల్వగలదె • నిశ్చయమువలెన్ 58॥

ఓ శిష్యుడా! నాపైనయుండె ప్రేమచేతను ఈమానవులు నను నిలు పదలచి యెన్ని యుక్తులు బన్నినను నేను నిలువను నేను అసత్యము సత్య మువలె అసత్యము నిలువదని భావము.

కం॥ నీ తండ్రి తాతలవలె
నీతనయులు నీవుజనుట • నిశ్చయమె కదా
మీతోటి రాదుగద బయ
లీతెర గరిగిపుడు శూన్య • మేదో కనరా. 59॥

ఓ శిష్యుడా! నీతండ్రి తాతలవలె నీవు నీపుత్రులును పోవుట నిజముగదా మీరు పోవుకాలమందు ఈ పరిపూర్ణము మీతో రాదుగదా ఈ పద్ధతిని తెలుసుకొని శూన్యమైన దేదో దానిని (విమర్శించి) తెలుసుకొనుమని భావము.

కం॥ బయలెపుడు పుట్టిగిట్టదు
బయలెప్పుడు। ముట్టుకోదు। బ్రహ్మాండంబున్
బయలెపుడు నన్నెరుఁగదు
బయలెప్పుడు జేయబోదు। పనులెవ్వైనన్. ౬౦॥

ఓ శిష్యుడా! పరిపూర్ణము సర్వదా పుట్టదు చావదు బ్రహ్మాండస్పర్శ లేనిది నన్ను తెలియనిది యేకార్యమునుగాని చేయనిదని తెలుసుకొనుమని భావము.

కం॥ బయలనిన నిత్యవస్తువు
బయలన నొకరీతినుండు। బ్రహ్మాండములో
బయలనిన కండ్లబడనిది
బయలన బ్రహ్మాండ మవల। బరగెడిది సుమీ. ౬౧॥

ఓ శిష్యుడా! పరిపూర్ణము అనగా నిత్యమైనది బ్రహ్మాండములో నేకరీతిగ నుండునది కనుల కగుపడకుండ బ్రహ్మాండమునకు అవలనుండునదియని తెలుసుకొనుమని భావము.

కం॥ బయలనిన నేనులేనిది
బయలనిన నుపాధిగాన। బడనిది యెప్పడున్
బయలనిన పలుకులేనిది
బయలిట్టిది యనుచుదెలియ। బడ దెవ్వరికిన్. ౬౨॥

ఓ శిష్యుడా! పరిపూర్ణము అనగా అహంకారము లేనిది ఉపాధిరహితమైనది మాటలేనిది ఇట్టిదని తెలుసుకొనుటకు యితరులకు సాధ్యము కానిదని తెలుసుకొనుమని భావము.

కం॥ చెప్ప చూపించరానిది
యప్పాయల్లదిగో చూడు। మని నే నీకున్

చెప్పిచూపిస్తి మరువకు
యెప్పటి కిదినమ్మి లేని । యెరుకను విడరా. ౬౩॥

ఓ నాయనా! చెప్పి చూపించుటకు సాధ్యముగాని పరిపూర్ణమును అదుగో చూడుమని నీకు నేను చెప్పి చూపి చితిని దీనినెప్పుడు మరువకుండ యుండి లేనియెరుకను విడువుమని భావము.

కం॥ ఉన్నదిగద నేజెప్పిన
దన్నాదాన్నుండజూచి । తలగుము మృషయౌ
నిన్నంటి యున్న సంపద
లన్నియుగాని నీవువచ్చి । నట్లు మృషగుచున్. ౬౪॥

ఓ నాయనా! నేను చెప్పినది యున్నదిగదా దానిని (పరిపూర్ణమును) ఉండజూచి తొలగిపొమ్ము (లేనియెరుక మిధ్యయగును నిన్ను తగులుకొని యున్న సంపదలు నీవు దీసుకొని వచ్చినట్లు మిధ్యయగునని భావము.

కం॥ పంచకోశముల సంచును
మించిన దీయెరుకయనుట । మేలా బయలం
చెంచిన దగు నాముచ్చట
నంచిత సద్భక్తియుక్త । అమితాసక్తా. ౬౫॥

మిక్కిలి భక్తివిశ్వాసములుగల ఓ శిష్యుడా! పంచకోశముల సమూహముకన్న ఈయెరుక గొప్పదని చెప్పుట ఉచితమైనదికాదు ఆగొప్పతనము పరిపూర్ణమునకు అని భావించుట మంచిదని భావము.

కం॥ లేనినేనను శరీరము
లోన బయట గలిగినట్టి । లోకసమితికిన్
లోనబయటగల బయలిది
దీనందే లేకమనము । తిరుగుట మనఘా. ౬౬॥

ఓ పాపరహితుడా! లేనినేనను శరీరమునకు లోపల వెలుపల నుండు నదియు ప్రపంచమునకు లోవెలుపల గలిగియున్న పరిపూర్ణము యిది దీని యందు లేక మనము తిరుగుచుందుమని భావము.

కం॥ ముడిబడి కర్మము జ్ఞానము
విడువక నారెండు వెలసె । విశ్వమన నదే
కడువేడ్క బయలుగనెనా
మడియెనను నిల్వలేక । కల్లైపోవున్. ౬౭॥

ఓ శిష్యుడా! కర్మజ్ఞానములను రెండు ఒకదానినొకటి విడువకుండ కూడుకొనియుండెను ప్రపంచమనగా ఈ రెండింటి కూడికయే యీ ప్రపంచము సంతోషముగా పరిపూర్ణమును చూచెనేని అసత్యమైపోవునని భావము.

కం॥ సకల ము లేనిబయలున
సకలము లేందిటకువచ్చి । చనెనా లేనం
చు కని తాలేచిపోయిన
నికనిలిచే బయలునెరుగ । నేదుండునురా. ౬౮॥

ఓ శిష్యుడా! యేమిలేని పరిపూర్ణమందు యేమిలేనియేక వచ్చి చూచి తానులేనని తలంచి తనకుతానే లేకుండపోయితె నిత్యముగానున్న పరిపూర్ణమును తెలుసుకొనుటకు యేది నుండదని భావము.

కం॥ ఉన్న లేనేమొ యనకన్
వున్నది బయలనుచు । యేమెవుంటిని లేనం
చెన్న లేనట్టినిన్నను
పన్నగగని లేనినీవు । పరుగిడవోయీ. ౬౯॥

ఓ శిష్యుడా! ఉన్నను లేనేమోయని అనుకొనక పరిపూర్ణము యున్నదనుచు యెమోయున్నాను లేనుఅని అనుకొనుము లేని నిన్ను నీవు తెలుసుకొని లేనినీవు పరుగెత్తుమని భావము.

కం॥ రెండు వస్తువుల నడుమ న
ఖండంబిదె కానుపించు । గద దీనిని నీ
వుండి కనుగొని చనందగు
మండిత సత్కీర్తిపొందరె । మానవ చంద్రా. ౭౦॥

మంచి కీర్తిగల ఓ మానవశ్రేష్ఠుడా! రెండు వస్తువుల మధ్యన కనపడె ఈ అఖండము (పరిపూర్ణము)ను నీవుయుండి తెలుసుకొని పోవలయునని భావము.

కం॥ ఉన్నదా నందు నిజముగ
నెన్నడులేనట్టి మనము । యేతెంచిట యీ
తిన్ననిముచ్చట లాడితి
మిన్నియికన్ మనముబోతె । యేదిరమాటా. ౨౦॥

ఓ శిష్యుడా! ఉన్న పరిపూర్ణమునందు యెన్నడులేని మనము వచ్చి ఇచ్చట యీ మంచిమాటలు మాట్లాడు చుంటిమి మనముబోతె ముందు మాట లేదు అని భావము.

కం॥ ఓ పాపరూప బయ
లేపరమాత్మ నుచునమ్మి । లేనట్టినినున్
ఆపోజ్యోతి ననుచు దెలి
సీ పట్లనెలేనటంచు । చేరు ముళ్ళకిన్. ౨౧॥

కంటిపాపతో సమానమైన రూపము గలవాడా! పరిపూర్ణమును పరమాత్మయనినమ్మి లేని నిన్ను ఆపోజ్యోతి స్వరూపుడనని తెలుసుకొని యీ సమయమునందు నేనులేనని మిధ్యను పొందుమని భావము.

కం॥ ఇచ్ఛా రాహిత్యంబునె
స్వచ్ఛంబగు బోధయనుచు । సజ్జనులని యీ
యిచ్ఛనెగూడని దనిరా
స్వచ్ఛందుల మాట లన్ని । సత్యమువినరా. ౨౩॥

ఓ శిష్యుడా! ఇచ్ఛలేకుండుటే స్వచ్ఛమగు బోధయని పెద్దలుజెప్పిరి ఈ యిచ్ఛనే కూడదని ఆ నిర్మలులు జెప్పిన వాక్యములు నిజమని తెలుసుకొనుమని భావము

కం॥ ఏయాపేక్షజనించిన
నాయాపేక్షలెల్ల మాయ । యని తెలియదగున్

ఆయాస మొనుదానను
ఛీయని యవి విడువదగును • సేమముకొరకై. ॥౩౪॥

ఓ శిష్యుడా! నీకు యేకోరిక గలిగినను ఆకోరికలన్నియు మాయయని తెలియుము ఆకోరికలు గలుగుటచే చాల శ్రమగలుగును కాబట్టి వాటిని నీక్షేమము కొరకు ఛీ యని విడువవలయునని భావము.

కం॥ లేనినీకలిమి వంధ్యా
సూనునివలె పుష్కర ప్ర • సూనమువలె స్వ
ప్నానందమువలె గంధ
ర్వానీకస్థానమువలె • నని తెలియదగున్. ॥౩౫॥

ఓ శిష్యుడా! లేని నీసంపత్తు గొడ్రాలుకొడుకు ఆకాశపుష్పము స్వప్నానందము గంధర్వపట్టణము అనువాటివలె అస్థిరమని తెలుసుకొనుమని భావము

కం॥ నీతండ్రిజనిన మీదట
నీతనయుడు రాకమునుపు • నీవున్నపుడున్
యేతత్వమంతటను గల
దాతత్వమునరసి మృషని • తలపుమిమ్మున్. ॥౩౬॥

ఓ శిష్యుడా! నీతండ్రిపోయిన తరువాత నీకొడుకు పుట్టకముందు నీవు యున్నప్పుడు అంతట యేతత్వము ఉన్నదో ఆతత్వమునే చూచి మిమ్ములను అసత్యమని తెలుసుకొనుమని భావము.

కం॥ నీవెసుమీ జీవశివుల్
నీవెసుమీ మేనుజగము • నీవేసుమ్మీ
జీవశివైక్యము బయలున
నీవుగలుగలేదు లేదు • నీ మొదలెచటన్. ॥౩౭॥

ఓ శిష్యుడా! జీవేశ్వరులు శరీరప్రపంచములు జీవేశ్వరైక్యతయు నీవేసుమా పరిపూర్ణములో నీవుపుట్టలేదు నీ మొదలు యెక్కడలేదని భావము.

కం॥ కదలీనా మెదలీనా
కదలని యీ బయలునిన్ను • గనలేదుగదా
మొదలెక్కడ గనరాదిక
కదులుము నీకలిమికక్కి • గాదల్చి సుతా. ॥౭౮॥

ఓ తనయా! కదలదు మెదలదు కదలకుండయుండె ఈపరిపూర్ణము నిన్ను చూడలేదు దీనికి మూలము కనపడదు నీకలిమిని మిథ్యగా భావించి తొలగిపొమ్మని భావము

కం॥ మేనని ననుదెలిసిన గతి
నేననని ది బయలుగాను • నీవెరుగోయీ
నేననని ది నేననదని
నేనను నేనరయమృషని • నే మృషనౌదున్. ॥౭౯॥

ఓ శిష్యుడా! శరీరమునిన్ను తెలుసుకున్నట్లు నేనుఅని అననిది పరిపూర్ణమని నీవు తెలుసుకొనుము నేను అననిది నేను అని అననదియు నేను అను నేను చూడగా అసత్యమని నేను అసత్యముగుదునని భావము.

కం॥ మేనొక్కటి నేనొక్కటి
నేనీమాటలను విడచి • నిను నీతనువున్
నేనెననని యచలముగని
నేనను నీ వేగవోయి • నేమృషననుచున్. ॥౮౦॥

ఓ శిష్యుడా! శరీర మొకటి నేను ఒకటి అనే నీ మాటలను వదలి నిన్ను నీ శరీరమును నేను నేనేనని పరిపూర్ణమును చూచి నేను అను నీవు అబద్ధమని తెలుసుకొని పొమ్మని భావము.

కం॥ దేహమున కొంతనిజమని
మోహంబున నిల్పుకొనుచె • మోసంబు గురు
ద్రోహముగాన విడువుము
మోహంబును మేల్కని కల • మఱిగినరీతిన్. ॥౮౧॥

ఓ శిష్యుడా! శరీరములో కొద్దిగ నిజమని ప్రేమతో కాపాడుటకు ప్రయ

త్నించుటే మోసము గురుద్రోహమగును కాబట్టి కలగని మేల్కొన్నరీతి ప్రేమను వదలుమని భావము

కం॥ చలనమన నీవుసుమ్మీ
చలనరహితమనిన బయలు • చలనమెకల యీ
చలనము చలనరహితము
గలదని కనితొలగ మేలు • కగునోయప్పా. ॥౮౨॥

ఓ నాయనా! చలనమనగా నీవు చలనరహిత మనగా పరిపూర్ణము చలనముకల ఈ చలనము చలనరహితము ఉన్నదని చూచి తొలగిపోవ మేలుకయగునని భావము.

కం॥ ఈ గుర్తెరిగే మేనును
బాగుగ విడచుండుమిందు • బట్టకు దేనిన్
ఆగడమౌదానను విని
త్యాగమునీకుంటె మంచి • దౌరావోరీ. ॥౮౩॥

ఓ శిష్యుడా! ఈ గుర్తెరిగే శరీరమును నిశ్చయముగా వదలుకొని యుండుము ఇందులో దేనిని పట్టుకొనకుము అట్లు పట్టుకొని యుంటివేని దానీ వలన చికాకు కలుగును ఈ త్యాగము నీకుయుంటె చాలమంచిదని భావము.

కం॥ చలియించని దాకాశము
చలనంబే వాయువనుచు • సాటింపదగున్
చలనమె విశ్వమునేనన
చలనమెతను వెరుకలనిన • జగమనినసుతా. ॥౮౪॥

ఓ నాయనా! చలనములేనిది ఆకాశము చలించునది వాయువు అనీ బహిరంగముగా జెప్పవచ్చును. ప్రపంచము నేను శరీరము యెరుకయనునవి బలనమైనవని తెలుసుకొనుమని భావము.

కం॥ వలదెక్కువ ముచ్చట్లిక
చలనము లేనట్టిబయలు • చ దముగని యీ
చలనమగు నీకునీవే

తలిదండ్రు లటంచు దెలిసి • తలగుము చాలున్. ॥౮౫॥

ఓ శిష్యుడా! యెక్కువ మాటలతో పనిలేదు చలనరహితమగు పరిపూర్ణమును చూచి చలనమగు నీకు నీవే తలిదండ్రులని గుర్తించి తొలగితే చాలునని భావము.

కం॥ బ్రహ్మందులేక కలిగిన
బ్రహ్మనునే ననెటిమాయ • పరిబలెజగంబై
బ్రహ్మనుగని తానేగుచే
బ్రహ్మననే మాయకుపని • బ్రహ్మందునుమీ. ॥౮౬॥

ఓ శిష్యుడా! పరిపూర్ణమందు లేకబుట్టినమాయ పరిపూర్ణమును నేనె యని అనుచు ప్రపంచమై యుండెను పరిపూర్ణమును చూచి పరిపూర్ణమును అని అనుకునేమాయకు పరిపూర్ణములో తానుపోవుటే పనిసూమా అని భావము.

కం॥ నిరుపాధికమగు బయలున
మరిలేకనె కలిగినట్టి • మారుతమునకే
పరియాయ నామములగు
కరువలియన యెరుకయనిన • కడుమాయయనన్. ॥౮౭॥

ఓ శిష్యుడా! ఉపాధి రహితమగు పరిపూర్ణమునందు లేకబుట్టిన వాయువునకే కరువలి యెరుక మాయ యనునవి పర్యాయ పదములని భావము.

కం॥ మానసము దేహి జీవుం
డానందము సత్తుచిత్తు • లహము జగదధి
ష్ఠానంబు సాక్షి సత్య
జ్ఞానము ద్రిష్టనినసీవె • సత్యముసుజ్ఞా. ॥౮౮॥

ఓ మంచిజ్ఞానము గలవాడా! మనస్సు దేహి జీవుడు ఆనందము సత్తు చిత్తు అహము జగదధిష్ఠానము సాక్షి సత్యజ్ఞానము ద్రిష్టయనునవి అన్నియు సత్యముగా నీవే యగుదువని భావము.

కం॥ జ్ఞానాజ్ఞానంబులు యీ
జ్ఞానంబువెకాని వేరు • గావెన్నటికీ
జ్ఞానాజ్ఞానానికి పని
జ్ఞానాతీతమును గాంచి • చనుటయెసుమ్మీ. ॥౮౯॥

ఓ శిష్యుడా! జ్ఞానము అజ్ఞానము అను యీ రెండును యీ జ్ఞానముకు సంబంధించినవేకాని వేరుకావు జ్ఞానాజ్ఞానానికి (నీకు) పనియేమనగా జ్ఞానాతీతము (పరిపూర్ణము)ను చూచి తొలగిపోవుటయే సుమా అని భావము.

కం॥ జలమందు మొదలులేకనె
జలచరములు బుట్టిపెరిగి • సమసినరీతిన్
అల పరిపూర్ణముతో నీ
విలసజ్జననంబు స్థితియు • విలయము లౌరా. ॥౯౦॥

ఓ శిష్యుడా! నీటియందు మొదలులేకుండ బుట్టిన జలచరములు నీటిలోనే పుట్టిపెరిగి చచ్చినట్లు నీవు పరిపూర్ణములోనే బుట్టిపెరిగి మరణమును పొందుచుందువని భావము.

కం॥ అచలమున మొదలు లేకనె
సచరాచర జంతునిచయ • జననమగునుయ
ప్పుచయమునలేని జలచర
నిచయము జన్మించినట్లు • నిశ్చయము సుమీ. ॥౯౧॥

ఓ శిష్యుడా! చరాచర జంతుజాలము మూలము లేకుండగనే పరిపూర్ణమునందు బుట్టును అదియెట్లంటె నీటియందు లేని జలచరములు నీటియందే జన్మించినట్లు అని నిశ్చయముగా దెలుసుకొనుమని భావము.

కం॥ నీరందు చేపలేకనె
నీరున జన్మించి మించి • నీల్గినరీతిన్
తోరమగు బట్టబైటను
వారకగుర్తెరుగు మేను • వచ్చున్ బోవున్. ॥౯౨॥

ఓ శిష్యుడా! నీటియందులేని చేపలు నీటిలోనెప్పటి నీటిలోనె వచ్చినట్లు నిర్మలమగు పరిపూర్ణమందు సంశయము లేకుండ తెలిసుకనే శరీరము వచ్చుచు పోవుచుండునని భావము.

కం॥ జలధి జలచరములోపల
గలదా జలరాసిలోని, జలచరమువలెన్
జలధినిత్యం బనిత్యము
జలచరమట్ల చంచలము, సరణులు గనుమీ ॥౯౩॥

ఓ శిష్యుడా! జలచరములో సముద్రములేదు సముద్రములోని జలచరమువలె సముద్రము నిత్యము జలచరము అనిత్యము అట్లే అచల చలముల యొక్క పద్ధతులని గుర్తింపుమని భావము.

కం॥ జలరాశికి బుట్టువుగద
జలచరములు వాటికవ్వె, జనియించుగదా
కలకాలమిట్లు బయలెరు
కలగాంచిన సంశయంబు, కడతేగుసుమీ ॥౯౪॥

ఓ శిష్యుడా! జలచరములు సముద్రమునకు బుట్టవు వాటికవే పుట్టుచుండును అట్లే యెల్లప్పుడు బయలెరుకలను చూడగా సంశయము పోవునని భావము.

కం॥ పుట్టదు గిట్టదు వొకరిని
పుట్టించదు చంపబోదు, భూమ యెరుకదా
పుట్టునుగిట్టును వొకరిని
పుట్టించును సమయజేయు, భూమ కితరమై. ॥౯౫॥

ఓ శిష్యుడా! పరిపూర్ణము బుట్టదు చావదు ఒకరిని పుట్టించదు చంపదు పరిపూర్ణమును యితరమైన యెరుక తాబుట్టుచు గిట్టుచు యితరుల పుట్టించుచు చంపుచును యుండునని భావము.

కం॥ కలలోపల యేనుగపై
గలదొర మేల్కనిన నిల్వ, గలడా గురుడున్
తెలిపి బయలు నివులేవిక

దలపకమన నీకునిల్వ • దరమాతలపన్. ॥౯౬॥

ఓ శిష్యుడా! స్వప్నములో యేనుగుపై నెక్కినట్లు కలగనిన రాజు మేలుకను పొందగా యేనుగుమీద నుండడు. అట్లే గురుడు పరిపూర్ణమును తెలిపి నీవు లేవు యికముందు యున్నట్లు తలంచకుము అని చెప్పగా నీకు నిల్చియుండుటకు సాధ్యము కాదని భావము

కం॥ ఎందరు లేదన్నను తా
నెందుకు లేకుండు బయలు • నే నీవనకన్
యెందరు కలదని యన్నన్
యెందుకు కలిగుండు యెరుక • నేనీవనుచున్.॥౯౭॥

ఓ శిష్యుడా! యెంతమంది లేదని చెప్పినను పరిపూర్ణము నేను నీవు యనకుండ సర్వత్ర నిలచి యుండును యెందరు యున్నదని చెప్పినను యెరుక నేను నీవు యనుచు నిలచియుండదని భావము.

కం॥ నీకచ్చి రానియూరున
నీకేగృహ మచ్చినట్లు • నీ వౌ మేనన్
నీకచ్చి రాదు నివునిను
చేకొనుటము మానవయ్య • శ్రీయస్కామా.॥౯౮॥

ఓ శ్రీయస్సును కోరువాడా! అచ్చిరాని ఊరిలో నీకు యేఇల్లుకూడ అచ్చిరానట్లు నీవయైన శరీరములో నీకచ్చిరాదు కాబట్టి నీవు నిన్ను గైకొనుట మానుకొనుమని భావము.

కం॥ అష్టాంగ యోగముల నతి
కష్టించే ప్రజలవలెనె • కష్టించక యీ
స్పష్టమగు బోధవిను నీ
కష్టములన్నియును దొలగి • కడ తేగుసుమీ.॥౯౯॥

ఓ శిష్యుడా! అష్టాంగ యోగములను సాధించుటకు శ్రమపడె మానవులవలె శ్రమపడకుండగానె స్పష్టముగా యుండు ఈ బోధను వినుము నీ కష్టము లన్నియు దొలగిపోవునని భావము.

కం॥ ఇదిగాదుబోధ నేదై

ల్చెదరమ్మని నీకువేరె • పేరిడి యవలన్
ముదమున నే బ్రహ్మననుచు
వదురుమనిన వాడెమాయ • వసుమతిలోనన్. ॥౧౦౦॥

ఓ శిష్యుడా! ఇం బోధగాదు నీకుబోధించెదరమ్మని పిలచి మరియొక పేరుపెట్టి తరువాత సంతోషముతో నేనే బ్రహ్మనని పలుకుమని బోధించిన వాడె యీ ప్రపంచములో మాయయని తెలుసుకొనుమని భావము.

కం॥ మంత్రయంత్రములు ముద్రిలు
తంత్రంబులు నీకుదెల్పి • ధనమడిగెటి యా
మంత్రిజ్ఞుల మంత్రిములకు
యంత్రములకు తంత్రములకు • నీగకుకూనా. ॥౧౦౧॥

ఓబిడ్డా! మంత్రములు యంత్రిములు ముద్రిలు తంత్రములు (అనునవి) నీకుచెప్పి ద్రవ్యమును అడుగునట్టి ఆ మాంత్రికుల మంత్ర యంత్రి తంత్రిములలో నీవు ప్రవేశించకుమని భావము.

కం॥ దీపముగతి కన్నులలో
పాపవలెన్ మెలగునిన్ను • పరమాత్ముడవం
చీ ప్రజలుదలతు రెరుగక
నీపాట్లెరిగుండినేను • నినునమ్ముదునే. ॥౧౦౨॥

ఓ శిష్యుడా! దీపమువలెను కంటిలోని పాపవలె వర్తించెడు నిన్ను పరమాత్మ స్వరూపుడవని యీ ప్రజలు తమకు దెలియక తలంచుచుందురు నీకష్టములను తెలుసుకున్న నేను నిన్ను పరమాత్మవని నమ్మనని భావము.

కం॥ తర్జనులవలన జూపును
నర్జు నవవన్ గతనీల • మనిశిష్యులకుఁ
దార్జన్య గురుడు నీవు వి
సర్జింపు మసత్యమనుచు • సజ్జనతిలకా. ॥౧౦౩॥

ఓ పురుషశ్రేష్ఠుడా! దుష్టగురుడు తర్జనులతో తెలుపు వర్ణము

నందున్న నీలము (పరమాత్మ స్వరూపము)ను చూపించును నీవా విషయ మును సత్యమని నమ్మకుమని భావము.

కం॥ పురుషోత్తముడని పూజలు
నరులొనరింపుదురు భువిని । నానాచోట్లన్
ధర మొదలగు భూతములను
చిరుత శిశువులాడుకొనెటి । చేష్టలరీతిన్. ౧౦౪॥

ఓ శిష్యుడా! ప్రపంచములో పురుషోత్తముడని మానవు లందరు యెన్నో స్థలములయందు చిన్నపిల్లలు ఆడుకొనుచున్నట్లు భూమి మొదలగు పంచభూతములను పూజించుచుందురని భావము

కం॥ రసమనదగనిది వస్తువ
బసవన్నక దెట్టులెరుక । ప్రభువుకు దెలుసున్
రసమైతె విషము సగుణము
ససిగా దాముచ్చటంత । చెవులవినుటకై. ౧౦౫॥

ఓ శిష్యుడా! పరిపూర్ణమను పదార్థము సత్వాదిగుణ రహితమైనది అట్టిపదార్థము సద్గురునికే దెలియునుగాని మూర్ఖునకు తెలియదు పరిపూర్ణము సత్వాదిగుణ సహితమైతే అది విషమువంటిది రసరహిత పరిపూర్ణమునకు రసముల నారోపించు మాటలు ఒప్పుకోదగినవి కావని భావము.

కం॥ నీరా శమ నృగ్వేదన
సారము రేతస్సురెంటి । సమ్మిశ్రింబే
ధారుణితనువై నిలుచును
నారీనరసంగ మమున । నయగుణరత్నా. ౧౦౬॥

ఓ పురుషరత్నమా! నీటియొక్క సూక్ష్మాంశము నెత్తురు అన్నము యొక్క సూక్ష్మాంశము (సారము) వీర్యము ఈ నెత్తురు వీర్యముల రెంటి యొక్క కలయికయే యీ ప్రపంచములో శరీరమై నిలచి యుండను స్త్రీ పురుషుల సంయోగముచే శరీరోత్పత్తి యగునని తెలుసుకొనుమని భావము.

కం॥ మనుసన్నపు సూక్ష్మాంశము
వినుము జలసూక్ష్మాంశవలన । వెలసెనుపాణం
బును రెండుగలసి పిండం
బన బ్రహ్మాండంబనంగ । బరగును వత్సా. ౧౦౭

ఓ వత్సా ! అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సు జలముయొక్క సూక్ష్మాంశము ప్రాణము మనోప్రాణములు రెండును కలిసి పిండాండము బ్రహ్మాండము యనునవి యగునని భావము.

కం॥ రెండురీతుల గనంబడు
చుండే యీదేహమిదేత । చూచి బయలును
ద్దండత దీనినుశక్యంని
యుండుము దీనందువాంఛ । నుంచక శిష్యా. ౧౦౮॥

ఓ శిష్యుడా ! పిండాండము బ్రహ్మాండము అను రెండు రీతులగా కనబడుచున్న యీ శరీరముచే పరిపూర్ణమును చూచి నిశ్చయముగా శరీరమును అబద్ధమని యుండుము యీశరీరమునందు కోరిక నుంచకుమని భావము,

కం॥ ద్వైతాద్వైత విశిష్టా
ద్వైతులమని కీచులాడు । దయ్యములవలెన్
ద్వైతాద్వైత విశిష్టా
ద్వైతులతో కీచులాడ । దగునే నీకున్॥ ౧౦౯॥

ఓ శిష్యుడా ! ద్వైతులము అద్వైతులము విసిష్టాద్వైతులము అని దయ్యములమాదిరి తగువులాడెడి ద్వైతాద్వైత విసిష్టాద్వైతులతో కీచులాడకుమని భావము.

కం॥ అనుభవ వేదాంతులమని
తినరాని పదార్థమెల్ల । తిను దుర్జనులన్
కనలోకము తద్భోదను
వినలోకము యెన్నటికి । వివేక విచారా. ౧౧౦

ఓ వివేకమును విచారించువాడా ! అనుభవముగల వేదాంతులమని

చెప్పుకొనుచు తినకూడని పదార్థములను తినెడి దుష్టస్వభావము గలవారిని చూడకుము వారి బోధలను సర్వదా వినకుమని భావము.

కం॥ జిహ్వోపస్థ విషయము
లెవ్విగలవొ వాటివిడువ । లేనిగురువులన్
యెవ్వరుజేరి కొలుతురొ
యివ్వసుధనువారు జెడుదు । రిదినిజముసుమీ. ౧౧౧॥

ఓ శిష్యుడా! జిహ్వోపస్థల విషయములకు కోరికలకు లోబడి చరించే గురువులను యేనరులు ఆశ్రయించి సేవింతురో ఈప్రపంచములో వారందరు చెడిపోవుచుందురు ఇది నిజమని భావము

కం॥ పాషండమతము వారల
వేషంబులుజూచి శిష్య । వితతి భ్రమించున్
ఈషత్తీ బోధెరుగక
దూషింతురు విన్నకన్న । దుర్భాషణలన్. ౧౧౨॥

ఓ శిష్యుడా! పాషండ మతములో నుండువారియొక్క వేషమును చూచి శిష్యులు భ్రాంతి జెందుదురు ఈబోధయందలి విషయము యేమాత్రము తెలుసుకొనక దీనిని విన్నను చూచినను అనరాని మాటలను అనుచుందురని భావము.

కం॥ ఎందరు దూషించితె యే
మందురు మనవారెకాని । యన్యులె నీవా
యందరితో వాదించక
నందంబౌ నిట్టిబోధ । నరయర తండ్రీ. ౧౧౩॥

ఓ నాయనా! యెందరు దూషించితె నేమి వారందరు మనవారే నీవు ఆదూషించిన వారందరితో వివాదము పెట్టుకొనక ఆనందమగు ఈబోధనే చూచుచుండుమని భావము.

కం॥ కోపమె పాపంబనబడు
కోపమె హంకారమనుచు । కొనియాడబడున్
కోపమె తాపంబనబడు

కోపమే మృత్యువనబడు । కుటిలవిరహితా. ౧౧౪॥

ఓ కుటిలము లేనివాడా! కోపమే పాపమనియు కోపమే అహంకార మనియు కోపమే తాపమనియు కోపమే మృత్యువనియు చెప్పుదురని భావము.

కం॥ నిజగురుబోధ నెరుఁగక
గుజగుజ శిష్యులకుజెప్పు । గురువుల బోధల్
భుజగవి షోపంబగుసుమి
సుజనౌఘము మెచ్చదట్టి । సుద్దినిపట్టీ ౧౧౫

ఓ బిడ్డా! నిజమగు గురుబోధను తెలుసుకొనకుండ తన శిష్యులకు రహస్యముగ జెప్పు గురువులయొక్క బోధలు తాఁచుపాము విషమువంటి వగును ఆబోధలను సత్పురుషులు మెచ్చరని భావము.

కం॥ తనువునువిడి బ్రహ్మను నే
ననుమునుపటి నీవిచార । మటుబెట్టిపుడున్
నినునీతనువును వేరని
యనకను పరిపూర్ణమరసి । యవి విడువదగున్. ౧౧౬॥

ఓ శిష్యుడా! శరీరమును విడచి నేను బ్రహ్మను అనే నీపూర్వవిచారము అట్లుంచి యిపుడు నిన్ను నీశరీరమును వేరనితలంచక పరిపూర్ణమును చూచి (తరువాత)నిన్ను నీశరీరమును విడువవలయునని భావము.

కం॥ కొందరు వైరాగ్యంబున
కొందరు తీర్థాటనమున । కొందరు కర్మం
బందున వ్రతజప తపముల
కొందరు నటియింతురిట్టి । కోర్కెలమనుజుల్. ౧౧౭॥

ఓ శిష్యుడా! వైరాగ్యమున కొందరు తీర్థయాత్రలయందును కర్మల యందును వ్రతజప తపస్సులయందును మానవులు వారివారికి యిష్టమగు వాటియందు చరించుచుందురని భావము.

కం॥ కొందరు భక్తియుతమున

కొందరు యోగములయందు • కొందరుజ్ఞానం
బందురమింతురు వారల
కందరికీబోధ యిష్ట • తౌనాయన్నా. ॥౧౧౮॥

ఓ నాయనా! కొందరు భక్తి త్రయము నందును యోగముల నభ్యసించుట యందును జ్ఞానమునందును తమతమ మనస్సులను రమింప జేయుదురు కాని అందరికి ఈబోధ యిష్టముగాదని భావము.

కం॥ భ్రిమరహిత సహితజనులకు
సుమనసులను నరుల సమము • జూచిన విశ్వం
బమరిలేకుండు నుండును
క్రమమున కలవంటిదగుచు • కడు నిజముసుమీ. ॥౧౧౯॥

ఓ శిష్యుడా! భ్రాంతిలేని మానవులకు భ్రాంతిగల మానవులకు దేవతలను మానవులను సమానముగ జూచిన యీ ప్రపంచము (భ్రమ రహితులకు) నిలచియుండదు (భ్రిమసహితులకు) ఉండును క్రమముగా కలవంటి దగుచుయుండును. ఇది నిశ్చయము సుమీ అని భావము.

కం॥ కల తనను లేనుకలనని
తలపోసెటి వారిమాట • తమకే నిజమౌ
కలలేనివారు కలవా
రలువీరలె నొకరినొక • రరయ రిరువురున్. ॥౧౨౦॥

ఓ శిష్యుడా! కలలోనున్న తనను కలయందు లేనని యున్ననని తలంచెడి వారిమాట వారికే నిజము కలలో లేనివారు కలలో నున్నవారు వీరే నొకరి నొకరుచూచుకొనరని భావము.

కం॥ ఎరుగుట జ్ఞానము దానను
జరిగేపని కర్మమనుచు • జనులెన్నిరి యీ
యెరుకయు కర్మము లేనిదె
పరిపూర్ణము వీటినీవు బట్టకు మెపుడున్. ॥౧౨౧॥

ఓ శిష్యుడా! తెలుసుకొనుట యనునది జ్ఞానము (యెరుక) దానివలన

జరుగుపనులు కర్మయనియు మానవులు జెప్పుచుందురు యీజ్ఞాన (యెరుక) కర్మములేనిదే పరిపూర్ణము కాబట్టి వీటిని సర్వదా నీవు విడువుమని భావము.

కం॥ కలవారికి మేలుకలో
గలవారికి జాగ్రితందు • కలహము గలదా
కలహించి రేని వారలు
కలవారలె మేల్కొవారు • గారెన్నటికిన్. ॥౧౨౨॥

ఓ శిష్యుడా! కలలోనున్నవారికి మేలుకలో నున్నవారికి జాగ్రత యందు జగడములు లేవు జగడము లుండెనేని వారుకలలోని వారలేకాని మేలుకలోని వారలెన్నడు కారని భావము.

కం॥ సురలందు దోచుకలవలె
నరుదెంచును బ్రహ్మయందు • నఖిలజగంబుల్
యరుదెంచి యజుని గన్గొని
బిరబిరతా మేగునిల్వ • బిడియంబగుచున్. ॥౧౨౩॥

ఓ శిష్యుడా! దేవతలయందు దోచిన స్వప్నమువలె బ్రిహ్మ (పరిపూర్ణము) యందు సమస్త ప్రిపంచము దోచెను తోచిన ప్రపంచము ఆబ్రహ్మ (పరిపూర్ణము)ను చూచి తాము నిలచుటకు సిగ్గునొంది తొందరగా తమకు తామె పోవునని భావము.

కం॥ మన మీబయలున లేనిదె
మనకు మనమె వచ్చినిల్చి • మన మేగిన యే
మనక మనజోలి గొనకన్
తనకై తానుండియున్న • దదుగో కనరా. ॥౧౨౪॥

ఓ శిష్యుడా! పరిపూర్ణములో లేనిమనము మనకు మనమయ్యే వచ్చినను ఉన్నను పోయినను మన జోలినెరుగక తనకుతానెయున్నది (పరిపూర్ణము) అదుగో చూడుమని భావము.

కం॥ జ్ఞానంబు సత్వగుణమను
దానికి జన్మించెననుచు • దామోదరు డా

మేనత్త కొడుకుతోనవె
జ్ఞానమునకు జన్మమొకటి • గలిగెగదోయీ. ॥౧౨౫॥

ఓ శిష్యుడా! జ్ఞానమనునది సత్వగుణము వలన బుట్టినదని శ్రీకృష్ణుడు తన మేనత్తయగు కుంతిదేవి కుమారుడైన అర్జునునకు తెలిపెను జ్ఞానము (యెరుక)కు గూడ ఒకజన్మ కలిగినదని భావము.

కం॥ పుట్టిందిది గిట్టుజ్ఞానము
పుట్టెననుచు కృష్ణమూర్తి • పురుహూతజుడౌ
నట్టితన ముద్దుమరిదికి
గట్టిగ వినజెప్పె నిందు • కలతేమోయీ. ॥౧౨౬॥

ఓ శిష్యుడా! పుట్టినది చచ్చును జ్ఞానము (యెరుక) పుట్టినది అనుచు శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పెను యిందుకు యెదురు మాటలేదని భావము.

కం॥ జ్ఞానమగు నీవు జ్ఞేయం
బైన బయలుగాంచి జ్ఞాన • మగు నిను నీవే
లేనంచు దెలియుమని తా
నానరునకు వాసుదేవు • డానతి యిచ్చెన్. ॥౧౨౭॥

ఓ శిష్యుడా! జ్ఞానమగు నీవు జ్ఞేయమైనా పరిపూర్ణమును తెలుసుకొని జ్ఞానమగునిన్ను నీవులేనని గుర్తింపుమని శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించెనని భావము.

కం॥ మన మచలమనదగదు తగ
దనుటయు మనమచలమునకు • తగ వేరని రెం
డనిలేవు మనమచలమని
విను మనముళ్కక్కి తెలియ • విడు మనముమనన్. ॥౧౨౮॥

ఓ శిష్యుడా! మనము పరిపూర్ణమని అనుకొనగూడదు అనుకొనగూడదనుటయు మనము పరిపూర్ణమునకు భిన్నమనిగాని రెండని గాని (తగినట్టుగ చెప్పుకొనుటకు) లేవు పరిపూర్ణమని వినుచున్న మనము అబద్ధమని తెలియగానె మనముమననే వదలిపోవునని భావము.

కం॥ జ్ఞానము నేనన నొక్కటె
జ్ఞానమునే వేరటంచు • గనబోకుసుమీ
జ్ఞానము వచ్చును బోవును
జ్ఞానాతీతమును తాను • గాంచినదాకన్. ॥౧౨౯॥

ఓ శిష్యుడా! జ్ఞానమన్నను నేనన్నను ఒక్కటే జ్ఞానమువేరు నేనువేరు అని అనుకొనకుము జ్ఞానమనునది జ్ఞానాతీతము తెలుసుకొను వరకు వచ్చుచు పోవుచుండునని భావము.

కం॥ నీకలను వచ్చిపోయిన
లోకుల లోకములవలెనె • లోనిను గనుమీ
నీకలను నీవు మేల్కని
యాకలనటువలెనె చూస్తె • యెటునిల్వ్వవురా. ॥౧౩౦॥

ఓ శిష్యుడా! నీస్వప్నములో వచ్చిపోయిన లోకములు మానవులు మిధ్యయైనట్లు నీలోనిను చూడుము నీస్వప్నమునునీవె మేలుకొని ఈస్వప్నము అట్లనేచూచి విచారింతివా నీవు నిలువవని భావము.

కం॥ అందరికల నీకలెకద
అందరు నీకలనువచ్చి • యగుపడిపోవన్
కందువుగద నిన్నట్లనె
మందమతీ కనగదోయి • మరిలేననుచున్. ॥౧౩౧॥

ఓ మందబుద్ధిగలవాడా! అందరికి కలుగుకలయే నీకు కలుగును అనేకులు నీకలలో వచ్చి కనపడి పోవుచుండగా నీవు చూచుచుందువు గదా అట్లనే నిన్ను నీవులేనని చూచుకొనుమని భావము

కం॥ ఆకాశమనిన శూన్యం
బాకాశంబనిన సగుణ • మాకాశమనన్
కాకివలె నల్లరూపుది
ఆకాశము మితములోన • నణగుండుసుమీ. ॥౧౩౨॥

ఓ శిష్యుడా! ఆకాశమనగా శూన్యము సగుణము కాకివలె నల్లనిరూపు గలది మితములో అణగియుండునదియని తెలుసుకొనుమని భావము.

కం॥ ఆకాశమనిన కాలం
బాకాశంబనవి౦బ • మాకాశమనన్
లోకమున చంచలంబగు
నాకాశము శబ్దరూప • మగు వినవోయీ. ॥౧౩౩॥

ఓ శిష్యుడా! ప్రపంచములో ఆకాశమనగా కాలము ఆకాస్యము చాంచల్యము శబ్దస్వరూపమనియు తెలుసుకొనుమని భావము.

కం॥ అహమేతను వివిశ్వం
బహమే జీవేశ్వరులన • నహమెతదైక్యం
బహమేయహముకు మూలం
బహమణగిన నణగునన్ని • యనఘచరిత్రా. ॥౧౩౪॥

ఓ పాపరహితమైన చరిత్ర గలవాడా! అహము అనునదియే శరీరము యీ ప్రపంచము ఆ అహమే జీవేశ్వరులు జీవేశ్వరైక్యము యీ అహమే అహమునకు మూలము యీ అహముపోతే అన్నియు పోవునని భావము.

కం॥ భ్రిమయనిన పుట్టుకనినను
భ్రమకే నామంబు లిట్టి • భ్రిమనే నీవున్
భ్రమెయీమేను జగత్తులు
భ్రమెయెరుకయు మఱపురెండు • భ్రిమెభ్రమవినరా ॥౧౩౫॥

ఓ శిష్యుడా! భ్రమ యనగను జన్మమనగను భ్రమకే పేరు ఈ భ్రిమ నేను నీవు ఈ మేను ప్రపంచములు యెరుక మరుపులు అను ఈ రెండు భ్రమయే యని తెలుసుకొనుమని భావము.

కం॥ యెరుకసుమీ బ్రహ్మనినను
యెరుకసుమీ. మాయయనిన • యెరుకేజీవుం
డెరుకసుమీ ఈశ్వరుడన
యెరుకసుమీ నేను విశ్వ • మిదిసత్యమురా. ॥౧౩౬॥

ఓ శిష్యుడా! బ్రహ్మమాయ జీవుడు ఈశ్వరుడు నేను విశ్వము అను

నవి అన్నియు యెరుకేనని తెలుసుకొనుమని భావము.

కం॥ మాటసుమీ నేననినను
మాటసుమీ మాయ యనిన • మరిజీవశివుల్
మాటసుమీ బ్రహ్మనినను
మాటసుమీ మేనుజగము • మాటేసుమ్మీ. ॥౧౩౨॥

ఓ శిష్యుడా! నేను మాయ జీవేశ్వరులు బ్రహ్మ మేను ప్రపంచములు అనునవి అన్నియు మాటయేయని తెలుసుకొనుమని భావము.

కం॥ ప్రకటనమగు బింబమందున
ముకురము ముకురస్థబింబ • ములు లేవెపుడున్
ముకురంబువలన బుట్టును
ముకురస్థము దానివలన • ముకురముదోచున్. ॥౧౩౮॥

ఓ శిష్యుడా! ప్రసిద్ధమైన బింబమునందు అద్దము అద్దములో నుండె బింబములు సర్వదాలేవు అద్దమువలన అద్దములో నుండునవి బుట్టును దాని వలన అద్దము కనబడునని భావము.

కం॥ లేనినీరాకడే స్వ
ప్నానందము నీకుగురుడు • పరిపూర్ణంబున్
పూని తెలిపి మేల్కొల్పిన
నేననకను నీవుబోవ • నీ మేల్కాదిరా. ॥౧౩౯॥

ఓ శిష్యుడా! లేని నీరాకడయే స్వప్నానందము వంటిది సద్గురుమూర్తి నీకు ప్రేమతో పరిపూర్ణమును చూపించి మేలుకొల్పిన తరువాత నేను అని అనుకొనక నీవు పోవుటయే నీ మేల్కాయగునని భావము.

కం॥ తనకు దానొరులు చణకిన
ధ్వనిబుట్టినిచోట బ్రహ్మ • తనుదా నొరులున్
చనకినధ్వని గలచోటది
వినుమాయయు లేనిమాయ • విడు లేననినన్. ॥౧౪౦॥

ఓ శిష్యుడా! తనకు తానుగాని యితరులుగాని తాకిన శబ్దములేని స్థలము బ్రహ్మ (పరిపూర్ణము) తనకు తానుగాని యితరులు గాని తాకిన శబ్దముగల స్థలము మాయయని తెలుసుకొనుము లేనన్న లేనిమాయను విడువుమని భావము.

కం॥ మనసుకు వాక్కుకు దెలియని
ఘనవస్తువు బయలటంచు • గని యీ రెంటిన్
నినునను విశ్వముగాగని
వినుమూలము లేనివిటి • విడరా శిష్యా ॥౧౪౧॥

ఓ శిష్యుడా! మనసుకు వాక్కుకు తెలియని గొప్పవస్తువ పరిపూర్ణమని తెలుసుకొని ఆమనస్సును వాక్కును నినునన్ను ప్రపంచమని భావించి మూలములేని వీటిని వదలుమని భావము.

కం॥ కలలోవానికి మేలుక
గలదని గుర్తెరుగవశమె • కలమేల్కనినన్
కలవాడుగలదె తెలియను
తలపోయుము నిన్ను నీవు • తగనీరీతిన్. ॥౧౪౨॥

ఓ శిష్యుడా! కలలోనున్నవానికి మేలుకగలదని గుర్తించుట కుశక్యము గాదు కలనుండి మేలుకొన్న తరువాత కలలోనున్నవాడు యుండడు నిన్ను నీవు యీ రీతిగ తెలుసుకొమ్మని భావము.

కం॥ కలవాదువాని చదువులు
గలవా తామేలుకనిన • గనుగొనుమటులన్
కలనిన్ను నీదుచదువులు
ఫలమేమిక చాలు పెక్కు • పలుకుల తండ్రి. ॥౧౪౩॥

ఓ నాయనా! కలలో వాదించేవాని చదువులు కలనుండి మేలుకొన్న తరువాత నుండవు ఆరీతిగానే కలలోపలి నిన్ను నీ చదువును గుర్తించిచూడుము యెక్కువ మాటలతో ఫలములేదని భావము.

కం॥ కలరాజు సకల సంప
త్కలితుండై తాను మేలు • కన లేడెచటన్

కలనిన్ను వానివిధమున
దలపుము తలచితివె చాలు • ధన్యచరిత్రా. ॥౧౪౪॥

ఓ ధన్య చరిత్రుడా! స్వప్నములో నున్న రాజు సమస్త సంపదలతో గూడియుండి తాను మేలుకొనగా యుండడు ఉన్న నిన్ను ఆ స్వప్నములోని రాజువలెనె తలంచుకొనుము అట్లు తలంచు కుంటె చాలునని భావము.

కం॥ ఏ నిర్ణయమును జేయుడు
నేననని మహాత్ముడెపుడు • నేననువాడే
నానావిధాల వదురును
నేనను తనవంటి వారి • నెప్పుడు గనినన్. ॥౧౪౫॥

ఓ శిష్యుడా! నేనుయనె అహం భావములేని మహాత్ముడు యేసిద్ధాంత మును చేయుడు నేను అని అహంభావము గలవాడు తనవంటి వారిని చూచిన వెంటనే నానావిధములుగా వదురుచుండునని భావము.

కం॥ మలుకలులే వీతోవను
చులుకనగా దెలియవచ్చు • సుజనులకెల్లన్
తలుపదగు దీని నెప్పుడు
మలుకల తోవలకుబోక • మాన్య చరిత్రా. ॥౧౪౬॥

ఓ మంచి నడక గలవాడా! యీ పరిపూర్ణబోధ మార్గమునందు యేవిధ ములగు కష్టములులేవు సులభముగా తెలుసుకొన వచ్చును సజ్జనుల కందరికి ధ్యాన్నించుటకు వీలుగానుండు దీనిని తప్పుదోవలకుబోక సర్వదా ధ్యాన్నించు మని భావము.

కం॥ నామాట నమ్మవేమో
నీ మానస మెరుగకంటి • నేనీ మాటన్
నామాట పథ్యమైనను
యే మారకు దీన్ని నీవి • కెప్పటి కప్పా. ॥౧౪౭॥

ఓ నాయనా! నీవు నామాట నమ్మకుండ వచ్చును నీ మనస్సు

తెలియకుండుటచే నేను యీ మాటనంటిని నేను చెప్పినమాట యిష్టమైతె ఈపరిపూర్ణబోధను విడువకుమని భావము.

కం॥ సిద్ధాంతోక్తులుయివి నీ
బుద్ధికి దెలిసుండి చదువ । బోకుము వీటిన్
బద్ధులవినుమని వారలు
యుద్ధమునకు కాలుదువ్వ । చుందురు పెలుచన్. ౧౪౮॥

ఓ శిష్యుడా! ఇవి సిద్ధాంతమైన మాటలు యివి తెలిసియున్న నీవు బద్ధులను వినుమని చదువకు వారు కయ్యానికి కాలు దువ్వెదరని భావము.

కం॥ ముద్దుగ యీగ్రంథంబును
పెద్దల ముందరవచింప । విరిదివియకుమీ
దిద్దెదరు తప్పులున్నను
వద్దనకను దిద్దనివ్వ । వరకీర్తినిధీ. ౧౪౯॥

ఓ మంచికీర్తి గలవాడా! ఈ గ్రంధము సత్పురుషుల ముందర చదువుటకు వెనుకదీయకుము దీనియందు తప్పులుంటె వారు దిద్దెదరు. వారిని వద్దనకుండ దిద్దనివ్వుమని భావము.

కం॥ నేనుగల మేనులేదని
మేనున నీవుండి యిట్లు । మిడుకుటమేలా
మేనునువిడి చను వినియెదు
మానుగ నీవనకయున్న । మాయవెసుమ్మీ. ౧౫౦॥

ఓ శిష్యుడా! నేనువున్న శరీరములేదని ఆశరీరముయందు నీవు యుండి ఇట్లు బాధపడుట మంచిదికాదు యీ శరీరమును విడిచి పొమ్ము (నేను చెప్పుచున్నది) వినుచున్నావు. నీవు మారుబలుకకయున్న మాయవే సుమా అని భావము.

కం॥ కట్టెలు పిడుకలులేకను
యెట్టుంబలె నిప్పునిల్వ । కేగునా పుడమిన్
అట్టుంబలె నే నీవును
యిట్టిశరీరంబులేక । నెందుందువురా. ౧౫౧॥

ఓ శిష్యుడా! ప్రపంచములో కట్టెలు పిడుకలు లేకుండ నిప్పుయుండ నట్లు నేను నీవు శరీరములేకుంటె నీవు యెక్కడ వుండవని తెలుసుకొనుమని భావము

కం॥ తనువునే గాననంటే
ఘనసుఖదుఃఖములు రెండు । గనుపడె నీవై
గనుకతనువు నీవొక్కటె
వినరా నామాట నిట్టి । వెర్రిన బడకన్. ౧౫౨॥

ఓ శిష్యుడా! నేను శరీరమును కాదుయని యంటె సుఖదుఃఖములు అను రెండును నీస్వరూపముగా కనబడుచున్నది కాబట్టి నీవు నీశరీరము ఒక్కటిగానే తెలుసుకొనుము యిట్టి భ్రమలో బడక నామాట వినుమని భావము.

కం॥ ఎరుకలేనట్టి బయలున
బిరబిర నరుదెంచి యెవరు । బిలువనిదె తా
నరసి పరిపూర్ణమున్నది
యెరుకేగితె చాలు లేని । దెరుకనిలేకన్. ౧౫౩॥

ఓ శిష్యుడా! యెరుకలేని పరిపూర్ణమునందు సరసరవచ్చి యెవ్వరు పిలువకుండగనే తాను పరిపూర్ణమున్నది చూచి యెరుకపోయితె చాలును లేకుండ లేనిదె యెరుకయని తెలుసుకొనుమని భావము.

కం॥ తనువునే గాననంటిని
విను సుఖదుఃఖములు యెవరి । విర నాతోడన్
వినజెప్పుము నేవినియెద
తనయా తప్పితివె నిన్ను । దండింతుసుమీ. ౧౫౪॥

ఓ నాయనా! నేను శరీరమును కాదనంటివి గొప్పనైన యీ సుఖ దుఃఖములు యెవరివో నాకు తెలియునట్లు చెప్పుము నేను వినియెదను చెప్పు టములో పొరపాటు పడితివేని నిన్ను శిక్షింతునని భావము.

కం॥ అందరిమాటల కురికే
వెందుకు నామాటనమ్ము । మిదెచాలును యీ

యందురులేని బయలు గని
యందున నీలేమి నెరిగి । యరిగితె సరిరా. ౧౫౫॥

ఓ శిష్యుడా! నీవు అందరి మాటలు విని యెందుకు ఉరుకుచున్నావు. నామాట నమ్ముము యింతెచాలు వీరందరులేనట్టి పరిపూర్ణమునుచూచి ఆపరి పూర్ణములో నీలేమిని గుర్తించి పోయితె చాలునని భావము.

కం॥ నాబోతురుచికి రుచినిడు
నీబోధ నపేక్షచేత । నేర్చినవారిన్
యేబాధలు బాధింపవు
బాబూ యిదినీవు నేర్చి । పఠియింపగదే. ౧౫౬॥

ఓ నాయనా! మధురపదార్థముల రుచికంటె అధికమగు రుచిని కలిగించు ఈ పరిపూర్ణబోధను ప్రేమతో నేర్చుకొన్నవారికి యేబాధలు యుండవు కాబట్టి ఈ పరిపూర్ణబోధను నీవు ప్రేమగా నేర్చుకొని జదువుకొనుమని భావము.

కం॥ తాము తమతప్పు నెరుగక
నామాటలు తప్పులనుచు । నవ్వే జనముల్
సామాన్యులనుచు దెలియుము
నీమానస మందులెస్స । నిరుపమ సుగుణా. ౧౫౭॥

ఓ ఉపమాన రహితమైన మంచిగుణము గలవాడా! ప్రపంచములోని వారు తమతప్పు తాము తెలుసుకొనకనే నామాటలను తప్పులని పరిహసింపు చుందురు. కాబట్టి ఆమానవులను సామాన్యులని నీమనస్సులో తెలుసుకొను మని భావము.

కం॥ దప్పొప్పున జనినట్టుగ
నిప్పున చలిబాసినట్లు । నిజమోగిరమున్
వొప్పుగ దిన్నప్పుడె క్షుధ
దప్పినగతి బోధవిన్న । దప్పును బాధా. ౧౫౮॥

యందురులేని బయలు గని
యందున నీలేమి నెరిగి । యరిగితె సరిరా. ౧౫౫॥

ఓ శిష్యుడా! నీవు అందరి మాటలు విని యెందుకు ఉరుకుచున్నావు. నామాట నమ్ముము యింతెచాలు వీరందరులేనట్టి పరిపూర్ణమునుచూచి ఆపరి పూర్ణములో నీతేమిని గుర్తించి పోయితె చాలునని భావము.

కం॥ నాబోతురుచికి రుచినిడు
నీబోధ నపేక్షచేత । నేర్చినవారిన్
యేబాధలు బాధింపవు
బాబూ యిదినీవు నేర్చి । పఠియింపగదే. ౧౫౬॥

ఓ నాయనా! మధురపదార్థముల రుచికంటె అధికమగు రుచిని కలిగించు ఈ పరిపూర్ణబోధను ప్రేమతో నేర్చుకొన్నవారికి యేబాధలు యుండవు కాబట్టి ఈ పరిపూర్ణబోధను నీవు పే్రిమగా నేర్చుకొని జదువుకొనుమని భావము.

కం॥ తాము తమతప్పు నెరుగక
నామాటలు తప్పులనుచు । నవ్వే జనముల్
సామాన్యులనుచు దెలియుము
నీమానస మందులెస్స । నిరుపమ సుగుణా. ౧౫౭॥

ఓ ఉపమాన రహితమైన మంచిగుణము గలవాడా! ప్రపంచములోని వారు తమతప్పు తాము తెలుసుకొనకనే నామాటలను తప్పులని పరిహసింపు చుందురు. కాబట్టి ఆమానవులను సామాన్యులని నీమనస్సులో తెలుసుకొను మని భావము.

కం॥ దప్పృప్పున జనినట్లుగ
నిప్పున చలిబాసినట్లు । నిజమోగిరమున్
వొప్పుగ దిన్నప్పుడె క్షుధ
దప్పినగతి బోధవిన్న । దప్పును బాధా. ౧౫౮॥

భావమున దెలసి యిద్దరు
నావిధమున నడువవలయు • నందరు మెచ్చన్. ॥౧౬౨॥

ఓ శిష్యుడా! దేవుడు తెమ్మని అడుగడు జీవుడు లేదని కోపగించు కోడు ఒకరిభావము నొకరు తెలుసుకొని ఆరీతిగానందరు మెచ్చుకొనునట్లు (గురుశిష్యులు) యిద్దరు నడువవలయునని భావము.

కం॥ కోటివిధంబుల జెప్పిన
చేటొదవెటితనదు పూర్వ • చేష్టలువిడకన్
చాటున నేటున ద్వివిధము
గాటనమొనరించు నతని • కతుకునెబోధా. ॥౧౬౩॥

ఓ శిష్యుడా! యెన్నివిధాల జెప్పినప్పటికి చెరుపును గలిగించే తన పూర్వచేష్టలను వదలక చాటుకొకతీరు నేటుకొకతీరు నటించెవానికి యీ పరి పూర్ణబోధ మనస్సుకు నాటదని భావము.

కం॥ బంగారువంటి యీబో
ధాంగీకరుణులను జేరి • యదివిని వారిన్
భంగపరచ దలచెటి యా
వెంగళులకు జెప్పకుమని • వేడెదనిన్నున్. ॥౧౬౪॥

ఓ శిష్యుడా! బంగారువంటి యీ పరిపూర్ణ బోధను విన్నవారి వద్దకు పోయి ఆబోధనువిని వారి నవమానించె నీచాత్ములకు యీ బోధ చెప్పవద్దని నేను నిన్ను వేడుచున్నానని భావము.

కం॥ సదమలగురు వెవరనినను
యిదుగోబయ లిదుగోలేని • యీ గురుతెరిగే
టిదగుశరీరము దీనిని
వదలుమనుచు నీకుజెప్ప • వచ్చినవారే. ॥౧౬౫॥

ఓ శిష్యుడా! నిర్మలమగు సద్గురుమూర్తి యెవరనగా ఇదుగో పరి పూర్ణము ఇదుగోయీలేని గుర్తును తెలుసుకొనునట్టి శరీరము దీనిని వదలుము అని నీకు బోధించుటకు వచ్చినవారేనని తెలుసుకొనుమని భావము.

కం॥ రోగపు చేష్టలు బోయిన
రోగము గలదనిన మాడ్కి • రోయకనిన్నున్
నీగుర్తెరుగుట మఱగిన
నేగలనన నీదుమాట • నిశ్చయమటరా॥ ॥౧౬౬॥

ఓ శిష్యుడా! రోగమునకు యుండెలక్షణములు బోయిన తరువాత రోగము యున్నదన్నట్లు అసహ్యము లేకుండ నిన్ను నీగుర్తును తెలుసుకొనుట పోయినతరువాత నేను వున్నాను అనే మాట నిజముకాదని భావము.

కం॥ దిచ్చు తనవు శిష్యుని మది
నొాచ్చిన ధనమివ్వడనుచు • నూహించిమదిన్
యిచ్చకము లాడబోకను
చచ్చెర ఝూడించువాన్ని • సద్గురుడైతే. ॥౧౬౭॥

ఓ శిష్యుడా! గురువుమంచి వాడైతె వ్యభిచారియగు తనశిష్యుని మనస్సు నొాచ్చినచో తనకు ధనమియ్యడని తనమనస్సులో ఆలోచించి వానికి యిష్టమగు మాటలు చెప్పక మాటిమాటికి శిక్షించునని భావము.

కం॥ గురుడు తననెంత మెచ్చిన
వరశిష్యుడు లోగితిరుగ • వలయును మదిలో
మురసి భయభక్తి లేకను
తిరిగిన చేటొాదవునిజము • తెలియగదోయీ. ॥౧౬౮॥

ఓ శిష్యుడా! తనగురువు తన నెంత మెచ్చుకున్నను మంచి శిష్యుడు వినయముగా తిరుగుచుండ వలయును గురువు తనను మెచ్చుకుంటున్నాడని తన హృదయములో మురసి భయ భక్తులులేక తిరుగుచుండెడి శిష్యుడు నిజముగా చెడిపోవునని తెలియుమనీ భావము.

కం॥ గురుశిష్యుల లక్షణములు
గురుశిష్యుల బోధరీతి • గురు గీతార్థం
బెరిగిన నరులకె మెప్పగు

నెరుగని యామూఢనరుల • కిష్టతియానే. ॥౧౬౯॥

ఓ శిష్యుడా! గురుశిష్యుల లక్షణములుగురుశిష్యుల బోధ పద్ధతులు గురుగీతార్థములను తెలుసుకున్న మానవులకే (యీబోధ) ఇష్టమగును కాని తెలియని ఆమూర్ఖులకు ఇష్టముగాదని భావము.

కం॥ స్థిరముగ నిల్చేదైతె
పరుగెత్తక భ్రాంతినిల్వ • బడదా భువిలో
నరులు విమర్శించిన తా
నురుకుటమది యెందుకోస • మూహనుకనరా. ॥౧౭౦॥

ఓ శిష్యుడా! ప్రపంచములో భ్రాంతిస్థిరముగా నుండునది అయితె పారిపోకుండ నుండవలయును మానవులు భ్రాంతిని విమర్శించగా పరుగెత్తి పోవుట యెందుకొరకో నీ మనస్సులో ఆలోచించి చూడుమని భావము.

కం॥ తనసంతతి పై గలదయ
తనశిష్యుని మీదనుంచ • దగు గురుడెపుడున్
తనధనము మనుసు తనువులు
తన గురునివటంచు దల్చ • దగుశిష్యునకున్. ॥౧౭౦॥

ఓ శిష్యుడా! సద్గురుమూర్తి తనబిడ్డలమీద యెంతదయ గలిగి యుండునో శిష్యుల మీదగూడ నంతదయగలిగి యుండ వలయును. శిష్యుడు తన ధనము మనస్సు శరీరము సర్వదా తన గురునివే యని తలంచుచుండ వలయునని భావము.

కం॥ శూరత్వమాత్మ పనికై
వైరాగ్యము గురునిగొల్చు • వర్తనకెపుడున్
యీరీతి వృత్తిగల్గిన
నారీనరులేగి చొరరె • నరకములోనన్. ॥౧౭౨॥

ఓ శిష్యుడా! తమ ప్రయోజనము కొరకై వైరాగ్యముబొంది శూరత్వముతో గురుమూర్తిని సేవించె పరివర్తనకు సర్వదా యీ వ్యాపారము గలిగిన స్త్రీ పురుషులు నరకము బొందుదురని భావము.

కం॥ మనసున నొకటిదలుచు వా
క్కున నొకటి బలుకుచుండు • కుటిలుడు మరితా
తనువున నొక్కటి జేయును
వినువానికి బోధదెల్ప • విహితమటోయీ. ॥౧౨౩॥

ఓ శిష్యుడా! దుష్ట హృదయుడగు మానవుడు తన మనస్సులో నొకటి తలంచును మాటలతో నొకటి చెప్పును శరీరముతో నొకటిచేయును యిట్టివాడు వినదలంచినను వానికి యీ పరిపూర్ణ బోధను బోధించుట మంచిదికాదని భావము.

కం॥ మనసున వాక్కున తనువున
పనియొక్కటె జరుపునట్టి • భక్తునికి దయన్
వినిపించుము వినుమని యీ
ఘనబోధను వానకతుక • గలదుడుగకుమీ. ॥౧౨౪॥

ఓ శిష్యుడా! మనస్సుతోను మాటలతోను క్రియలతోను ఒకేరీతి వర్తించు భక్తునికి దయతో యీ గొప్పనగు బోధను వినుమని బోధించుము వాని హృదయమునకు యీ బోధ అతుకను కాబట్టి ఊరుకొనక బోధించుమని భావము.

కం॥ మేలైన బోధవినుటకు
చాలా విఘ్నములు వచ్చి • సమకూడినయే
లీలన్ విడు సచ్ఛిష్యుడు
వాలాయము బోధయందె • వర్తించుసుమీ. ॥౧౨౫॥

ఓ శిష్యుడా! మంచిగుణముగల శిష్యుడు నిర్మలమగు బోధవినుటకు యెన్ని ఆటంకములు వచ్చిచేరినను బోధవినుట విడువడు నిశ్చయముగా బోధను వినుటయందె యుండునని భావము.

కం॥ గురుడు తనయాజ్ఞలోపల
చెరియింపగ గోరునట్టి • శిష్యునకిపుడున్
దురితంబు వృద్ధియై తా
నరకమునన్ గూలకున్నె • నరనుతచరితా. ॥౧౨౬॥

మానవులచేత స్తోత్రింప బడుచున్న చరిత్రగల ఓ శిష్యుడా! తన గురువు తన ఆజ్ఞకోనుండ వలయునని కోరునట్టి శిష్యునకు పాపమెక్కువయ్యి ఆశిష్యుడు నరకములో బడునని భావము.

కం॥ గురుకను సౌజ్ఞనుగనుగొని
పరిచర్య యొనర్చు చుండు। భక్తుడు భక్తిన్
పరిపూర్ణబోధ జెందును
పరమోదార ప్రచండ। బంగరుకొండా. ౧౭౭॥

పరమోదార స్వభావముగల బంగరుకొండవంటి ఓ శిష్యుడా! గురు మూర్తియొక్క కనుసౌజ్ఞతో శుశ్రూషచేయు మంచి శిష్యుడు భక్తితో పరిపూర్ణ బోధను పొందునని భావము.

కం॥ ప్రాకటముగ నిద్దుర యిక
యేకథలను వినినరాదు। యీబోధందున్
రాకుండదేమి చిత్రము
ప్రాకృత నరమూకకెల్ల। పావనచరితా. ౧౭౮॥

ఓ పవిత్ర చరిత్రుడా! పామరులగు మానవులకు యేకథలను విను చున్నప్పటికి నిదురవచ్చును అదేమి చిత్రమోగాని యీబోధ వినుచుండగా యేమాత్రము నిదురరాదని భావము.

కం॥ కొత్తదంపతుల కూటమి
నెత్తెరగున లేమలంత। నిదురలు బోకన్
మొత్తములై కనునటువలె
బత్తలదిరిగేటి చిన్న। బాలలకగునే. ౧౭౯॥

ఓ శిష్యుడా! కొత్తదంపతులు కూటమిని స్త్రీలంత నిదురలు బోక గుంపులు గుంపులుగా చేరిచూచినట్లు చిన్నపిల్లలు చూడరని భావము.

కం॥ మనసరయక ప్రజలనువిను
మని చదువకు బోధబాధ। యనియిండ్లల్లో
పనులన్ని యాదిజేసుక
చనియెద రాసమయమంద। సహ్యామున సుతా. ౧౮౦॥

ఓ బిడ్డా ! నీవు యీగ్రంథమును చదువునపుడు యితరుల మనస్సును తెలుసుకొనక ఆ మానవులను వినుమని చదువకు యీబోధ బాధయని యనుకొని తమ యిండ్లలోని పశువులను జ్ఞాపకము చేసుకొని అపహ్యాసముగా బోదురని భావము.

కం॥ పీనుల వినడీబోధను
నేనేబ్రహ్మనని నిక్క । నీల్గెడి వాడున్
మానికము గానవచ్చిన
దానిని రాయనుచు దలచు । తార్కికుని గతిన్. ౧౮౦॥

ఓ శిష్యుడా ! నేనే బ్రహ్మనని నిక్కినీల్గెడి మానవుడు యీబోధను తన చెవులతో వినడు అట్లనే మాణిక్యము కనబడితె తాను తార్కికునివలె దానిని రాయిగ తలంచుచుండునని భావము.

కం॥ ఒకరువిని మెచ్చవలెనని
సకల పురాణములు వేద । శాస్త్ర శ్రౌత
ప్రకరమునునేర్చు విద్వ
న్నికరం బీబోధమెచ్చ । నేర్చునె సుమతీ. ౧౮౨॥

ఓ మంచిబుద్ధిగలవాడా ! ఇతరులువిని తనను మెచ్చుకొనవలయునని సమస్తమైన వేదవేదాంత శాస్త్రపురాణ ఇతిహాసములను శ్రౌతమును నేర్చుకొనెడి విద్వాంసుడు యీ బోధను మెచ్చనేర్వడని భావము.

కం॥ సాధారణముగ దెల్పకు
మీధర మానవులబిల్చి । యీబోధను బల్
మేధానిధి యాచించిన
బోధించుము వద్దులోభ । బుద్ధిసుబుద్ధీ. ౧౮౩॥

ఓ మంచిబుద్ధి గలవాడా ! ప్రపంచములోగల మానవులను బిలచి సామాన్యముగా యీబోధను బోధింపకుము మంచి తెలివిగలవాడు అడిగితె లోభబుద్ధి లేకుండ బోధింపుమని భావము.

కం॥ ఏబోధ శిష్యులకుగల
యాబాధల నణచివేసు । నదెసద్బోధా
ఆబోధ యేదియనినను
యీబోధేసుమ్మి దీన్ని । యికవిడువకుమీ. ౧౮౪॥

ఓ శిష్యుడా ! యేబోధ శిష్యులకుగల బాధలను తీసివేయునో అదె సద్బోధ అట్టిబోధ యేదియనగా యీపరిపూర్ణబోధయే సుమా కాబట్టి దీనిని సర్వదా విడువకుమని భావము

కం॥ హెచ్చైనబోధదెల్పే
సచ్చరితుల కియ్యలేరు । జనులు ధనంబుల్
గచ్చులుగొట్టే దిచ్చుల
కిచ్చినకిర్య నిట్టినృతతి । నేమననోయీ. ౧౮౫॥

ఓ శిష్యుడా ! దంబములుగొట్టె మోసకులకు మానవులు ధనమును యిచ్చినట్లు మిక్కిలి మంచిబోధలను బోధించె సత్పురుషులకు యివ్వలేరు ఈమానవులను యేమనవలయునో తెలియదని భావము.

కం॥ నీమదికీ నిజబోధన్
పేర్మితో నాటించ దలచి । పెక్కువిధములన్
నేమొదలు బెట్టిజెప్పితి
దేమాత్రము రాత్రిబగలు । యేమారకమీ. ౧౮౬॥

ఓ శిష్యుడా ! నీమనస్సుకు నిజముగ యీ పరిపూర్ణబోధ నాటవల యునని పేర్మితో అనేక విధములుగా నేను ఆరంభించి చెప్పితిని రాత్రి పగలు అనక దీనిని యేమాత్రము విడువకుమని భావము.

కం॥ కమలంబులున్న కొలనుకు
భ్రమరము లేతెంచినట్లు । బాగుగబోధన్
తమమంగోరె గురునిపద
కమలములనుగొల్వ సుజన । గణమేతెంచున్. ౧౮౭॥

ఓ శిష్యుడా ! తామర పువ్వులుయున్న కొలనుకు తుమ్మెదలు వచ్చి నట్లు యీ పరిపూర్ణబోధను చక్కగా బొందవలెననే కోరికతో సద్గురుమూర్తి

పాదకమలముల వద్దికి సజ్జన సమూహము వచ్చునని భావము.

కం॥ సురవరుడ హల్యకోసము
మరులొందిన రీతి నెపుడు । మరుగుదు రజ్ఞుల్
పొరుగూరి సాధులకు తమ
పురమునగల సాధులందు । బుద్ధినిలుపకన్. ౧౭౮॥

ఓ శిష్యుడా ! దేవేంద్రుడు అహల్యకొరకు మోహమును పొందినట్లు అజ్ఞానులగు మానవులు తనవూరిలోనున్న సత్పురుషుల యందు బుద్ధినిలుపక పొరుగూరి సాధువులయందు నిలుపుదురని భావము.

కం॥ నేనీకు జెప్పబూనిన
యీనిజసద్బోధ మనసు । కిమిడిన వెనుకన్
నీనాపని దీరునురా
వోనాముద్దులకుమార । వోనగ ధీరా. ౧౭౯॥

ఓ నాముద్దులకుమారా ! మంచి ధైర్యము గలవాడా ! నేను నీకు జెప్పుటకు నారంభించిన యీపరిపూర్ణబోధ నీమనస్సునకు పట్టిన తరువాత నీపని నాపని పూర్తి యగునని భావము.

కం॥ త్ర్యక్షుని నిందించినయా
దక్షునిగని ప్రాణమిడిన । త్ర్యక్షసతివలెన్
యీక్షితి తనదేశికుని ను
పేక్షించిన జనుల తా ను । పేక్షించదగున్. ౧౮౦॥

ఓ శిష్యుడా ! శివుని నిందించిన దక్షప్రజాపతిని చూచి ప్రాణములు వదలిన పార్వతిదేవివలె యీ ప్రపంచములో తన గురువును ఉపేక్షించిన ప్రజలను తానుగూడ ఉపేక్షించ వలయునని భావము.

కం॥ గురుని కపరాధియగు నా
నరనాధుని ద్రుపదునొంచు । నరుని విధమునన్
ధరసచ్ఛిష్యవరుడు తన
గురు శత్రునిచేతనైతె । క్రొవ్వణచదగున్. ౧౮౧॥

ఓ శిష్యుడా! తనగురువగు ద్రోణాచార్యులకు అపరాధము చేసిన రాజు యగు ద్రుపదున్ని అవమానించిన అర్జునునివలె ప్రపంచములో సచ్ఛిష్యుడు తన గురువుకు శత్రువైనవానిని తనకు చేతనైతె వాని గర్వమును అణచ వలయునని భావము.

కం॥ కాకులవలె కూకలిడే
లోకుల కీకలకు బెదరి • లోగుందకటన్
మూకత్వమూనుచాలు
వివేకుడవై యుంటివేని • విని నామాటా. ॥౧౯౨॥

ఓ శిష్యుడా! కాకులవలె అల్లరిచేసె మానవుల అల్లరులకు భయపడి నీ మనస్సులో బాధపడకు ఆ సమయమున మూగవానివలె నుండుము అంతే చాలును వివేకము గలవాడవైతె నామాట వినుమని భావము.

కం॥ పెద్దల నెవరినిజూచిన
ముద్దుగ మాట్లాడి వారు • ముదమునజెప్పె
సుద్దుల కడ్డముజెప్పక
నొద్దికతో మ్రొక్కివినుము • వోపుణ్యతమా. ॥౧౯౩॥

ఓ పుణ్యతముడా! నీవు యే పెద్దలను చూచినను వారితో ముద్దుగ మాట్లాడి సంతోషముగా వారుచెప్పు మంచిమాటలకు యెదురుచెప్పక ఓపికతో వారికి నమస్కరించి వినుమని భావము.

కం॥ తనహిత వెరుగని మనుజుడు
వినడాప్త జనోక్తి దుష్ట • వృత్తిగల సుయో
ధనుడు దశాననుడు హిత
జనవాక్యము వినకగాదె • సమసిరిరువురున్. ॥౧౯౪॥

ఓ శిష్యుడా తనమంచిని తెలుసుకొనని మానవుడు తనమిత్రులు జెప్పె మాటలను వినడు అదియెట్లంటె దుష్టులగు దుర్యోధనరావణు లిద్దరు తమ హితుల మాటలు వినకనే చచ్చిరని భావము.

కం॥ ఎన్నోగ్రంథ జలధులను

తిన్నగ మధియించిచూస్తె • తేలెను సారం
బున్న బయలుగని మృషయగు
నిన్నున్ నీమేను మృషని • నిలువకు మనుచన్. ॥౧౯౩॥

ఓ శిష్యుడా! అనేక గ్రంథములనే సముద్రములను బాగ మధించిచూచితె సారము తేలినది-ఉన్న పరిపూర్ణమును చూచి మిథ్యయగునిన్ను నీశరీరమును అసత్యమని తెలుసుకొని నిలువకుమని తేలినదని భావము.

కం॥ కనక సుమగంధ వాసన
తనకౌనగా దలచి షట్ప • దముగొన దటులనన్
వినదు లేనహమె బ్రహ్మం
బనిపల్కె నృతతి నిల్వ • నని యీబోధన్. ॥౧౯౬॥

ఓ శిష్యుడా! సంపంగి పువ్వుయొక్క వాసన తనకు మరణమిచ్చునని తెలిసి తుమ్మెద ఆ పువ్వును వాసనచూడదు అట్లనే లేని యెరుకే బ్రహ్మయని చెప్పెమానవ సమూహము నిల్వనని తలంచి యీ బోధను వినరని భావము.

కం॥ హద్దుసుమీ గురునాజ్ఞన
ముద్దుసుమీ గురునిసేవ • ముదమున జేయన్
పద్దుసుమీ యట్లుండుట
వద్దుసుమీ గురునితోటి • వాదించుటమున్. ॥౧౯౭॥

ఓ శిష్యుడా! గురువు ఆజ్ఞ అనగా పొలిమెరవంటిది సంతోషముగా గురునిసేవజేయుచు యిట్లుండుట మంచిని గురువుతో వాదోపవాదములు చేయ వద్దని భావము.

కం॥ జంభాల పోతుగోరునె
సంభవ నాశముల బాపు • చక్రనిబోధన్
కుంభిని షండునకుండునె
రంభా సంభోగవాంఛ • రంభను గనినన్ ॥౧౯౮॥

ఓ శిష్యుడా! దంభాచారియగు మానవుడు జననమరణ భ్రాంతి

రహితమగు యీ బోధనుకోరడు ప్రపంచములో రంభను చూచిన నపుంసకునకు ఆరంభా సంభోగమందు కోరికయుండదని భావము.

కం॥ పతిభక్తిగల యువతివలె
సతతము గురుభక్తి గలిగి • సచ్ఛిష్యుడిలన్
స్థితిగుదుర సేవజేయును
ప్రతిరహితాద్భుత చరిత్ర • పరమపవిత్రా ॥౧౯౯॥

ఉపమాన రహితమగు ఆశ్చర్యకరమైన చరిత్రగలిగిన మిక్కిలి పవిత్రుడవగు ఓ శిష్యుడా! భర్తయందు భక్తిగలిగిన ఆడదానివలె సచ్ఛిష్యుడు గురుభక్తి గలవాడై యీ ప్రపంచములో తనకు స్థితిగలుగునట్లు సేవజేయునని భావము.

కం॥ జఠర జనితులైనను బహు
కఠిన మనస్కులకు ఘోర • కలుషాత్ములకున్
శఠులకు జడమతులకివకు
పఠనా సక్తులకు బోధ • పట్టమటంచున్. ॥౨౦౦॥

ఓ శిష్యుడా! తల్లిగర్భములో బుట్టినను మిక్కిలి కఠిన హృదయులకు భయంకరములగు పాపములు చేసినవారికి శఠవాదులకు బుద్ధిమాన్యులకు కేవలము జదువుటయందే ఆసక్తిగలవారికి యీ బోధ బట్టుమని యివ్వకుమని భావము.

కం॥ కప్పురము నిప్పుగలసే
చొప్పున వెలిగవల కండ్ల • జూస్తుండగనే
తప్పునగన రావట్లనె
యిప్పుడు నిను నన్ను బోధనెరుగుము బుద్ధిన్. ॥౨౦౧॥

ఓ శిష్యుడా! కర్పూరము నిప్పునకలసినరీతి ప్రకాశించి తరువాత కండ్లతో చూచుచుండగనే తటక్కున కనపడనట్లు యిప్పుడు నిబుద్ధితో నిన్ను నన్ను యీ బోధను తెలుసుకొనుమని భావము.

కం॥ దీవించి యిస్తినేనీ
సేవించిన సేవ మెచ్చి • చిత్తములోనన్

కావించు మెపుడు గానము
భావించిది ముఖ్యమనుచు • పావనశీలా. ॥౨౦౨॥

ఓ మంచిశీలము గలవాడా! నీవుచేసిన శుశ్రూషకు నాహృదయములో మెచ్చి ఆశీర్వదించి నీకు నేను యీ బోధను బోధించితిని యిదేముఖ్యమని భావించిదీనిని సర్వదా పాడుకొనుమని భావము.

కం॥ అని గురుడు బోధజేసిన
విని శిష్యుడు హర్షమొంది • వేడుక తోడన్
తన గురుని తోటి విజ్ఞా
పన మీరీతిగ నొనర్చె • పటువాక్ప్రౌఢిన్ ॥౨౦౩॥

ఈ ప్రకారముగా సద్గురుమూర్తి ఉపదేశించిన విని శిష్యుడు సంతోషమున తన గురుమూర్తితో మంచిమాటల నేర్పుగలిగి ఈరీతి విజ్ఞాపన చేసెనని భావము.

కం॥ నాకొరకు కష్టపడితిరి
మీకై మీరిటకువచ్చి • మిముబొగడుటకా
కాకోద రేశుడోపం
డాకార్యము నాతరంబె • యచల మనస్కా. ॥౨౦౪॥

పరిపూర్ణ మానసముగల ఓగురుమూర్తీ! నాకొరకు శ్రమపడి మీయంతట మీరే యిచ్చటికి వచ్చితిరి మిమ్ముల నుతించుటకు ఆ ఆది శేషునికి గూడ తరముగాదు నావంటివానికి సాధ్యమగునా! అని భావము.

కం॥ తల్లివి దండ్రివి దాతవు
వల్లభుడవు బాంధవుడవు • వసుధీశుడవున్
తెల్లమిగ దేవుడవు నీ
వల్లగదా యిట్టిబోధ • వర్తనవినుటల్. ॥౨౦౫॥

ఓ సద్గురూత్తమా! తల్లిదండ్రి దాత ప్రభువు బంధువు రాజు దేవుడు నిశ్చయముగా నీవేనని భావించుచుంటిని అదెట్లంటె యీ బోధ ప్రవర్తనము నీవల్లగదా విన్నదని భావము.

కం॥ అని శిష్యుఁడన్న మాటకు
మనమున హర్షించి గురుడు । మరియిట్లనియెన్
వినవోయి శిష్యరాయా
విని నా కోరికనుదీర్చు । వేడుకయైనన్. ౨౦౬॥

ఈరీతిగ శిష్యుఁడన్న మాటలకు గురుమూర్తి తన మనస్సులో సంత సించి ఇట్లనియె ఓ శిష్యాగ్రణీ! నాకోర్కె దీర్చుట నీకిష్టమైన నామాట వినుమని భావము.

కం॥ నేజెప్పినట్లు జెప్పర
నేజెప్పిన బోధ లెస్స । నీ కతికుంటే
నేజూతు నీచమత్కృతి
రాజితసుగుణైక సార । రమ్యవిచారా. ౨౦౭॥

ఓ శిష్యుడా! ప్రకాశించుచున్న గుణముల సారము గలిగిన మంచి విచారము గలవాడా! నేను నీకు జెప్పినబోధ నీమదికి నాటెనేని నేను జెప్పినట్లు జెప్పుము నీ చమత్కారము జూతున (అని అనెన)ని భావము.

కం॥ అని గురుడు తననుబల్కిన
వినిశిష్యుడులేచి మొ్రొక్కి । వినుతించి ముదం
బున జెప్పదొణగె మునుతా
వినినట్లుగ గురుని మదికి । వేడుకదోపన్. ౨౦౮॥

అని యీరీతి సద్గురుడు అడుగగానె శిష్యుడులేచి నమస్కరించి స్తోత్రముజేసి సంతోషముతో సద్గురు మనస్సుకు మోదము గలుగునట్లుగ పూర్వము తాను విన్నబోధను చెప్పుటకు నారంభించెనని భావము.

కం॥ నే మొదలులేని మేనును
నాముచ్చట స్వప్నమనుచు । నమ్మదగుసుమీ
నే మేలుకొన్న లేనని
నాముచ్చట నేను నిల్వ । నరఘుడియైనన్. ౨౦౯॥

ఓ గురువర్యా! మూలములేని నేను మేనులు నాముచ్చట స్వప్నము వంటివని నమ్మవలయును నేను మేలుకుంటె లేనని నాముచ్చట నేను అర గడియైన నిలువమని భావము.

కం॥ లేనినే లేకవచ్చిన
నేనేగిన నుండుబయలు। నేనెరుగను యీ
నేనుండి దాన్ని గనుగొని
నేనేగితె మరలబుట్ట। నిక నెన్నటికిన్. ౨౦౦॥

ఓగురుమూర్తీ! లేని నేను లేకుండగానె వచ్చినట్లాతె నేను పోయిన తరువాత ఉండె పరిపూర్ణమును నేను తెలుసుకొనను నేనుయుండి ఆ పరిపూర్ణ మును తెలుసుకొన్న తరువాత నేను పోతె తిరిగి యెన్నడురాను అని భావము.

కం॥ లేని నా రాకపోకలు
దేనందున దోచబడె। నదెబయలు సుమీ
దానిని గురుకృపచేగని
నేనేగిన రానుపోను। నిజమెన్నటికిన్. ౨౦౦॥

ఓ గురుదేవా! అసత్యమైన నాయొక్క జనన మరణములు దేని యందు దోచునో ఆదె పరిపూర్ణము సుమా సద్గురు కటాక్షముచే ఆ పరిపూర్ణ మును చూచి నేనుపోతె యెన్నటికి నాకు రాకపోకలు యుండవు యిది నిజ మని భావము.

కం॥ తనువుకు నాకును వేరని
యనగూడ దదెట్టులనిన। ననవరతంబున్
పనులన్ని తనువునేతే
కనుజేయగ వశముగాదు। గావునసామీ. ౨౦౨॥

ఓ స్వామీ! శరీరమువేరు నేనువేరు అని అనగూడదు అది యెట్లంటె శరీరముగాని నేనుగాని లేకుంటె యేపనులను చేయుటకు సాధ్యముగాదు కాబట్టి నేను నాశరీరము ఒక్కటేనని భావము.

కం॥ ననురమ్మని పొమ్మనితా
ననదుసుమీ బట్టబయలు । నాకై నేనే
తనువును జగమునుగైకొని
చనుదెంచుట చనుట నాకు । సహజము తండ్రీ. ౨౧౩॥

ఓ నాయనా! నన్ను రమ్మనిగాని పొమ్మనిగాని పరిపూర్ణము అనదు నా అంతట నేనె శరీరప్రపంచముల దీసుకొని వచ్చుచును పోవుచును యుందును యిదినాకు సహజమని భావము.

కం॥ ప్రకటమగు బట్టబయలున
సకలముతో లేకవచ్చి । చనుదర ఘడియన్
వొకకోటి మార్లు నేనా
నొకవేళ్ళను లేనటంచు । నూహబొడమినన్. ౨౧౪॥

ఓ ప్రభువర్యా! ప్రసిద్ధమైన పరిపూర్ణమునందు సర్వప్రపంచము తోబాటు లేని నేనుగూడ ఒక అరగడియ కాలములో ఒక కోటిసారులు వచ్చును పోవుచు నుందును ఒకవేళ్ళ నేనులేను అనేడూహ గలిగినచో నేను రాను అని భావము

కం॥ లేనినే నెరుగకుండిన
మేనుండదు నేనునిల్వ । మేనుండక యీ
మేనగు నాజోలొల్లని
దానిని గుర్తెరిగి నేను । తలగితె చాలున్. ౨౧౫॥

ఓ దేశికవర్యా! అబద్ధమైన నేను అబద్ధమని తెలియకుండ యున్నచో శరీరముండదు నేను నిల్వను శరీరము లేకుండ యీశరీరమైన నాముచ్చటలు లేని పరిపూర్ణమును నేను తెలుసుకొని తొలగిపోతె చాలునని భావము.

కం॥ మనము మన పెద్దలందరు
చనుదేరక మనుపువారు । చనినన్ గలయీ
ఘనమునుగని మనమేగిన
చనదుగదా మననుబోలి । సారవిచారా. ౨౧౬॥

సారమునే విచారించు ఓ గురుమూర్తీ! మనము మనపూర్వులు అందరు

రాకముందు వారుపోయిన తరువాతను యున్న యీ గొప్ప పరిపూర్ణమును జూచి మనము పోయినచో మనవలె యీ పరిపూర్ణము బోదని భావము.

కం॥ మేనుమజ్జనని నేనే
మేనికి జనకుడను నేను । మేనులొకటియై
దేనందు సంచరింతుమొ
దానిని పరిపూర్ణమనుచు । దలచెదనయ్యా. ౨౧౭॥

ఓ గురువర్యా! శరీరము నాతల్లి నాశరీరమునకు నేనే తండ్రిని నేను శరీరములు ఒక్కటి అయ్యి దేనియందు దిరుగుచుందుమో దానినే పరిపూర్ణ మని అనుకుందునని భావము.

కం॥ మేనున్నది నేలేకను
నేనెరుగను మేనులేక । నేనిల్వను యీ
మేనుకు నేనుకు మూలము
గానను మముమేమె సృజన । గావింతుమయా. ౨౧౮॥

ఓ గురుస్వామీ! నేనులేకుండ శరీరమున్నది నాకు తెలియదు శరీర ములేకుండ నేనుయుండను ఈ మేనునేనులకు మూలమేదో దానిని చూడలేను మమ్ములను మేమె సృష్టించు కొనుచుందుమని భావము.

కం॥ నేనిల్వ జగములేకను
నేనేగిన జగములేదు । నిజమీజగమున్
నేనును లేనప్పుడు గల
దానిని పరిపూర్ణమనుచు । దలపోయదగున్. ౨౧౯॥

ఓ గురుదేవా! ప్రపంచము లేకుండ నేను నిలువను నేను పోయిన తరువాత ప్రపంచములేదు యిదినిజము నేను జగత్తులు రెండును లేనప్పుడు యున్న దానిని పరిపూర్ణమని భావించవలయునని భావము.

కం॥ లేని నేమాయమైనను
మానవులది మరుపు మూర్ఛ । మరణంబును గా

ధానిద్రయు నిర్నిద్రన
నేనని విని మృషవి నమ్మ • నేర్తునెవాటిన్. ||౨౨౦||

ఓ గురుమూర్తీ! లేనినేను లేకుండ పోయితె మానవులా పోవుటమును మరుపు మూర్ఛ మరణము గాఢని ద నిర్నిద్ర అని అందురు నేనా మాటలను విని అబద్ధమని అనుకుందునుగాని నిజమని ఆమాటలను నమ్మనని భావము.

కం॥ వినుభాష్యములను శాస్త్రను
జనములు ననుగట్టియుంచ • జనక నిలుతునా
చనుదొత్తునాకు నేనై
గనుక నెనను నమ్మరెపుడు • ఘనులగు వారల్. ||౨౨౧||

ఓసద్గురు స్వామీ! ప్రపంచములో మానవులు భాష్యములనే శాస్త్రచే నన్ను కట్టివేసియుంచినను పోకుండ నిలువను నాకునేనై వచ్చును పోవుచు నుండును కాబట్టి మహాత్ములెవరు ననునమ్మరని భావము.

కం॥ నానాభాషలచేతను
నానావిధశాస్త్రతతుల • ననునమ్ముటకై
నేనే రచించి పెట్టితి
నానా దేశములయందు • నరరూపమునన్. ||౨౨౨||

ఓ నాయనా! వివిధ భాషలచేత అనేక శాస్త్రములను అనేక దేశముల యందు నన్ను నమ్మకొరకు మానవ స్వరూపముచే నేనే వ్రాసి యుంచితినని భావము.

కం॥ ఒకచోట నవ్వుదును వే
రొకచోటను మిడుకుచుందు • నొకచోటనునే
బ్రకటమగుదు లేకుందును
నొక చోటను యిట్టి • చేష్ట • లుండునునాకున్. ||౨౨౩||

ఓ పరిపూర్ణభావా! ఒక స్థలములో నవ్వుచు ఒక స్థ ములో దుఃఖ పడుచు ఒకస్థలములో ప్రకాశించుచు ఒక స్థలములో లేకుండ నుందును

యీ క్రియలు నాకు సహజముగా నుండునని భావము.

కం॥ కావేటి కాలువలవలె
నావల్లనె కల్పనౌను ‌• నానావిద్యల్
యీ విశ్వమందు విశ్వము
నావెంటనె వచ్చు పోవు • నావలెనుసుమీ. ॥౨౨౪॥

ఓ గురుశేఖా! ఈ ప్రపంచములో కావేరి అను నదియొక్క కాలువల వలె నావలన అనేకవిధములగు విద్యలు కల్పితములగు చుండును. యీ ప్రపంచములో నేను వచ్చుచు పోవుచున్నట్లు నాతోడనె వచ్చుచును పోవుచును యుండునని భావము.

కం॥ నేనాడుదాన నౌదును
నేనే మగవాడనౌదు • నేనే నన్నున్
నే నీవటంచుగూడుదు
నేనేనను జెరుప మనుప • నీగుదుసుమ్మీ. ॥౨౨౫॥

ఓ సద్గురునాథా! నేనే స్త్రీ రూపము పురుషరూపమును పొందుచుందును నేనేనన్ను నేను నీవనుచు కలిమిడి జేయుచుందును నేనే నన్ను చెరచుటకు బాగు చేయుటకును ప్రయత్నించు చుందునని భావము.

కం॥ నేనుల మేనుల కప్పను
నేను బయల్ నన్నెరుగదు • నేచనుదొత్తున్
మేనై నిముషములో నిది
మానుగ వావృత్తి నేనే • మాయనుసుమ్మీ. ॥౨౨౬॥

ఓ గురువర్యా! నేను మేనులయొక్క సమూహమును నేను పరిపూర్ణము నన్ను తెలుసుకొనదు నేను శరీరమై ఒకనిమిష కాలములో వచ్చుచును పోవుచును యుందును. ఇదినాకు సహజ వ్యాపారము నేనే మాయను సుమా అని భావము.

కం॥ నేను గాకొక టిశుద్ధ
జ్ఞానముగల దనుచు బల్కు • జ్ఞానుల మాటల్

పూనివినదగదు శుద్ధ
జ్ఞానంబననేనే నేను • లేనిదియౌనే. ॥౨౨౭॥

ఓ నాయనా! నేను అనునది గాకుండ శుద్ధజ్ఞానము అనునది వేరే ఒకటియున్నదని చెప్పె జ్ఞానుల మాటలను శ్రద్ధగా వినదగదు శుద్ధజ్ఞానమనగా నేనే నేనులేనిది యేదికాదని భావము.

కం॥ నేమాత్రిముందునని యెను
నామాయల కూతలన్ని • యరసిన సుప్తిన్
యేమాయు మరణమప్పుడు
యేమాయను గురునిమాట • నేమాయనయా. ॥౨౨౮॥

ఓ సద్గురునాథా! నేను మాత్రము యుందును అనిచెప్పె నామాయ మాటలను విచారించి చూడగా నిద్రియందు మరణమందు గురునిమాటలు అబద్ధమగునుగదా కనుకనేనే మాయనని భావము

కం॥ నేనన్న నహమహంబన
నేనుసుమీ యహమటంచు • నేనెప్పుడంటే
నేనపుడు బుట్టుటది జన
నేను గతించుట మటంచు • నీవెరుగయ్యా. ॥౨౨౯॥

ఓ స్వామీ! నేను అనగా అహము అహమనగా నేను సర్వదానేను అహమనియంటె నేనపుడు బుట్టుట అనియు అహము పోగానే నేను చచ్చుట అనినీవు తెలుసుకొనుమని భావము.

కం॥ నేననునాలవ దేహము
మేనన నాలోని మూడు • మేనులు సుమ్మీ
నేను మేనన నదొక్కటే
కానిది తనమూలమరయ • గనరాదుసుమీ. ॥౨౩౦॥

ఓ గురుమూర్తీ! నేను అనగా నాలుగవ శరీరము మేను అనగా నాలో యుండె మూడు శరీరములు నేను మేనులనగా అది ఒక్కటే కాకుంటె తనకు మూలాధారము కనపడదుగదా అని భావము.

కం॥ అంగము లింగము గలసుటె

లింగ శరీరంబటంచు • లెక్కకు వచ్చెన్
లింగం బంగము నెడసిన
లింగముశక్యాకు నేనె • లింగంబనినన్. ॥౨౩౦॥

ఓ గురూత్తమా! అంగము లింగము అనురెండు గలసి యుంటె లింగ శరీరమని చెప్పుదురు లింగాంగముల రెంటిని వేరుజేసి నేనెలింగమును అని యంటె లింగము అబద్ధమగునని భావము.

కం॥ లింగము విక్షేపంబన
నంగం బావరణమనిన • నగు నీరెండే
లింగశరీరము దీనికి
భంగము తనమూల మరయ • బడినప్పుడగున్. ॥౨౩౨॥

ఓ ప్రభువర్యా! విక్షేపమనగా లింగము ఆవరణమనగా అంగము అగును యీ రెంటి సంయోగమే లింగశరీరము తాను తనకు మూలకారణమును తెలుసుకున్న తరువాత యీలింగశరీరమునకు భంగము వచ్చునని భావము.

కం॥ ఎరుకన మరుపనరానిది
పరిపూర్ణం బీశ్వరుడన • బడునెరుకెరుకన్
మరచినజీవుం డనబడు
నెరుకచలము నెరుగ నరుగు • నెరుకమరుపులున్. ॥౨౩౩॥

ఓ గురుదేవా! యెరుకయని చెప్ప నలవిగానిది పరిపూర్ణము యీశ్వరుడనియు చెప్పబడును యెరుక యెరుకను మరచుటచే జీవుడనబడును యెరుకా పరిపూర్ణుని తెలుసుకున్నచో యెరుకమరుపులు రెండును పోవునని భావము.

కం॥ ఎరుకన సత్వగుణంబని
మరుపన తామసమటంచు • మరియీరెండున్
సరియైన రాజసంబని
నరులెన్నిరి మూటివిడువ • నరవాము సుమ్మీ. ॥౨౩౪॥

ఓ గురుమూర్తీ! యెరుక అనగా సాత్వికగుణము మరుపు అనగా

తమోగుణము యీయెరుక మరుపులు రెండు సమముగా నున్నచో రాజస గుణము అని మానవులు చెప్పిరి కాబట్టి యీ మూడింటిని విడువవలయునని భావము.

కం॥ నన్నెరుగనట్టి బయటన్
యెన్నడులేనట్టి నేను । యీవిశ్వమునై
వున్నట్టులుండి నే లేం
దున్నదిగని నేనుబోతె । దుండణగుసుమీ. ౨౩౫॥

ఓ సద్గురువర్యా! నన్ను తెలియని పరిపూర్ణములో యెన్నడులేని నేను యీ ప్రపంచమునై యున్నట్టెయుండి నేనులేనిచో ఉన్నది జూచి నేను బోతె అల్లరియుండదని భావము.

కం॥ ఈయచలమొకటి బ్రహ్మని
మాయామయమైన విశ్వ । మంతయు నేనన్
చాయమెరుంగక ననునరు
లీయెడ బ్రహ్మంబటంచు । లెక్కడనగుదున్. ౨౩౬॥

ఓ నాయనా! ఈ పరిపూర్ణము ఒక్కటే బ్రహ్మ అనియు మాయ వికారమగు యీ ప్రపంచమంత నేను అనియు నిజము తెలియక యీ మానవులు నన్ను యీ సమయములో బ్రహ్మ అని అంటె నేనే బ్రహ్మనగుదునా! అని భావము.

కం॥ భూమను భద్రాచలమని
రాములనుచు లేని నన్ను । రక్షణమునసే
మీమాట నెరి గుళక్యని
నామాటను మరచియునికి । నయమనితోచెన్. ౨౩౭॥

ఓ దేశికోత్తమా! పరిపూర్ణము భద్రాచలమనియు లేనినన్ను రాము లనుచు ఈ అరనిమిషములో మీమాటవలన తెలుసుకొని అసత్యమని నా మాటను మరచియుండుటే మంచిదని తోచుచున్నదని భావము.

కం॥ నాగురుడు నాకు దెల్పిన
యీ గురుబోధంతమీకు । యిప్పుడు నేనున్

బాగుగ వినజెప్పితిసుమి
యోగురువర్యయని । శిష్యుడూరకయున్నన్. —౨౩౮॥

ఓ గురువర్యా ! నాగురుమూర్తి చెప్పినబోధను నేను వినిన దానిని యిప్పుడు మీకు చెప్పితిని అని శిష్యుడు యూరకుండెనని భావము.

కం॥ విని శిష్యుని వచనోక్తుల
మనమున హర్షించి గురుడు । మస్తకమునచే
య్యునిచి తొడమీదజేర్చుక
తనశిష్యుని మేను నిమిరి । తానిట్లనియెన్. —౨౩౯॥

సద్గురుమూర్తి శిష్యుని మాటలను విని సంతోషించి తనతొడమీద కూర్చుండబెట్టుకొని శిరస్సున చెయ్యిబెట్టి శరీరమును నిమురుచు యిట్లని బలికెనని భావము.

కం॥ నీవంటి గట్టివాడిక
భూవలయమునందు ముందు । బుట్టడు వెనుకన్
నె వినలే దున్నాడం
చీ వేళ్ళకునిన్నె చూస్తి । నిట శిశిష్యా. —౨౪౦॥

ఓ శిష్యుడా ! నీవంటి పట్టుదలగలవానిని యీ ప్రపంచములో చూడ లేదు యున్నాడని యిదువరకు వినలేదు ముందుబుట్టడు శబాస్ నిన్నే చూచితి నని భావము.

కం॥ చందురుని చీముద్దా
డిందనిన ట్లిపుడు నీవు । యీసదోబ్ధన్
జెందితివి నీకు సరి జగ
మందెవ్వరులేరు నిన్ను । మదిమెచ్చితిరా. —౨౪౧॥

ఓ శిష్యుడా ! చంద్రున్ని చీమ ముద్దాడింది అన్నట్లు ఈ నిర్మలమగు పరిపూర్ణబోధను నీవేపొందితివి నీతో సమానులు ఈ ప్రపంచములో యెవరు లేరు నిన్ను నా హృదయములో మెచ్చుకుంటినని భావము.

కం॥ అని మెచ్చి యేమియిచ్చెద
వని గురుదక్షిణ నటంచు । నతడడిగిన న

న్ననిపల్కె శిష్యరత్నము
విని యిదియిక ముట్టబోక । విహరించుమనన్. ౨౪౨॥

అనుచు శిష్యుని మెచ్చుకొని గురుమూర్తి యిట్లనియెను ఓ శిష్యుడా! గురుదక్షిణ యేమియిచ్చెదవు శిష్యశ్రేష్ఠుడా గురుమాటలు విని నన్నె అని అనెను శిష్యునిమాటలు విని యిక దీనిని ముట్టుకొనకుండ తిరుగుచుండుమని భావము.

కం॥ విని శిష్యుడు గురుమూర్తిని
గనుగొని చిత్తరువు ప్రతిమ । గా నిలచున్నన్
తనశిష్యుని హస్తములన్
గొని దగ్గర దీసుకొని । కొడుకా యనుచున్. ౨౪౩॥

కం॥ చెప్పదొడంగెను మునుతా
జెప్పని ముచ్చట్లు కొన్ని । సేమముకొరకై
యొప్పులకుప్పా వోమా
యప్పాయని దువ్వుకొనుచు । నతిదయతోడన్. ౨౪౪॥

గురుమూర్తి మాటలను విని శిష్యుడు గురుమూర్తిని చూచుచు చిత్తరు బొమ్మవలె నిలచుండగా సద్గురుమూర్తి తన శిష్యుని చేతులను బట్టుకొని కొడుకాయని బిల్చి దగ్గరకు దీసుకొని ఓ నాయనా! మంచిగుణములు గల వాడా! అని దువ్వుచు ముందు తాను చెప్పనిమాటలను శిష్యుని క్షేమము కొరకై చెప్పుటకు ప్రారంభించెనని భావము.

కం॥ ఒప్పకుమీ పరబోధల
తప్పకుమీ బోధనెపుడు । దలచుట మదిలో
రొప్పకుమీ సచ్ఛిష్యుల
చెప్పకుమీ దీన్ని దుష్ట । చెనటుల కెపుడున్. ౨౪౫॥

ఓ శిష్యుడా! ఇతరులబోధను ఒప్పుకొనకు యీబోధను మరచిపోకు శిష్యులను కసిరించు కొనకు దుష్టులకు ఈ బోధను చెప్పకుమని భావము.

కం॥ కూడకుమీ దుర్జనులను
పీడకుమీ సాధుజనుల । వితతి స్నేహం
బోడకుమీ గురుసేవకు
పాడకుమీ పరులనింద । పాటలరీతిన్. ౨౪౬॥

ఓ శిష్యుడా ! దుర్మార్గులతో స్నేహముజేయకు మంచివారి స్నేహమును విడవకు గురుశుశ్రూషకు వెనుకదీయకు యితరుల నిందించకుమని భావము.

కం॥ మీరకుమీ గురువాజ్ఞను
చేరకుమీ దుష్టులంత । చేరినచోటన్
దూరకుమీ బోధనువిని
యూరకుమీ సాధుజనుల । యందున తప్పుల్. ౨౪౭॥

ఓ శిష్యుడా ! సద్గురుమూర్తి ఆజ్ఞను అతిక్రమించి నడుచకుము దుర్మార్గులు కూడియున్న స్థలముకు పోకుండుము యీబోధనంత విని నిందించకుము సత్పురుషులయందు తప్పులను వెదకకుమని భావము.

కం॥ జనులవలె జరుపుపనులను
నను నిను జనవితతి దిట్ట । నడువకు మెపుడున్
నినునీవు పొగడు కోకుము
నినుబోలరటంచు జనుల । నిందించకుమీ. ౨౪౮॥

ఓ శిష్యుడా ! ప్రపంచములో మానవులందరు చేసినట్లుగనె నీవు పనులను చేయుచుండుము నన్ను నిన్ను ప్రజలందరు తిట్టునట్లు నడువకుము నిన్ను నీవు స్తోత్రము జేసుకొనకుము నీవంటివారు కారని అన్యుల దూషించకుమని భావము.

కం॥ శ్రద్ధబోధందునిలి ప
శ్రద్ధను నీనేర్పుచేత । రూఢించితివా
బద్ధత్వమంత బాయును
బుద్ధికి సరిపడితె దీన్ని । బూనగ దోయీ. ౨౪౯॥

ఓ శిష్యుడా! బోధయందు శ్రద్ధనుంచి నీచాకచక్యముచే అశ్రద్ధను పోగొట్టుకుంటివా నీయందుగల బద్ధకము పోవును నీకు యిష్టమైతె అట్లు జేయుమని భావము.

కం॥ సంశయమె జన్మహేతువు
సంశయమె గురునిమాట • చవిగొన నియదీ
సంశయమె కీడు నొందవును
సంశయమెడబాస్తివేని • చాలును వత్సా. ॥౨౫౦॥

ఓ శిష్యుడా! జన్మకు కారణమయ్యె గురుని మాటయందు రుచికలగ నివ్వనిదియు ఆపదలను కలుగునట్లుజేయు సందేహమును విడచితివా చాలునని భావము.

కం॥ నరులంత మెచ్చనడువను
హరిహరవిధి శతమఖాము • రాదులకైనన్
తరముగాదనగ మనకిక
తరమౌనన వశమెమాకు • ధాత్రినిపుత్రా. ॥౨౫౧॥

ఓ కొడుకా! ప్రపంచములోని మానవులందరు మెచ్చునట్లుగా నడవ వలయునన్న హరిహర బ్రహ్మేంద్రాది దేవతలకే వశముగాదనగా మననుంచి మాత్రము అవుతుందా! నాయనకాదని భావము.

కం॥ అందరిని చచుకుచుందురు
కొందరు దుర్మార్గవృత్తి • కుటిల జనంబుల్
యెందరినో గిచ్చికరుచుచు
మందలవలె కోతులుండు • మాడిక్కశిక్కురా. ॥౨౫౨॥

ఓ నాయనా! ప్రపంచములో దుష్టస్వభావముగల కొందరు మానవులు ప్రతివారితో కలహించుచుందురు. అదెట్లంటె గుంపులు గుంపులుగా చేసిన కోతులు యెందరిని గీకి కరుచుచుండునని భావము.

కం॥ ఈ చెప్పిన గురుబోధను
తాచెవినిడి బయలుగాంచి • తనలేమినిజం
బైచనియె శిష్యుడప్పుడు

లేచెనుగురు దవల మాట • లేదామీదన్. ॥౨౫౩॥

సద్గురుమూర్తి చెప్పిన యీ నిర్మలమగు బోధనువిని పరిపూర్ణమును చూచి తన మిధ్యను తెలుసుకొని శిష్యుడు పోయెను అపుడు సద్గురుమూర్తి లేచెను ఆతరువాత ఆవలిమాట లేదాయెనని భావము.

కం॥ శరధికరితురగ సితకర (౧౭౮౪)
పరిమితమైనట్టి శాలి • వాహన శకమం
దురచిస్తి మాఘపౌర్ణిమ
వరకివి దుందుభియనేటి • వత్సరమపుడున్. ॥౨౫౪॥

కం॥ పదియిరువై యెదులు యీ
సదమల కందములు వీట్ని • (౨౫౦) సదయామతులై
ముదమున మీరు వినెదరని
మదిలోపల దలచి చేస్తి • మానవులారా. ॥౨౫౫॥

ఓ మానవులారా! పదినేడు వందల యెనుబది నాలుగ (౧౭౮౪)వ శాలివాహన శకమునకు సరియగు దుందుభినామ సం॥ మాఘ శుక్ల పౌర్ణమి దివసము వరకు రెండువందల యాబయి (౨౫౦) కందపద్యములను దయామయులగుమీరు సంతోషముగా విందురని నామనస్సులోఆలోచించి వ్రాసితినని భావము.

కం॥ ఎవరీపద్యవరం బన్నియు
వివరింతురొ వారికెల్ల • విద్యా విద్యల్
దవిలిబాధింప వెన్నడు
భవనాశస్థితులు లేక • ప్రబలుదు రెపుడున్. ॥౨౫౬॥

యెవరు యీ పద్యములను చక్కగా బోధించెదరో అట్టి వారందరు విద్యావిద్యల బాధలను పొందరు ఉత్పత్తిస్థితి లయాదులు లేకుండా నుందురని భావము.

కం॥ అర్థము దెలియక గ్రంథము
వ్యర్థన్బలికి నిందజేయు • వ్యర్థుల మాటల్
వ్యర్థములని యీ గ్రంధం

బర్థము సద్గురుని వలన • బాగుగ వినుడీ. ॥౨౫౭॥

అర్థము తెలియని వ్యర్థులు ఈ గ్రంథమును తప్పని చెప్పినను మీరు నమ్మకుండ సద్గురుని వలన యీ కందముల యొక్క అర్థములను తెలుసుకొనుదని భావము.

కం॥ పాటసుమీ భక్తుల కిది
బాటసుమీ బోధజెంద • భ్రమరాకుండన్
కోటసుమీ కందములను
తోటసుమీ దీన్నితొలగ • ద్రోయక వినుడీ. ॥౨౫౮॥

ఈ గ్రంథము భక్తులకు ఒకపాట బోధజెందుటకు ఒకబాట భ్రమ కలుగకుండుటకు ఒకకోట యిది కందములనేతోట దీని వదలకుండ వినందని భావము.

కం॥ పరమహంసా శ్రమధరుని
పరిపూర్ణపు బోధవాని • పనులు సమమె వా
ర్నెరిగెరుగక నుతినిందలు
గరపిన తత్ఫలము ప్రజల • కగు నిజమునుమీ. ॥౨౫౯॥

పరమహంస (సన్యాస) ఆశ్రమము పొందినవాని పనులును పరిపూర్ణ బోధ పొందినవాని పనులు సమములుగావు వారిని తెలిసి తెలియక నుతి నిందలుజేసిన ఫలములు ప్రజలు అనుభవింతురని భావము.

కం॥ ప్రతిదినము జదివి యెవరీ
ప్రతి నర్చనచేతు రట్టి • ప్రజలకు బోధ
స్థితికుదురగలదు గురుకృప
కతిపాత్రులు వారు వారి • కడ్డముగలదే. ॥౨౬౦॥

యెవ్వరు యీ గ్రంథము ప్రతిదినము తప్పకుండ పూజించెదరో అట్టి మానవులకు బోధస్థితి గలుగును వారు గురుకటాక్షమునకు పాత్రులగుదురు వారికి ఆటంకములు యేమిలేదని భావము.

కం॥ ఇతర మెరుంగని సతమం

దతి మృషమై కానుపించు • నట్టి మనము యీ
కృతి గురుశిష్యులు వారల
యిత రేతర వాగ్విలాస • మివి మృషలుసుమీ. ॥౨౬౧॥

అన్యము దెలియని పరిపూర్ణము నందు మిక్కిలి మిధ్యయై కనుపించే మనము యీ గ్రంథము గురుశిష్యులు వారి వాదోపవాదములు యివియన్నియు మిధ్యయేసుమా అని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణవిరచిత క్షరాక్షరోపాధి ద్వయదోష రహిత గ్రంథసమాప్తః.

ఇతి, పూర్ణానంద వాడపల్లి ఆగదాసు రాజయోగిచే
వ్రాయబడిన (క్షరాక్షరోపాధి ద్వయదోష
రహిత పరమతత్వ కందములయొక్క)
భావార్థ సహితములు.
సంపూర్ణము.

---

సీ॥ శ్రీకర లోకప్రసిద్ధి కెక్కినవోరు । గల్లునివాసా గ్రగణ్యుడైన। పరమ భక్తుడు వాడపల్లి పాపయసతి । కనకమాంబకుబుట్టి కాంక్షమీర । రత్నమాంబను ధర్మపత్నిగా జేపట్టి । జననమరణభ్రాంతి ఝుకుపుదీర । వరనేతి వేంకటేశ్వరులను సేవించి । పరిపూర్ణభావంబు నెరిగినట్టి । ఆగదాసుడ రాజయోగిపూర్ణానంద । ఆఖ్యుండనై పెద్దలాజ్ఞబూని॥

గీ॥ చంద్ర గిరి కరి శశి (౧౮౭౧) సంఖ్య శాలివాహ । శకమునను విరోధాబ్ది యాషాఢశుక్ల । పౌర్ణమి వరకీ కందపద్యములకు । వ్రాసితిని గురు దయన భావార్థములను॥

ప్రీమియర్ ప్రెస్, గంజ్ బజార్, సికింద్రాబాదు. ఫోన్ నం. 74806